# చెమటకాయల బాధనుండి ఉపశమనానికి టాల్కం పౌడర్ కాదు నైసిల్ కావాలి!



## నైసిల్ వాడండి

**చెమటకాయల బాధనుండి శీఘ్ర ఉపశమనం పొందండి**






HTB-GLL/8806

నైసిల్ చెమటకాయల బాధనుండి ప్రతిదశలోనూ ఉపశమనాన్నిచ్చేందుకై ప్రత్యేకించి రూపొందించబడిన ఔషధయుక్త పౌడర్. టాల్కం పౌడర్లవలెకాక ఇది క్రిమిద్రవ్యను అరికట్టి బాధ శ్రుతిమించకుండ చేస్తుంది. 1. అతిగా వచ్చే చెమటను ఆపుతుంది. 2. చెమటను పీలుస్తుంది. 3. దుర్గంధకారక క్రిములను ధ్వంసం చేస్తుంది. 4. శరీరానికి హాయినిస్తుంది.

మంచి ఆరోగ్యానికి మూలస్థానం

**గ్లాక్సో**

### ఉషాకిరణ్ మూవీస్

# మల్లెమొగ్గలు

## పాత్రల పరిమళాలు

ఇదిగో ఇటు చూడండి...ఇది మల్లెమొగ్గల తోట. ఏ మొగ్గను పలకరించినా విన్పిస్తుంది పసందైన పరిమళాల పాట. అందులో అన్నీ మొగ్గలేనా అంటే... అదీ కాదు. అరవిరిసిన ప్రణయభావాల మొగ్గలూ ఉన్నై .... విరబూసిన పువ్వులూ వున్నై. మకరందాల నవ్వులూ ఉన్నై...పసిడి పసిమొగ్గలను కసికసిగా మసిచేసే జ్వాలలూ ఉన్నై.

ఇక్కడ చూడండి ఎన్ని ముగ్గులో. ముగ్గులు కావవి కన్నెబుగ్గల సిగ్గులు. సుందరాంగుల నిగ్గులు. వీటన్నిటినీ చూసి మురిసిపోతూ మెచ్చుకుంటూ తన తొలి యౌవనదశలోని నులివెచ్చదనాలను నెమరేసుకుంటోంది ఈవిడ .... ఈవిడే మిటి? ఈ బామ్మగారు. పేరు నాగమ్మ. నాగమ్మకు ఇద్దరు కుమార రత్నాలు. ఒకడు శ్రీరాములు. మరొకడు పాపారావు. శ్రీరాములు కూతురు గంగ. కలికితనం, చిలిపిగుణం, అందచందాలు కల •





బోసుకున్న కన్నెమల్లె ఈ గంగ. లేత వెన్నెల పోతపోసిన ప్రణయాంతరంగ ఈ గంగ. గంగ ముగ్గులేస్తే నిత్య కల్యాణశోభలు నర్తించాల్సిందే. రథం ముగ్గేసిందో శ్రీకృష్ణపరమాత్మదే పరిగెత్తుకొస్తాడు. ముగ్గులో నిగ్గుతేరిన హస్తం గంగది.

ఈ వయసులో కూడా అందర్నీ అదుపులో పెట్టగల సమర్థవంతురాలు నాగమ్మ. పెద్దకొడుకు శ్రీరాములున్నాడంటే ఆ ఊరికి పెద్ద. మరి పాపారావో! ఎదురుతిరిగినవాళ్లను నిర్దాక్షిణ్యంగా కాలు, చేయి విరిచిపారేయగల సమర్థుడు. ఎదుటివారి తప్పులెంచడం తప్ప తన తప్పులు కప్పిపుచ్చుకునే గురివింద పెద్ద. అందుకే తనతోటలో కాయలు కోసిన నేరానికి పుల్లిగాడి కాళ్లేతులు విరిచేశాడు. శివ తల్లి శాంతమ్మ రీలాంటిశాంతమ్మను విషం పెట్టి చంపేశాడు. పారిజాతంతో కులకడం మరిగి కట్టుకున్న పెళ్లాన్ని నిర్లక్ష్యం చేశాడు.

ఔను...ఇందాక టైలర్ శివ అని ఓ పేరొచ్చింది గుర్తుందా? శివ శాంతమ్మ కొడుకు. శాంతమ్మకు శివ స్నేహితులందరూ కొడుకుల్తో సమానమే. శివకు కుట్టుపనిలో నైపుణ్యం ఎంత వుందో

అంతకుమించిన సంగీత సాధన కూడా వుంది. అతని స్నేహితులందరూ అతని పాటలు, పద్యాలంటే చెవికోసుకుంటారు. గంగకు శివలోని సంగీతారాధన నచ్చింది. అందుకే ఆమె అతన్ని మెచ్చింది. అతనికి మనసిచ్చింది. శివ గంగ రెండు హృదయాల మధ్య నిండు ప్రేమ చోటు చేసుకుంది.ఒకరిలోని సంగీతపు స్వరాలు, మరొకరిలోని ముగ్గుల ముత్యాల సరాలు జత చేసుకున్నై.

శివగంగల అంతరంగాల సంగమంలో అనురాగ స్రవంతులు మానసికంగా పెనవేసుకున్నై. అవి విడివడని బంధాలు. అవి మల్లె మొగ్గల సుగంధాలు. ఒకరి భావనలొకరికి మన్మధబాణాలు. ఒకరి చూపులొకరికి పంచప్రాణాలు. అది ఒక అనిర్వచనీయమైన ప్రణయ కావ్యం. అలిఖితం. అయినా అంతరంగ ముద్రితం. శివగంగల ప్రణయ ప్రణయాంకురార్పణ జరిగినచోటే పాపారావులో ప్రళయావిర్భావం జరిగింది. పాపారావు పసిగట్టాడు. శివపై పగ బట్టాడు. శివను కాళ్లేతులు విరిచి కాల్వలో పారేశాడు. పీడ విరగడైందని ఆనందిం





చాడు. శివగంగలు శారీరకంగా విడివడినా మానసికంగా ముడివడిపోయిన అనురాగాన్ని అగ్నికి ఆహుతి చేయడం ఆ దేవుడికి కూడా అసాధ్యమేనేమో. గంగ జీవితంలో కొత్త అధ్యాయం ప్రారంభమైంది.

మేనమామ భూషణం పిలుపును పురస్కరించుకుని గంగను మేనమామ గారింటికి మరో వూరు పంపించారు శ్రీరాములు, పాపారావు. అక్కడేదో ఒక సంబంధం చూసి మెడలొంచి తాళికట్టిస్తే చచ్చినట్టు పడుంటుందనీ, నోర్మూసుకుని కట్టుకున్నవాడితో కాపురం చేస్తుందనీ శ్రీరాములు, పాపారావు, భూషణం పథకం పన్నారు.

ఒకసారి భూషణాన్ని కూడా పలకరించి చూద్దాం! ఇంతకుముందే అనుకున్నాంకదా-భూషణం కూడా తన వూళ్లో పేరుమోసిన రాజకీయవేత్త అని. అంతటి మేధావి కాబట్టే శ్రీరాములు, పాపారావు కలిసి గంగను భూషణం ఇంటికి పంపించేశారు. శివ, గంగల గుట్టు రట్టుకాక మునుపే గంగకు ఏదో ఒక సంబంధం చూసి కట్టబెట్టాలనుకున్నారు. పెళ్ళి ఏర్పాట్లన్నీ మహాజోరుగా సాగుతున్నై. సరిగ్గా ఇక్కడే కథ అనుకోని మలుపు తిరిగింది.

చనిపోయాడనుకున్న శివ బతికొచ్చాడా? అదెలా సాధ్యపడింది? పెద్దలు కుదిర్చిన సంబంధమే చేసుకుందా గంగ? అమాయకులకు ప్రేమించుకునే హక్కు లేదా? పేదరికానికి - ప్రేమకు మధ్య ఈ తేడాలు ఎన్నాళ్ళకు తుడిచిపెట్టుకుపోతాయి?

ఏమో మరి... ఉషాకిరణ్ మూవీస్ 'మల్లెమొగ్గలు' సుమధుర సంగీత భరిత గ్రామీణ ప్రణయకావ్యం కళ్ళతో చదవండి.





రాజేష్, సాగరిక, చలపతిరావు, కోట శ్రీనివాసరావు, మిఠాయిచిట్టి, నిర్మల, వై. విజయ, అన్నపూర్ణ, లక్ష్మీషా మున్నగువారు నటించిన ఈచిత్రానికి కథ, సంభాషణలు: సి.యస్. రావు; పాటలు: వేటూరి సుందరరామమూర్తి; సంగీతం: రమేష్‌నాయుడు; కెమేరా: నవకాంత్; కళ: భాస్కరరాజు; కూర్పు: కృష్ణ; నృత్యాలు: ప్రకాష్, శేషు; నిర్మాణ నిర్వహణ: అట్లూరి రామారావు; దర్శకత్వం: వి. మధుసూదనరావు; నిర్మాత: రామోజీరావు. మయూరి విడుదల.



వి: మధుసూదనరావు



సి.యస్. రావు



నవకాంత్



కృష్ణ

# చతుర

సంపుటి : 9 ఏప్రిల్ 1986 సంచిక : 3

## ఈ నెల సమగ్ర నవల

"నే వుంటున్న ఇంటిగలాయనకి ఓ కూతురుంది. చాలా బావుంటుందే. మంచి పనిమంతురాలు. బుద్ధిమంతురాలు. నువ్వయితే 'నా బంగారుతల్లే' అంటూ బుగ్గలు నిమిరేదానివి. రోజూ నా గదిముందు ముగ్గులు పెడుతుంది. నేను బట్టలకి సబ్బు పట్టించి మర్చిపోతే వుతికి, ఆరేసి ఇస్త్రీకూడా చేసిస్తుంది. నువ్వోకసారొస్తే చూద్దూగాని! వస్తావా? వస్తానంటే నాన్నకి నిన్ను పంపమని రాస్తా. బామ్మా! ఈ విషయాలన్నీ అమ్మకిగాని, నాన్నకిగాని చెప్పకు... పరమరహస్యం!"

నగరంలోని ఓ మనవడు పల్లెటూళ్లో వుండే తన బామ్మకు రాసుకున్న ఈ ఉత్తరం అనుకోకుండా ఆ ఇంటిగలాయన కూతురు చేతికే వచ్చింది.

దాన్ని ఆమె ఎలా స్వీకరించింది?

ఆమె గురించి అంతగా వర్ణించడంలో అతని వుద్దేశం ఏమై వుంటుంది? ఆ వుద్దేశాన్ని ఆమె ఏ విధంగా అర్థంచేసుకుంది?

యువతీ యువకులమధ్య ఒకరిపట్ల ఒకరికి యథాలాపంగా కలిగే ఆసక్తి పెరిగి ప్రేమగామారి, తుదకు ఆ ఇరువురి హృదయ స్పందనం ఓ

# ప్రేమకావ్యం

గా పరిణమించటం ఈ కాలంలో సాధ్యమేనా?

ఆ ప్రేమకు ఏర్పడే అవరోధాలేవి?

వాటిని అధిగమించేందుకు ఆ ప్రేమికుల ప్రయత్నాలు ఎలా వుంటాయి?

## శంకరమంచి పార్థసారథి

పాత్రల సహజ ధోరణిలో సున్నితమైన హాస్యాన్ని రంగరించి సృష్టించిన 'ప్రేమకావ్యం' ఈనెల 'చతుర' సమగ్ర నవల! ఇది చతుర' సమర్పిస్తున్న 99వ నవల!

---

కవర్‌పేజీ ఫొటోగ్రాఫర్ : మురళి

1986 మే నెల 100వ సంచికగా వెలువడుతున్న సందర్భంగా

విశ్వకథా విపంచి

# విపుల

## కథల పోటీ

రు. 50,000/- బహుమతులు

| | రు. |
|---|---|
| ఒక అత్యుత్తమ తెలుగు కథకు ... | 3,000 |
| ఒక అత్యుత్తమ ఆంధ్రేతర భారతీయ భాషాకథకు– ఏ భాషవయినా ... | 3,000 |
| మూడు ఉత్తమ కథలకు రు. 1,000 చొప్పున ... | 3,000 |
| పది మంచి కథలకు రు. 500 చొప్పున ... | 5,000 |
| 120 కథలకుకన్సొలేషన్ బహుమతులు రు. 300 చొప్పున... | 36,000 |

**నిబంధనలు :**

- ఇతివృత్తం తెలుగు వారి జీవితానికి సంబంధించినదే అయి ఉండాలి. ఆసక్తికరంగా చదివించి, ఆలోచింపజేయగల నూతన ప్రయోగాలకు ప్రత్యేక ప్రాధాన్యత. అనువాదాలు, అనుసరణలు పనికిరావు.
- కథ నిడివి 10నుండి 15 అరఠావుల వరకూ ఉండవచ్చును. కథ వ్రాతప్రతిలో ఎక్కడా రచయిత/త్రి పేరుగాని, చిరునామాగాని ఉండరాదు. మొదటి పేజీలోనే ప్రత్యేకించి రచన, రచయిత/త్రి వివరాలు, చిరునామా ఉండాలి. తగినన్ని స్టాంపులు అంటించిన స్వంత చిరునామాగల కవరు ప్రతి రచనతోనూ తప్పనిసరిగా జత పరచాలి.
- కలంపేరు వాడినా, రచయిత/త్రులు తమ పూర్తిపేరు, చిరునామా మొదటిపేజీలోనే తెలపాలి. కథ తమస్వంత రచనేగాని అనుకరణ కాదనీ, మరేపత్రికకూ పంపలేదనే హామీపత్రం జతపరచాలి.
- రచనల ఎన్నిక, బహుమతుల నిర్ణయం ఇత్యాది విషయాలన్నింటా సంపాదకునిదే తుదినిర్ణయం. ఈ విషయంలో ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలకు అవకాశం లేదు.
- తెలుగేతర భాషా కథలకు ఇచ్చే బహుమతులు ఆయా భాషా రచయితలకి ఉద్దేశించిన ప్రత్యేక పోటీకి మాత్రమే. కనుక అనువాద కథలను ఈ పోటీకి పంపవద్దని మనవి.
- కవరుమీద తప్పనిసరిగా తెలుగు కథలపోటీకి అని పేర్కొనాలి.

రచనలు మాకు చేరవలసిన ఆఖరుతేదీ **30-4-1986**

ఎడిటర్,

విపుల, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా, హైదరాబాద్-500482

1986 మే నెల 100వ సంచికగా వెలువడుతున్న సందర్భంగా

నవ నవలా వేదిక

# చతుర

## నవలల పోటీ

**రు. 50,000/- బహుమతులు**

| | రు. |
|---|---|
| ఒక అత్యుత్తమ నవలకు | ... 10,000 |
| ఒక ఉత్తమ నవలకు | ... 6,000 |
| ఒక మంచి నవలకు | ... 4,000 |
| పది నవలలకు కన్సొలేషన్ బహుమతులు | ... 30,000 |
| (నవలకు రు. 3000/- చొప్పున) | |

నిబంధనలు :

- కథావస్తువు తెలుగువారి జీవితానికి సంబంధించినదై వుండాలి. 'చతుర'లో నవల మాత్రమే అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా, అంటే 26 వేల పదాలకు తక్కువకాకుండావుండాలి! 'చతుర' కొరకై ప్రత్యేకంగా ఈ దృష్టితో రాసిపంపిన నవలలు మాత్రమే పరిశీలనార్హమవుతాయి.
- బహుమతి పొందని నవలల్లో సాధారణ ప్రచురణార్హమైనవి స్వీకరించి మామూలుగా ప్రచురించే అవకాశంవుంటుంది. అలా ఎన్నికచేసిన నవలలకు మామూలుగా పారితోషికం రు. 2,000 వుంటుంది.
- నవలల్ని ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే పోటీలో పాల్గొనాలి.
- నవల స్వంత రచనేనని, అనుకరణకాదని, మరే ఇతర పత్రికల పరిశీలనలోలేదని ధృవపరిచే హామీపత్రాన్ని విధిగా జత పరచాలి.
- ప్రచురణకై ఎన్నికకాని నవలలను తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీ జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యతవుండదు. తర్వాత ఉత్తరాలు రాయడంవల్ల ప్రయోజనంవుండదు.
- బహుమతుల నిర్ణయం, ఇత్యాదివిషయాలన్నింటిలోనూ సంపాదకునిదే తుది నిర్ణయం. ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలకు, వాద వివాదాలకు అవకాశంలేదు. గడువు తేదీ ముగిశాక వచ్చిన నవలలు పోటీకి పరిశీలించబడవు.

నవలలు మాకు చేరవలసిన ఆఖరు తేదీ **30-4-1986**

ఎడిటర్,

చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా, హైదరాబాద్-500 482

# చతుర ప్రపంచం

## మహిళా మెకానిక్

'ముదితల్ నేర్వగలేని విద్యగలదె...' అన్నట్లు పోలీస్ కానిస్టేబుల్, పోస్ట్ వుమన్, బస్‌కండక్టర్ వృత్తుల్లో కొందరు ప్రవేశించినా, ఇంకా మహిళలకు అలవి గాని వృత్తులు కొన్ని మిగిలేవున్నాయి. వాటిలో మోటార్ మెకానిక్ ఒకటి. కాని సిండరెల్లా జాస్టిన్ అనే స్త్రీ, పురుషులు మాత్రమే ఏలుతున్న ఆ రంగంలో పదేళ్ల క్రితమే ప్రవేశించి, నేడు నిపుణురాలైన కారు మెకానిక్‌గా పేరు తెచ్చుకుంది.



ప్రస్తుతం ' సిండరెల్లా మద్రాసులోని వెంకటేశ్వరా సర్వీస్ స్టేషన్‌లో పని చేస్తోంది. నాలుగేళ్ళ క్రితం ఆమె సూపర్ వైజర్‌గా ప్రమోషన్ పొందింది. ఆమె ఈ వుద్యోగంలో కొనసాగుతూనే మరో వైపు తన భర్త, కుమారుడు నడుపుతున్న జాస్టిన్ కంపెనీ గేరేజ్ పనుల్లో చేదోడు వాదోడుగా వుంటోంది.

ఆమె తల్లిదండ్రులకి తొమ్మిదిమంది సంతానంలో ఒకర్తెగా పుట్టిన సిండరెల్లాకి పెళ్ళి అయ్యాకనే ఈ వృత్తిపై ఆసక్తి కలిగింది. ఆమె మామగారు కొచ్చిన్‌లో ఓ గారేజ్ నడుపుతుండేవాడు. కారు మెకానిక్ వృత్తి మాకు వంశపారం పర్యంగా వచ్చింది అంటాడు సిండరెల్లా భర్త. సిండరెల్లా ఆసక్తిని గమనించిన మామగారు ఆమెను బాగా ప్రోత్సహించాడు. అందులో ఆమెకు అవసరమైన శిక్షణ భర్తనుంచి లభించింది. దాంతో డిప్లొమాలేవీ లేకుండానే, కేవలం తనకిగల ఆసక్తితో ఓ కారు మెకానిక్‌గా రూపొందింది సిండరెల్లా.

ఆమె దైనందిన కార్యక్రమం ఉదయం 9 గంటలకి ప్రారంభమై, అవిరామంగా సాయంత్రందాకా కొనసాగుతుంది. ఈస్టర్, క్రిస్టమస్ పర్వదినాలకు తప్ప ఆమె విశ్రాంతినే ఎరగదు. ఆదివారాలలో కూడా ఆమెకు పనివత్తిడి తప్పదు. ఆమె

మోటారు సైకిళ్ళనుంచి లారీలదాకా అన్ని రకాల వాహనాలకూ మరమ్మత్తు చేయగలదు. ప్రస్తుతం సూపర్‌వైజర్‌గా తన సహాయకుల పనిపాట్లను పర్యవేక్షించడమే ఆమె విధి. సిండరెల్లాపట్ల సహోద్యోగులు గౌరవభావంతో మెలగుతూ ఆమెకు పనిలో సహకరిస్తూవుంటారు.ఆమె కస్టమర్ల దగ్గరసైతం మంచి పేరు సంపాదించుకుంది.

సిండరెల్లాకు ఓ కొడుకు, కూతురు వున్నారు. భర్త, ఆమె కలిసి త్వరలో 'సిండరెల్లా ఎంటర్‌ప్రైజెస్' అనే సంస్థను ప్రారంభించే వుద్దేశంలోవున్నారు. వాహనాలు పాడయినవాళ్ళు ఫోన్‌చేస్తే చాలు మరమ్మత్తుకోసం అక్కడికి తమ మెకానిక్కులను పంపుతారు. వాహనాలతోపాటు బట్టలుతికే మిషన్లు, గీజర్లు, మిక్సీలు, ఫ్యాన్ల మరమ్మత్తులుకూడా చేపడతారు.

# అభినవ కుబేరుడు

చాలామంది వూహిస్తున్నట్టు ప్రపంచంలోకెల్లా అత్యంత ధనవంతుడు అమెరికాలోనో, యూరప్‌లోనో లేడు. కొత్త గిన్నిస్‌బుక్ ప్రకారం "బ్రూనే" దేశపు సుల్తాన్ అయిన సర్ మూదా హసన్ బోలగయ ప్రపంచంలోని అత్యంత ధనవంతుడు!

తైల నిక్షేపాలు విస్తారంగాగల అతి చిన్న దేశమైన బ్రూనే 'బోర్నియో' ద్వీపానికి దగ్గరలో సముద్రానికి కుడివైపున వుంది. కొంతకాలం బ్రిటీషువారి ఏలుబడిలోవుండి, ఈమధ్యనే స్వతంత్ర దేశంగా మారిన బ్రూనే ఐక్యరాజ్య సమితిలో సభ్యత్వంకూడా పొందింది.

ఇటీవల హసన్ అమెరికాలోని అత్యంత ఖరీదైన విలాసవంతమైన హోటళ్ళను కొన్నాడు. కోట్లాది రూపాయలను యూనిసెఫ్‌కి విరాళంగా ఇచ్చాడు.

బ్రూనే దేశపు జనాభా కేవలం 2 లక్షలే! అక్కడి ప్రజల సగటు తలసరి ఆదాయం సంవత్సరానికి నాలుగు నుంచి నాలుగున్నర లక్షలదాకా వుంటుంది. చిన్నదైనా, అతి సంపన్నవంతమైన ఆ దేశం గురించి చాలాకాలంపాటు ఎవరికీ తెలియదు! దాని రాజధాని 'బందర్'. ప్రపంచంలోకెల్లా పరిశుభ్రమైన నగరం!

బ్రూనేలో నివాస గృహాలు బయట నుంచి చూసినపుడు సామాన్యంగానే కన



బడినా, లోపల ఎంతో ఆకర్షణీయంగా అలంకరించబడి వుంటాయి. ప్రతి ఇంట్లోనూ రంగుల టెలివిజన్ మొదలు ఎయిర్ కండిషన్ సౌకర్యంతో సహా అత్యంతాధునిక సౌకర్యాలన్నీ వుంటాయి. భవంతులన్నీ విశాలంగా వుంటాయి. బ్రూన్ దేశానికే గర్వకారణమైన మసీదు గోపురానికి బంగారపు తొడుగు వుంటుంది.

కొత్తగా కట్టిన సుల్తాను భవనం బ్రూన్ నది ఒడ్డునే వుంటుంది. దాని శిఖరానికి కూడా బంగారపు తొడుగు వుంటుంది. ఆ భవన నిర్మాణానికి 400 కోట్ల రూపాయలు ఖర్చయింది. 1788 గదులుండే దానిలో హసన్‌తోపాటు అతని వద్ద పనిచేసే 2,500 మంది ఉద్యోగులు కూడా వుంటారు. హసన్ రాజభవనంలో. 'పోలో' ఆడేందుకు పనికొచ్చే 350 గుర్రాలు, ఎన్నో హెలికాప్టర్లు, 'బోయింగ్ జెట్' విమానాలేగాక ఖరీదైన 110 కార్లు కూడా వున్నాయి. పర్యటనలపై ఎంతో మోజుగల 38ఏళ్ళ హసన్ మంచి 'పోలో' ఆటగాడు కూడా! అతను బ్రిటిష్ ఆర్మీ కాలేజీలో చదివాడు. 1967లో 'సుల్తాను' అయిన హసన్ అంటే బ్రూన్ ప్రజలందరికీ ఇష్టమే! హసన్ తండ్రి ఇంకా జీవించేవున్నా, కొన్ని రాజకీయ కారణాల వల్ల కొడుకుని దేశానికి 'సుల్తాను'గా చేశాడు.

బ్రూన్ దేశపు ఆదాయంలో అధిక శాతం పెట్రోలు ఎగుమతులవల్ల వస్తుంది. దానిలో హసన్ తీసుకునేది 10 శాతమే అయినా అతని సంవత్సరాదాయం దాదాపు 3 వేల కోట్ల రూపాయలుంటుంది. హసన్ న్యూయార్క్‌లోని ఓ బ్యాంకులో 6 వేల కోట్ల రూపాయలు డిపాజిట్ చేశాడు. స్విట్జర్లాండులోని వివిధ బ్యాంకులలో కోట్లాది రూపాయలు పెట్టుబడిగా పెట్టాడు. ఆధునికవిద్య నభ్యసించినా హసన్ ఎంతో సంప్రదాయబద్ధంగా వుంటూ, ప్రతి శుక్రవారం ప్రార్థన చేసేందుకు మసీదుకి వెళతాడు!

# నివాస గుహలు

స్పెయిన్‌లో 80వేలమంది ప్రజలు ఇంకా గుహలలోనే నివసిస్తున్నారు. ఆ



దేశ ప్రభుత్వం ఓ సర్వే నిర్వహించగా, గుహల్లో నివసించేవారిలో పేదవారికంటే ధనవంతులే అధిక శాతమని తేలింది. ధనవంతులకి గుహలపై మోజు పెరగ

దంతో అక్కడ గుహల్ని అద్దెకివ్వడం, అమ్మటం ఓ పెద్ద వ్యాపారంగా మారింది. 'ప్లాపీ' అనే ప్రాంతంవద్ద సముద్రానికి సమీపంలో వేసవి విడిదికి అనువుగా మలచిన గుహలకి అద్దెలు మరీ అధికం. ఒక్కొక్క గుహను దాదాపు 40 లక్షల రూపాయలకి అమ్ముతారు కూడా.

పేదవారు నివసించే గుహలకి ప్రభుత్వం వుచితంగా కరెంటు, నీటి సరఫరా చేస్తుంది. కొన్ని గుహలు లోపల సిమెంటుతో నున్నగా చేయబడి వుండటమే కాకుండా, అంతస్తులను కూడా కలిగి వుంటాయి. కొన్నిటికి మామూలు ఇళ్ళ లానే తలుపులు, కిటికీలు వుంటాయి.

రేమన్ బోరస్ అనేవ్యక్తి గుహలలో నివసించే వారిపై పరిశోధన సాగించి, ఇటలీలో అలాంటి గుహలు 8,639 వున్నట్టు వెల్లడించాడు. తన పరిశోధన కోసం రేమన్ ప్రతి గుహనీ సందర్శించాడు.

విచిత్రంగా, కొన్ని గుహలలో ఎయిర్ కండిషన్ సౌకర్యం కూడా వుంది. అంతులేసియా ప్రాంతంలో చాలా గుహలలో టెలివిజన్లు వుంటాయి.

# వెర్రిమొర్రి అలవాట్లు

కొందరు ప్రముఖులకి వారు సాధించిన ఘనకార్యాలకంటే వారి వింత అలవాట్ల వల్లనే ఎక్కువ ప్రచారం లభించింది. తమ అలవాట్లు అర్థరహితమైనవని తెల్సినా ఇతరుల్లానే వాళ్లకూడా అలవాట్లకు బానిసలై వాటినుంచి తప్పించుకోలేక పోయేవారు.

క్రీస్తుపూర్వం 96 నుంచి 51వరకూ అధికారంలోవున్న రోమన్ చక్రవర్తి టిటస్ అగస్టస్‌కి ఎన్నో వింత అలవాట్లుండేవని చరిత్రకారులు పేర్కొన్నారు. అందులో ఒకటి తీరికగావున్న సమయంలో ఈగలను పట్టుకోవడం. ఆ విధంగా చివరికి ఈగల్ని పట్టుకోవడంలో మంచి ప్రజ్ఞావంతుడయ్యాడట ఆ చక్రవర్తి.

వర్జిల్ అనే రోమన్ కవికూడా అంత



వెర్రిగానే ప్రవర్తించేవాడు. వర్జిల్ ఈగలను పట్టటమేకాక వాటిని పెంచుతుండేవాడు కూడా. అతని పెంపుడు ఈగ ఒకటి చచ్చిపోయినపుడు ఎంతో దుఃఖించి, శ్రాద్ధకర్మలకి దాదాపు 10 లక్షల రూపాయలు ఖర్చుచేసి ఆ ఈగను పూడ్చినస్థలంలో ఓ స్మారకచిహ్నాన్ని కూడా కట్టించాడు.

చాలామంది కవులు పేరుకోసమో, డబ్బుకోసమో కవిత్వం రాస్తారు. స్కాటిష్ కవి జాన్‌బ్రెగెన్‌రిడ్జ్ మాత్రం ఆ కోవకు చెందడు. జాన్‌కి తన కవితలను ఎవరైనా చదవడంగాని, పాడటంగాని నచ్చదు. ఎవరైనా తన పద్యాలను చదివినా, పాడినా వూరుకునేవాడు కాదు. జాన్ మరణానికి కొద్దిరోజులముందు తాను కవితలు రాసిన కాగితాలన్నిటినీ తగలబెట్టేశాడు.

సాధారణంగా సాహితీరంగంలోని వ్యక్తులు సూక్తులను ఎంతగానో మెచ్చుకుంటారు. కాని, ప్రముఖ ఇటాలియన్ రచయిత మోరిస్‌బోరిస్‌కి సూక్తులంటే వళ్లుమంట. ఏదైనా పుస్తకంలో సూక్తులేవైనా కనబడితే వెంటనే అవి కనబడకుండా, వాటిపై నల్లసిరా పూసేవాడు.

అలా అతను జీవించిన 70 ఏళ్ళపాటూ లెక్కలేనన్ని సూక్తులపై సిరా పూశాడు.

ప్రముఖ ఫ్రెంచి రచయిత మైకేల్ మాండే తన నిద్రకు మధ్యమధ్య ఆటంకం కలగాలని కోరుకునేవాడు. నిద్ర మధ్యలో మేలుకుని మళ్ళీ నిద్రించడమంటే అతనికిష్టం. రాత్రంతా మేలుకుని వుండి, మధ్యమధ్య తనకు నిద్రాభంగం చేయడంకోసమని ఓ నౌకరుని కూడా పెట్టుకున్నాడా రచయిత.

ఛార్లెస్‌ఆగ్టన్ అనే ప్రముఖ తత్వవేత్త తన జీవితంలో ఏనాడూ రాత్రిపూట నిద్రించలేదు. అతను పగలు నిద్రపోయి రాత్రంతా మేలుకుని వుండేవాడు. రాత్రుళ్ళు లండన్, కేంబ్రిడ్జ్ వీధులలో తిరుగుతూ గడిపేవాడు. ప్రముఖ రచయిత హెన్రీవార్నర్ సూర్యాస్తమయం కాగానే రాతపని మొదలుపెట్టి, అలా రాసుకు పోతూనే రాత్రంతా గడిపి, తెల్లవారు జామున 4 గంటలకి భోంచేసి, అప్పుడు నిద్రపోయేవాడు.

ఆస్ట్రియాదేశపు యువరాజు వెన్సెల్ రియార్‌బర్గ్‌కి రోజుకి 30 సార్లు దుస్తులు మార్చుకునే అలవాటుండేది. ఇంగ్లండ్ రాజు జేమ్స్‌కి కొత్తబట్టలంటే పడదు. ఏ దుస్తులనైనా ఏళ్ళతరబడి ధరించేవాడు. ప్రముఖ శాస్త్రవేత్త సర్ ఐజాక్ న్యూటన్‌కి దుస్తులపట్ల అశ్రద్ధ ఎక్కువ. అవార్డులు అందుకోవలసిన సందర్భాలలో కూడా మాసిపోయిన బట్టలతోనే వేదికలు ఎక్కేవాడు.

మహమ్మద్‌ఖాన్ అనే ఓ రాజుకి గంటగంటకీ చెప్పులను మార్చడమంటే సరదా. అతనికి అందుబాటులో ఎప్పుడూ ఓ వెయ్యి జతల చెప్పులు వుండాల్సిందే! ఎప్పుడో పూర్వకాలంలో ఇంగండురాజు అయిన ఫ్రాన్సిస్‌జేమ్స్ చెప్పులుగాని, బూట్లుగాని ఒకసారిమాత్రమే వేసుకుని వదిలేసేవాడు. అతను ఎక్కడికైనా వెళ్ళినపుడు, చెప్పులున్న మూటను మోస్తూ ఓ నౌకరుకూడా వెంట వెళ్ళేవాడు. లండన్‌లో మేథ్యూరాబిన్సన్ అనే ధనిక భూస్వామి రోజంతా నీళ్ళతొట్టిలోనే గడిపేవాడు. భోజనం, పడకకూడా అందులోనే!



తాజాదనం రోజంతా
నిలిచేలా ఉంచండి.
కొత్తది
Godrej
NEW CINTHOL
DEODORANT AND COMPLEXION SOAP
CINTHOL
అసలైన తాజాదనం! అదే రోజంతా నిలిచి
వుండే తాజాదనం! మీకు సాధారణ సబ్బులు
ఇచ్చేలాంటి కొద్ది సేపట్లో మాయమైపోయే
తాజాదనం కాదు. శరీర దుర్గంధం పోగొట్టి
మిమ్మల్ని రోజంతా హాయిగా వుంచగల
తాజాదనం—అదే కొత్త సింథాల్ మాత్రమే
ఇవ్వగల వాగ్దానం.
సింథాల్‌లో ఇప్పుడు మనమోహక కొత్త పరిమళం కలదు.
దుర్గంధాన్ని పోగొట్టడానికి సింథాల్‌లో గల ప్రభావ
వంతమైన శక్తి చర్మ క్రిములను నాశనం చేసి,
మిమ్మలను రోజంతా తాజాగా దుర్గంధ రహితంగా వుంచుతుంది.
CHAITRA-B-G-330 TEL
కేవలం సింథాల్
మాత్రమే మిమ్మల్ని దినమంతా తాజాగా దుర్గంధరహితంగా ఉంచగలదు.
Godrej ఉత్పాదన

సుబ్రమణ్యం బద్ధకంగా కదిలాడు.

ఎర్రటి ఎండ కిటికీలోంచి ఒంటిమీద పడి సూదులు కాల్చి గుచ్చుతున్నట్లుగా వుండి అసౌకర్యంగా, చిరాగ్గా వుంది. ఎవరైనా కిటికీ రెక్కలు మూసి పుణ్యం కట్టుకుంటే బావుంటుందనుకున్నాడు. తనే ఆ పుణ్యాన్ని పుచ్చుకుందామంటే బద్ధకం లేవనీయటంలేదు. ఆ గదిలో అతడు తప్ప మరో పుణ్యాత్ముడు లేకపోవటం చేత తప్పనిసరై మంచం దిగేడు.

సరిగ్గా అప్పుడే పక్కింట్లో ముసలి గడియారం ఓపిక తెచ్చుకుని ఎనిమిది గంటలు బాదింది.

సుబ్రమణ్యం మంచం దిగటమేకష్టం. దిగితే మాత్రం అతగాడి స్పీడుముందు అన్నీ దిగదుడుపే. అతడు దేవుడి మొహం చూసి మంచం దిగుతాడు. బ్రష్ తీసుకుని దానిపైన పేస్టు పిండుకుని, సోపు, టవలు తీసుకుని బాత్రూంవైపు నిద్దరకళ్ళతో వెళతాడు. అన్ని పన్లు ఏక బిగిన పూర్తి చేసుకోవటం అలవాటు చేసుకున్నాడు.

దానికొక కారణముంది-

అతడుంటున్న గదికి ప్రత్యేకంగా బాత్రూం, టాయిలెట్లు అంటూ ఏవీ లేవు. ఇంటి యజమాని రామసూర్యంగారి ఫ్యామిలీకి, సుబ్రమణ్యానికి ఉమ్మడి ఆస్తిగా ఒకేఒక స్నానాల గది, మరుగు దొడ్డి వున్నాయి.

అది అయిదు గదుల ఇల్లు. ముందు గదిలో సుబ్రమణ్యం వుంటున్నాడు. వెనకాల గదుల్లో రామసూర్యంగారి ఫ్యామిలీ వుంటుంది. ఫ్యామిలీ అంటే ఆయన భార్య, కూతురు. ఆయనీమధ్యనే యాభై అయిదు సంవత్సరాలు పూర్తి చేసుకుని అనుకోకుండా వుద్యోగం పోగొట్టుకున్నారు. దాంతో జీతంలేక, పింఛను చాలక తప్పనిసరి పరిస్థితులలో సుబ్రమణ్యానికా గది అద్దెకిచ్చేరు-రెండు నెలల క్రితం.

సుబ్రమణ్యం గదిలోంచి బయటి కొచ్చేసరికి రామసూర్యంగారు మొక్కల మధ్యన కూర్చుని వాటికి పాదులు చేస్తున్నారు. రిటైరయ్యాక ఆయన కొత్తగా తెచ్చి పెట్టుకున్న వ్యాపకం. అంతకు మునుపు ఇంటిముందరి ఆవరణ మైదానంలా బోసిపోతూవుండేది. చెప్పా పెట్టకుండా వుద్యోగం తీసెయ్యడంతో మనుషులంటే అసహ్యించుకోవటం మొదలెట్టారు.

అప్పట్నించే పేపరు చదవటం మానేసారు. రేడియో వినడం లేదు. రాజకీయాలన్నా, ప్రజానాయకులన్నా పరమరోతగా అన్పించింది. వుద్యోగం పోయి, పేపరు పోయి, రేడియో వార్తలు పోయేసరికి జీవితం ఏమిటో ఖాళీ చేసిన కొంపలా వెల్తిగా అన్పించింది. అటువంటి స్థితిలోనే ఆయన చూపు మొక్కల పెంపకంపై బడింది. వెంటనేరకరకాల పూలమొక్కలు కూరగాయల మొక్కలు తెచ్చి ఇంటి ముందంతా వేసేరు. రోజూ రెండుపూటలా వాటికి పాదులు చేసి, నీళ్ళు పెట్టటం దినచర్యగామారింది. అసలిలా మొక్కలు కొని దీక్షతో మొక్కల సేవ చేసుకోటానికే రిటైరయ్యానా అనిపిస్తుంది అప్పుడప్పుడు.

రోజూ సుబ్రమణ్యం లేచి బాత్‌రూంకి వెళ్ళే సమయానికి రామసూర్యంగారు మొక్కలమధ్యన కూర్చుని చిన్నగునపం చేత్తో పుచ్చుకుని తవ్వుతుంటారు.

ఆ రోజూ ఆయనక్కడే వున్నారు. అదే పన్చేస్తున్నారు. సుబ్రమణ్యాన్ని

చూడగానే 'ఏమేవ్ అబ్బాయొస్తున్నాడ'ని పొలికేక పెట్టారు. ప్రతిరోజూ అలాగే అరుస్తారు. అసలు అలా అరవటానికే మొక్కాలం మాటున కూర్చుంటారేమోనని సుబ్రమణ్యానికి చిన్న డౌటు.

అలా అరవటం దొడ్లో వున్న ఆడ జనానికి లోపలికి పొమ్మని సిగ్నల్. ఫలితంగా సుబ్రమణ్యం వెళ్లేసరికి దొడ్లో నిర్మానుష్యంగా వుంటుంది. రామసూర్యం గారి భార్య హనుమాయమ్మగారు, కూతురు రమణి ఇంట్లోంచి చూస్తుంటారు.

రామసూర్యంగారికిద్దరు కొడుకులు, ఇద్దరు కూతుళ్ళు. పెద్దకొడుకు పూనాలోనూ, రెండోవాడు రెంటచింతల్లోను చీకూచింతా లేకుండా వుద్యోగాల్చేసుకుంటున్నారు. పెద్దపిల్ల పెద్దాపురంలోవుంది- కాపురం చేసుకుంటూ. రమణి చివరిది. ఆమె వివాహం ఆయనకి మిగులున్న బాధ్యత. సర్వీసులో వుండగానే లాగించేద్దామనుకుంటే కుదిరిందికాదు. ఆ బాధ్యత లేకుండావుంటే మొక్కాలు పెంచకుండా రామేశ్వరమో, కాశీయో పోయి సెటిలయిపోయేవారు. దేవుడు నాయందు లేడనుకుంటారు రామసూర్యంగారు, వున్నాడనుకుంటుంది ఆయన భార్య.

ఆ వుదయం సుబ్రమణ్యం దొడ్లోకెళ్ళేసరికి ప్రతిరోజూ జరిగేదానికి భిన్నంగా నీళ్ళగదిలో ఎవరో వున్నారు. స్నానం చేస్తున్నట్లుగా గలగలమని నీళ్ళ శబ్దం వినబడుతోంది.

వెనక్కొచ్చేస్తే బావుండదని అక్కడే నిల్చుని ఆకాశంవంక చూస్తూ బ్రష్ చేసుకుంటున్నాడు.

హనుమాయమ్మగారు లోపల్నించి వచ్చి 'మా పిల్ల స్నానంచేస్తోందినాయనా ఒక్కక్షణం' అని 'అమ్మడూ! త్వరగా కానీ' అని పెద్దగా కేక పెట్టింది.

'వస్తున్నా... అయిపోయింది' అంది అమ్మడు లోపల్నించి.

సుబ్రమణ్యానికి నిలబడటం ఇబ్బందిగావుంది. నిద్దరమత్తు పూర్తిగా వదిలింది కాదు. నిలబడే నిద్రపోతానేమోనన్న బెంగ, భయంగూడా వున్నాయి. అంచేత గదికెళ్ళి మళ్ళీ కాస్సేపయ్యాక వద్దామనుకుంటుండగా, నీళ్ళగదితలుపు తెరుచుకుని లోపల్నించి ఆ పిల్ల తలమాత్రం బయటికి పెట్టి పరిస్థితిని సర్వేచేసింది.

ఆమెకంటికి ఆకాశంవంక చూస్తూ బ్రష్ కొడుతున్న సుబ్రమణ్యం కనిపించాడు.

అతడి వాలకాన్ని, చూపుల్ని బట్టి ఆమె ఫర్వాలేదు, ఏం ప్రమాదం వుండదనుకుని తలుపు పూర్తిగాతీసి ఒక్కగెంతులో చెంగున బయటపడి లోనికిపరిగెత్తింది.

సుబ్రమణ్యం పైకి కనబడేటంత అమాయకుడేంకాదు. సరిగ్గా అదునుచూసి చూపుల్ని ఆకాశంనుంచి దింపి పరిగెడుతున్న ఆ పిల్లవెనకే పరిగెత్తించాడు.

ఆమె కనకాంబరంరంగు చీరెని వొదులుగా, వొత్తుగా వొంటికి చుట్టుకుంది. తడిఆరని వొళ్ళు చీరెని పూర్తిగా తడిపేసింది. పచ్చటి పిక్కలు ముద్దుగా బొద్దుగా వున్నాయ్. లేతపాదాలకి గజ్జెల పట్టాలు అందంగా వున్నాయ్.

ఒకేఒక క్షణంలో సుబ్రమణ్యం చూడతగ్గవన్నీ చూసేసి, ఏవీ ఎరగనట్లు బాత్రూంలోకెళ్ళాడు.

హనుమాయమ్మగారంతా గమనించింది. చిన్నగా నవ్వుకుంది. కుర్రాడు బుద్ధిమంతుడు, చదువుకున్నాడు, వుద్యోగం చేస్తున్నాడు. పెళ్లికాలేదు. పెళ్లికావలసిన పిల్లని ఓరగా చూస్తున్నాడు. అవిడకది శుభసూచకంగా అనిపించింది.


ఉన్నతమైన నాణ్యత
ప్రియలోనే వుంది
priya
ఎన్నిక చేసిన దినుసులన్నీ సమపాళ్లలో
మేళవించి అద్భుతమైన రుచులతో
రూపొందించినవే ప్రియ పచ్చళ్ళు.
మీ భోజనానికి సంతృప్తి సరిజోడు-ప్రియ
నాడే మీ ప్రియను మీ ఇంటికి తీసుకువెళ్ళండి.
ప్రియ ఫుడ్స్
ప్రైవేట్ లిమిటెడ్
Marketed by:
MARGADARSI MARKET
PRIVATE LIMITED
ఎంతో రుచి... ఎంతో రుచి... ప్రియ
Kiron/PF/831

సుబ్రమణ్యం స్నానం పూర్తిచేసి గదిలోకొచ్చేసరికి రామసూర్యంగారు మొక్కలమధ్యనించి లేచినిల్చున్నాడు. తానుచేసిన పనిని తృప్తిగా చూసుకుంటూ 'ఏమే స్నానానికి నీళ్లతోడు' అనరిచేడు.

ప్రతిరోజూ అలాగే అరుస్తారు, అందరికీ వినిపించేలా. కాని నీళ్ళు తోడేందుకు జావిగాని, మనుషులుగాని లేరు.

సర్వీసులో వున్నపుడు అరవకుండానే వేళకి నీళ్ళు సిద్ధం చేసేవాళ్ళు. కాని అదేం విచిత్రమోగాని, రిటైరయ్యాక పనులు వేళప్రకారం జరగటం మానుకున్నాయ్. అదేవిటని ఎప్పుడన్నా నిలదీస్తే, పన్లోవున్నాం కాస్త ఇటొచ్చి తీసికెళ్ళకూడదమా అంటుంది.

రామసూర్యంగారు అరవటంమానేదుగాని, అడగటం మానేశారు. నీళ్లతోడమని అరచి, తనేవెళ్ళి నీళ్లతెచ్చుకుంటారు తొట్లోంచి. రామసూర్యంగారు స్నానాల గదిలోకెళ్ళబోతూ 'అమ్మాయ్! రెండు బకెట్ల నీళ్లతీసికెళ్ళి ఆ మొక్కల్లోపొయ్యి' అన్నారు.

"అబ్బ! ఆ గదిలోకి ఆయన్ని వెళ్ళనీ తర్వాతపోస్తా" అంది సిగ్గుతో.

రామసూర్యంగారికా పాయింటు నచ్చింది. అంచేత మరేం మాట్లాడకుండా స్నానాలగదిలోకెళ్ళి తలుపేసుకున్నారు.

కాని హనుమాయమ్మగారికా పాయింటు నచ్చిందికాదు.

"అదేవిటే! ఆ అబ్బాయి నిన్నేం చేశాడే.... వెళ్ళి నీ పని నువు చూసుకోక" అంది.

"నాకు సిగ్గు బాబూ" అంది తల దువ్వుకుంటూ రమణి.

హనుమాయమ్మగారింకేం మాట్లాడలేదు. ఆశవున్నచోటునే సిగ్గు, బిడియాలు వుంటాయని థియరీ చెప్పుకుని తృప్తిపడింది.

పది నిముషాల్లో సుబ్రమణ్యం పాంటు, చొక్కా వేసుకుని గది తలుపు తాళం పెట్టి వీధిలోకెళ్లాడు.

సుబ్రమణ్యం ఆఫీసుకెళ్ళాడన్న విషయం అందరికీ ఇళ్ళల్లో కూర్చున్నా ఇట్టే తెల్సిపోతుంది. కారణం, అతడు తలుపుని మూస్తున్నపుడు ధభేల్ మని వినిపించే శబ్దం. తలుపుని మెల్లిగా, సుతారంగా వెయ్యటం తెలిక, చేతకాకనుకాదు కాని అలా వేస్తేనేగాని తృప్తిగా వుండదు.

ఆ రోజుగూడా ధబేల్ మనిపించి, తాళం బిగించి రోడ్డెక్కాడు.

రామసూర్యంగారు ఆ శబ్దం విని 'వీడిచ్చే అద్దె డబ్బులు తలుపు రిపేరుకి కూడా చాలేటట్లులేవ'ని స్నానాల గదిలోనే బాధపడ్డారు.

సుబ్రమణ్యం ఆఫీసుకెళ్లాడని తెల్సి రమణి బయటికొచ్చింది. ఉతికిన వాయిల్ చీరె కట్టుకుంది. ఆ చీరని కాస్త పైకిలాగి బొడ్లో దోపింది. ప్లాస్టిక్ బకెట్టునిండుగా నీళ్ళుతెచ్చి తండ్రిచేసిన పాదులన్నిటినీ పూర్తిగా నింపింది. ఆపైన మొక్కలని పరీక్షచేస్తూ కాసేపు గడిపింది.

తిరిగి లోపలికి వెళ్ళిపోబోతూ చూపుని సుబ్రమణ్యం గదివేపు తిప్పింది.

గది తాళం వేసుంది. కాని కిటికీ రెక్కలు తెరిచే వున్నాయి.

ఆసక్తిగా ఆమె అక్కణ్నించి కదలి కిటికీదగ్గరకొచ్చి లోపలికి చూసింది.

సుబ్రమణ్యానికి బద్ధకంతోపాటు, మతిమరుపుగూడా వుంది. ఒక్కోరోజు లైటు, ఫాన్ ఆఫ్ చెయ్యటం మర్చిపోతాడు. ఇంకోరోజు తలుపు గొళ్ళెం పెట్టకుండా

తాళంవేసి ఈల వూదుకుంటూ వెడతాడు. తాళం వేస్తే కిటికీ తలుపులు మూయటం మర్చిపోతాడు. అన్నిటికన్నా విచిత్రమైన సంగతేమంటే - గదికి తాళం వెయ్యటం మర్చిపోయిన రోజున అతడికేం అనుమానంరాదు. నిశ్చింతగా వుంటాడు. రోజుకన్నా కాస్త ఎక్కువ హుషారుగాకూడా వుంటాడు. కాని తాళం గట్టిగా వేసినరోజున మాత్రం అనుమానం పీడిస్తుంది. దాని నివారణకి సగంలోనే బస్సుదిగి ఆటోలో గదికొచ్చి తాళం చూసుకొని తిరిగి అదే ఆటోలో ఆఫీసుకెడతాడు.

ఆ రోజున కిటికీలు మూయటం మర్చిపోయినందువల్ల రమణికి అతగాడి గది వైభవాన్ని కళ్లారాచూసే భాగ్యంగల్గింది.

ఆ గది గదిలాకాక ఓ పశువులకొట్టులాగా వుంది. మడతమంచంపైన బకెట్టు పడేశాడు. నీళ్ళు కారుతున్న టవల్ని చుట్టచుట్టి బల్లపై వుంచాడు. కాగితాలు, చెత్తాచెదారంతో నేల దీపావళి మర్నాటి వీధిలాగా వుంది. పుస్తకాలు బల్లపైన,కింద చెల్లాచెదురుగాపడున్నాయ్. గోడకి వేలాడుతున్న అతడి తాతగారి ఫొటోకి విప్పిన మసిగుడ్డలాంటి బనీను అడ్డంపెట్టగా, ఆ ఫొటోలోని పెద్దమనిషి మొహం చిట్లించి బాధగా, అసహ్యంగా చూస్తున్నాడు. మాసిపోయిన సాక్సు రెండు బంతుల్లాగా పౌడరు డబ్బాకి చెరో వేపున పడివున్నాయి.

గదిలోని పరిస్థితిని చూసి రమణి ముందు చీదరించుకొని ఆపైన జాలిపడింది. వీలుంటే ఆ కిటికీచువ్వలగుండా లోనికెళ్ళి ఆ గదిని శుభ్రంచేసే బృహత్తర కార్యక్రమాన్ని స్వీకరించాలని కూడా అనుకుంది. కాసేపు అలాగే చూసి వెనక్కి తిరిగింది.

రెండు నెలలుగా ఆ గదిలో వుంటున్న అతడిని అర్థంచేసుకుని అంచనా కట్టాల ప్రయత్నించింది,మనిషేమో మహా మొహమాటస్తుడు. సిగ్గు, బిడియం జాస్తి. ఆ మనిషి ఎదురుపడితే కంగారుపడతాడ పలకరిస్తే పలుకుతాడు, లేకపోతే లేదు దించిన తల ఎత్తడు. స్నానాలగదిలో నయినా తలెత్తుతాడాన్నది అనుమాన అద్దెమాత్రం ఫస్టుతారీఖు సాయంత్రా కల్లా ఇచ్చేస్తాడు. సినిమాలు, షికార్లు, బాదు-వగైరాలు వున్నట్లు దాఖలా లేవు. స్నేహితులు కూడా వున్నట్లు లేదు.

'ఇదెక్కడి మనిషబ్బా! ఎలా బతుకుతాడో పాపం' అనుకుంది రమణి.

తల్లి పిలవటంతో అక్కణ్ణుంచి వెళ్ళిందిగాని, గది వైభవాన్ని మర్చిపోలేకపోతోంది.

రామసూర్యంగారు స్నానం పూర్తిచేసి పూజలో వున్నారు.

తల్లి వంట హడావుడిలో మునిగుంది.

రమణి చీపురు, నీళ్ళ బక్కెట్టు ముగ్గు డబ్బా పుచ్చుకుని బయల్దేరింది.

సుబ్రహ్మణ్యం గదిముందుకొచ్చి ... లోని సరంజామాని పక్కనపెట్టి అక్క ప్రదేశమంతా శుభ్రంగా వూడ్చి చె చెదారం ఒకపక్క పోగులాపోసిం నీళ్లు వొత్తుగా చల్లింది. ముగ్గుడబ్బా చేతులోకి తీసుకుని చక్కటి విశాలమై ముగ్గు పెట్టింది.

రెండడుగులు దూరంగావెళ్ళి నడు పైన చేతులుంచుకుని తన పనితనాని పరీక్షగా చూసుకుంది.

గది వాకిలికి కొత్త అందం వచ్చినట్ల అనిపించి తృప్తిగా నిట్టూర్చింది. అప్పటి

గాని ఆమె మనసులో గది వైభవపు తాలూకు ఆవేదన తగ్గిందికాదు.

రమణికి శుభ్రత ఎక్కువ. ఇంటిని ఒంటిని శుచిగా, శుభ్రంగా ఉంచుతుంది. ఏ వస్తువు ఎక్కడుండాలో, ఎక్కడుంటే అందంగా, ఆకర్షణీయంగా వుంటుందో సరిగ్గా వాటినక్కడే వుంచుతుంది. ఇంట్లో నాలుగో మనిషి లేకపోవటంచేత ఇల్లు తుడిచిన అద్దంలాగా వుంటుంది. హనుమాయమ్మగారు కూతురి అతిశుభ్రతని చూసి విసుక్కోవటం కూడా కద్దు.

సాయంత్రం సుబ్రమణ్యం ఆఫీసు నుంచొచ్చి గది గుమ్మం ఎక్కబోయి ఒక్కక్షణం ఆగేడు. శుభ్రంగావున్న వాకిలిని, వెండిపళ్లెంలాగావున్న ముగ్గుని చూసి ముచ్చటపడ్డాడు. చాలా అందంగా కూడా వుందని అనుకున్నాడు. సొంత వూళ్లో సొంత ఇంటి వాకిట్లో నిల్చున్నట్టుగా ఫీలయ్యాడు. అంత ఓపిగ్గా, చక్కగా శుభ్రంచేసి ముగ్గు దిద్దింది ఎవరాని ఆలోచనకూడా చేసేడు. గది లోపలిభాగాన్ని కూడా అంత శుభ్రంగానూ వుంచుకోవాలన్న ఆలోచనవచ్చి ఆ మహిళామణెవరో కాస్త గది లోపలకూడా ఓ చెయ్యివేస్తే బాగుండునని ఆశపడ్డాడు.

సుబ్రమణ్యం ఆశ రెండు రోజుల తర్వాత నెరవేరింది.

ఆరోజున సుబ్రమణ్యం కార్యక్రమాలు పూర్తిచేసుకుని ఆఫీసుకి బయలుదేరాడు. ఈమధ్యన బయటికి వెళ్లేముందు రెండు క్షణాలు ఆలోచించటం అలవాటుగా చేసుకున్నాడు. పోస్టు చెయ్యాల్సిన ఉత్తరాలు, ఆఫీసు కాగితాలు, మిల్క్ కూపను, మనీపర్సు-ఇలాంటివి ఏవైనాగాని మర్చిపోయానా అన్చెప్పి ఆలోచించి, లేదని గట్టిగా చెప్పుకుని బయటికడుగు పెట్టటం మొదలెట్టాడు.

ఆరోజు కూడా ఆ విధంగా ఆలోచించి, ఏవీ మర్చిపోలేదని ఒకటికి రెండుసార్లు చెప్పుకుని, గది తాళం వెయ్యటం మర్చిపోయి గబగబా వేళయిందని వెళ్లిపోయాడు.

ఆ విషయాన్ని ఎవ్వరూ గమనించలేదుగానీ ... రామసూర్యంగారు పూజలోనూ, తల్లి వంటగదిలోనూ వుండగా రమణి సుబ్రమణ్యం గదివైపుగా వచ్చింది.

మొదటిసారి ముగ్గు పెట్టినరోజు నుంచి విధిగా ప్రతిరోజూ నీళ్ళుచల్లి ముగ్గుపెడుతోంది.

ఆవేళ ఆ పనిమీదే అటువైపుగా వచ్చినఆమె గదితలుపులు తాళంలేకుండా ఉండటం గమనించి కాసేపు అలానే నిల్చుండిపోయింది.

ఆమె కాస్త కదిలి ముందుకెళ్లింది. తలుపులు తీసి లోపలికి తొంగిచూడాలంటే బిడియం, బెరుకు, భయం.

ఎటూ తేల్చుకోలేక కాసేపు స్తబ్ధుగా అక్కడే నిల్చుని ఇక వెనక్కి వెళదామని అనుకుంటుండగా పోస్టుమేన్ గేటు తోసుకుని రావటంచూసి ఆగింది.

అతడు రెండుకవర్లని రమణి చేతికిచ్చి వెనక్కి తిరిగాడు.

అందులో ఒకటి సుబ్రమణ్యం పేరునుంది.

ఇంకేం ఆలోచించకుండా రెండంగలు ముందుకేసి తలుపులు తోసి గదిలోకి తొంగి చూసింది. ధైర్యంచేసి లోపలికెళ్ళింది. చుట్టూ చూసింది. పూనకంలాటి ఆవేశం వచ్చి పడింది.

చీరని పైకి లాగి బొడ్లో దోపి పని ప్రారంభించింది.

* * *

సుబ్రమణ్యం ఆరోజుకూడా మామూలు వేళకే ఆఫీసునించి తిరిగొచ్చాడు. రావటంగూడా తాపీగా కూని రాగాలు తీస్తూ మరీ వచ్చాడు.

వచ్చీ రాగానే గదిముందు దర్శనమిచ్చిన కొత్తరకం ముగ్గుని ఆప్యాయంగా చూసేడు. అంత ఓపిగ్గా, చక్కగా తీర్చి దిద్దుతున్న మనిషెవరాని ఆలోచనచేసేడు. ఇంటాయన భార్యా?కూతురా? పనిమనిషా? ఎవరైనాగాని చాలా గొప్ప ఆర్టిస్టు.ముగ్గుల పోటీ అంటూ ఎవడైనా పెడితే ఫస్టు ప్రయిజు ఈ మనిషికే వచ్చి తీరాలని గట్టిగా అనుకున్నాడు. అలా అనుకుని మెల్లెక్కి జేబులోకి చేతిని పోనిచ్చి తాళం చెవికోసం గాలింపు ప్రారంభించేడు.

కాసేపు జేబులన్నీ వెతికి జాడ కానరాక, వెర్రి మొహంతో నిల్చుండి పోయేడు. ఏమైందబ్బా? ఆఫీసులోగాని మర్చిపోయానా? బస్సులో జారిపోయిందా? భోజనం చేస్తూ హోటల్లో విడిచానా? ఏమైందన్న ఆలోచన ఒకవైపు, ఇప్పుడెలాగురా భగవంతుడాని ఆందోళన ఇంకోవైపు-

పిచ్చి చూపులు చూస్తూ గడపలోనే నిల్చున్నాడు.

రమణి అంతా గమనించింది. ఆరోజు పని గట్టుకుని అతడొచ్చేసరికి కనకాంబరం మొక్క పక్కన కూర్చుని ఏదో పన్చేస్తున్నట్లు నటిస్తూ ఆతగాడి అవస్థని చిత్రంగా చూస్తోంది.

ఉదయం తాననుకున్నదంతా పూర్తి చేసి ఇంట్లోకెళ్ళి పూజలోంచి అప్పుడే లేచిన తండ్రితో, 'ఆ గదిలో కుర్రాడు తాళం వెయ్యకుండా వెళ్ళిపోయాడ వుంది' అన్నది.

హనుమాయమ్మగారు, 'గ ది ... అబ్బాయున్నాడేమో' అంది అనువ సంగా. రమణి లేదని గట్టిగా చెప్పలే అస్పష్టంగా గొణిగింది.

"ఎందుకైనా మంచిది... ఒకసారె చూసిరండి" అంది భర్తతో హనుమాం మ్మగారు. రామసూర్యంగారు అం వస్త్రంతోనే బయటకొచ్చి గదిలోకి తొం చూసేరు. ఎవరూ లేరు.

రెండు క్షణాలాలోచించి ఎదురు గూట్లోవున్న తాళం తీసుకుని, తలుపు మూసి తాళంపెట్టి వెళ్ళిపోయార 'గొప్పవాడే మొత్తానికి. రేపు పెళ్ళాంత సినిమాకెళ్ళి ఏ షోదాకోసమో బయ కొచ్చి మర్చిపోయి అలాగే వచ్చేసే గున్నాడు' అనుకున్నారు.

గడపలో నిలబడి వెర్రి చూపు చూస్తున్న సుబ్రమణ్యాన్ని చూసి ము ముసిగా నవ్వుకుంటూ అక్కణ్నించి లో లోనికెళ్ళింది రమణి.

రామసూర్యంగారు బ జా రె ... ప్రయత్నంలో వున్నారు.

రమణికి ఏంచెప్పాలో, ఎలా చెప్పాలో అర్థంకాక కాస్సేపు పస్తాయించిం చెబితే, వుత్సాహం చూపిస్తున్నావ్, ఏవి సంగతని ప్రశ్నలు, చెప్పకపోతే, పాప అతగాడు తాళపుచెవి అన్వేషణలో ఆసియా ఖండమంతా తిరిగి హైరానాప తాడు అనవసరంగా.

ఏం చెయ్యాలి...?

కాసేపాలోచించి "నాన్నా ఉదయం ఆ గదికేసిన తాళంమనదా...అతడిదేనా?" అనడిగిందితండ్రిని. బయటికెళ్ళబోతున్న ఆయన కూతురి మాటకి ఆగి 'అతడ్దే.. వచ్చాడా?' అనడిగారు.



"ఏమో ! వచ్చినట్లుంచేను" అంది చాలా సాధారణమైన విషయంలా, పెద్ద ఆసక్తిలేనట్టు.

రామసూర్యంగారు వెనక్కొచ్చిగూట్లో వున్న తాళంచెవిని తీసుకుని తిరిగి బయటికెళ్ళారు.

అప్పటికే సుబ్రమణ్యం తాళంచెవి పోయిందన్న చేదునిజంతో రాజీపడి, దాన్ని వెతికి పట్టుకోవటం అసంభవమని కూడా నిర్ధారించుకుని-తాళాన్ని స్వయానా తనే బద్దలకొట్టటమా లేక ఈ రాత్రికి ఏ అరుగుపైనో కాలక్షేపంచేసి రేపుదయం తాళంకప్పల అప్పలసామిని వెతికిపట్టి అతడిచేత తీయించటమాన్నది తేలక సందిగ్ధంలోవుండగా, రామసూర్యంగారు కూరల సంచీతో బజార్లోకెళ్ళబోతూ ఆగి-

"ఏవిటోయ్.... నిలబడే ఆలోచిస్తున్నావ్?" అనడిగారు లౌక్యంగా.

సుబ్రమణ్యం జీవంలేని నవ్వొకటి నవ్వి "అబ్బే... ఏంలేదండీ! గది తాళం చెవి కన్పించకపోతేను" అని నీళ్ల నమలటం మొదలెట్టాడు.

రామసూర్యంగారు మంచి చతురులు. రిటైరయ్యాక అన్ని రసాలు చచ్చేయిగాని మునుపు ఆయన జోక్‌చేస్తే పైఆఫీసర్లు కూడా పగలబడి నవ్వేవాళ్లు.

"అసలు ఉదయం తాళం వేశావా?" అనడిగారు.

సుబ్రమణ్యం ఆయన అమాయకత్వానికి జాలిపడ్డాడు. కళ్ళ ఎదురుగా తాళం

కనిపిస్తుంటే అసలు తాళం వేసావా అని అడుగుతా దేవిటి? కాస్త పిచ్చిగానివుందా? అనుకుని పైకిమాత్రం, "భలేవారండి... గదికి తాళం వేయకుండా ఎలా వెళతాను? రెండుసార్లు గట్టిగాలాగి కూడా చూసేను. నాకు బాగా గుర్తు. కాకపోతే కీ ఏబస్సులోనో జారిపోయుంటుంది" అన్నాడు.

రామసూర్యంగారు చిలిపిగా నవ్వి. "నువ్వు చెప్పేది నిన్నటి సంగతేమో?" అన్నాడు అనుమానంగా.

సుబ్రమణ్యానికి కాస్త కోపం కూడా వచ్చింది. ఆ మాట అన్నది ఇంటి యజమాని కాబట్టి తమాయించేసుకున్నాడు.

"మీరు మరీ దారుణంగా అనుమానిస్తున్నారు. ఎక్కడో పోయింది. అంతే..." అన్నాడు నిర్ధారణగా.

రామసూర్యంగారేం తక్కువతిన్లేదు. ఆయనకీ కోపం వచ్చింది. మతిమరుపున్నవాళ్లు ఏ విషయం బల్లగుద్దినట్లు చెప్పకూడదు అని ఆయనుద్దేశం.

"చాల్లే వూరుకోవయ్యా. తలుపులు బార్లా పెట్టివెళ్ళిందిగాక నన్నే దబాయిస్తున్నావ్. నేచూసి గదికి తాళం బిగించాను కనుక సరిపోయింది. లేకపోతే ఏంకాను" అన్నాడు దబాయింపు ధోరణిలో.

సుబ్రమణ్యం తెల్లబోయాడు.

"ఏవిటి...అసలు తాళమేవెయ్యలేదా?"

"ఇంకా అనుమానమా! వెయ్యలేదంతే నేచూట్టం నీ అదృష్టం. ఇకనైనా జాగ్రత్త' అన్చెప్పి తాళం చెవిని అందించి వీధిలోకెళ్లారు.

ఆయనెళ్ళాక కూడా సుబ్రమణ్యం రెండు క్షణాలు అలాగేవుండి పోయాడు.

రామసూర్యంగారిముందు ఘోరంగా, దారుణంగా పరువుపోవటం అతడికి నచ్చిందికాదు. కాస్తబాధనిపించింది.

ఈ మతిమరుపుకి మందేదైనావుందేమో వాకబు చెయ్యాలనుకున్నాడు కాని అ కున్న విషయం గుర్తుండిచావదని బెం పడ్డాడు.

గది తాళంతీసి లోనికెళ్ళి స్విచ్ నొక్కాడు.

దీపం వెలిగింది.

కదలబోయిన సుబ్రమణ్యం కాళ్ళ తీగలు చుట్టినట్లు ఆగిపోయాడు, గదం కలయజూసేడు. కళ్ళు చిట్లించి, పెద్ద చేసి చూసేడు. మళ్ళీమళ్ళీ చూసేడు.

అది తన గదికాదు.

చిత్తుకాగితాలతోను, దుమ్ముధూళితో నడిపీథిలావుండే తన గది, ఈరో భిన్నంగావుంది. చిత్తుకాగితం చూద మన్నా ఒక్కటైనా లేదు. నేల అద్దంల మెరుస్తోంది. పక్క బట్టలు ఒకవైపు కట్టుడుబట్టలు ఇంకోవైపు అందంగ అమర్చబడున్నాయి. గూట్లోని వస్తువుల పుస్తకాలు అనుభవపూర్వకంగా సర్దబ వున్నాయి. మొత్తంగా గదినిచూ స్వర్గంలో స్వతంలాంటిదికడితే అస్వతంల గది ఇలాగే వుంటుందేమోననిపించేల వుంది.

అవును... ఈ గది తనదికాదు. కా వస్తువులు తనవే!

ఆ బక్కెట్టు, ఆ మంచం, ఆ దిళ్ళ, ఆ బట్టలు-అవన్నీ తనవే.. సందేహంలేదు

అయితే ఇంత ఓపిగ్గా, తీరిగ్గా, అందంగా సర్దిపెట్టిన మహనీయులెవరు? రామసూర్యంగారా?

ఛ ఛ..ఎంత అనుకోకుండా రిటైరైనా పనికోసం పక్కవాడి గదిసూద్చి, సామాన్ల సర్దేబాపతు కాదు.

మరెవరు?

వాళ్ళమ్మాయా?

పెళ్ళి కావలసిన పిల్ల ఓ బ్రహ్మచారి గదిని వూడ్చి, సర్దుతుందా? పెళ్ళయిన ఆడవాళ్ళే ఇవన్నీ చేయటంలేదట. ఓవేళ ఆ పిల్ల చేద్దామనుకున్నా పెద్దవాళ్ళూరుకుంటారా?

అయితే ఇంకెవరు?

రామసూర్యంగారి భార్యా?

అయ్యుండొచ్చు. గది తలుపు తీసి వుండటంచూసి లోపలికొచ్చి పరిస్థితిచూసి అయ్యో పాపం పిచ్చికుంకన్చెప్పి జాలిపడి ఒక పట్టు పట్టివుంటుంది. ఆపైన తాళం బిగించుంటుంది.

కరెక్టు-ఆవిడే అయ్యుండాలి.

ఆవిడకి థాంక్స్ చెప్పాలి అనుకున్నాడు సుబ్రహ్మణ్యం. అనుకున్న వెంటనే మళ్ళీ ఎక్కడ మర్చిపోతానోనని చకచకా బట్టలు మార్చుకుని, లుంగీతో దొడ్లోకి వెళ్లాడు.

హనుమాయమ్మగారు వాకిట్లో పట్టె మంచంపై పడుకునుంది.

రమణి గడపలో కూర్చుని ఎంబ్రాయిడరీ పనిలో వుంది.

సుబ్రహ్మణ్యం థాంక్స్ చెప్పాలని ఉత్సాహంగా అక్కడిదాకా వచ్చాడేగానీ, తీరా వాళ్ళిద్దర్నీ చూడగానే బిడియపడి వచ్చిన పని వాయిదావేసి బాత్రూంవేపు వెళ్ళబోయాడు.

అదృష్టంకొద్దీ ఆవిడే పలకరించింది.

"ఏం నాయనా! ఉదయం గదికి తాళం వేసుకోవటం మర్చిపోయావా?" అని అడిగింది.

సుబ్రహ్మణ్యం ఆగాడు.

"అవునండీ.... నిజంగా మీరు చాలా సహాయం చేసేరు" అన్నాడు.

"దానిదేం వుందిలే! చూసాంగాబట్టి సరిపోయింది-లేకపోతే ఏవైవుండేది?"

"అవునండి. చాలా ఘోరం జరిగి వుండేది. గదంతా దోచుకుపోయేవాళ్లు. మీకు చాలా శ్రమిచ్చాను"

"ఫర్వాలేదులే బాబూ"

"అలా తేలిగ్గా కొట్టిపారెయ్యకండి. మతిమరుపు అప్పుడప్పుడూ కాస్త మంచి కూడా చేస్తుందని ఇవ్వాళే తెలిసింది"

"మంచా" తెల్లబోయిందావిడ.

"అవునండి. నేగదికి తాళం పెట్టడం మరవటంచేతనేగదా మీరు గదిలో పరిస్థితి చూసి, నాపై జాలిపడి సామాన్లన్నీ సర్ది శుభ్రం చేసేరు"

"సర్దటమా...శుభ్రం చెయ్యటమా" అయోమయంగా అంది.

రమణి వాళ్ళ సంభాషణ వింటూ ముసిముసిగా నవ్వుకుంటోంది.

"మీకు పెద్ద పనిగా అన్పించదు. కాని చాలా థాంక్స్. ఇంకెప్పుడూ శ్రమ తీసుకోకండి" అని బాత్రూంవేపుగా వెళ్ళిపోయాడు.

హనుమాయమ్మగారికి అతడు చెప్పిందాంట్లో ఒక్క ముక్కగూడా అర్థమయి చావలేదు.

గది సర్దటమేమిటి? శుభ్రం చెయ్యటమేమిటి? శ్రమేవిటి? కొంపతీసి గదిలో వస్తువులేవైనా పోయినాయా? ఆ విషయం చెప్పటానికివిధంగా నరుక్కొస్తున్నాడా?

సుబ్రహ్మణ్యం మొహం కడుక్కుని తిరిగి గదివేపు వెడుతుండగా-

"ఏం నాయనా! గదిలో వస్తువులేవైనా పోయినాయా?" అంది.

అప్పటిగ్గాని సుబ్రహ్మణ్యానికి తన మాటల్లో స్పష్టత లోపించిందన్న విషయం తెల్సిందికాదు.

"ఎంతమాట - గదిలో చెత్తా చెదారం వూడ్చి, వస్తువులన్నీ చక్కగా అమర్చి,

బక్కెట్టుతో నీళ్లుకూడా పట్టిపెట్టేరు. అందుకనే థాంక్స్" అన్చెప్పి ఇంకా మాట్లాడితే ఏ విపరీతార్థానికి దారి తీస్తుందోనని గబగబా వెళ్ళిపోయాడు.

హనుమాయమ్మగారికి విషయం అర్థమైంది. కూతురి వంక చూసింది.

"ఏమే! నువ్వుగానీ ఆ గదిని సర్దావా?" అనడిగింది.

రమణి తన పన్లోంచి తలెత్తకుండానే "సర్దటంలేదూ, వూడ్చటంలేదు. మరీ దుమ్ముగా వుందని రెండు చీపుళ్ళే సానంతే - అదేం మనిషో బొత్తిగా శ్రద్ధలే లేదు" అంది చిరాగ్గా కావాలనే.

హనుమాయమ్మగారు యాభైలో పడింది. తలకూడా నెరిసింది. అంచేత కూతురు చిరాగ్గా అతిసాధారణమైన విషయంగా చెప్పిన వాలకం వెనకనున్న పరమార్థాన్ని పసిగట్టింది! చీకట్లో చిన్నగా నవ్వుకుంది.

గదిలో సుబ్రమణ్యం ఇస్త్రీ పైజమా తొడిగాడు. టేబిల్ ఫేన్ ఆన్‌చేశాడు. పరిమళంకోసం అగరొత్తులెలిగించేడు.

ఆరోజతడికి హాయిగావుంది. మత్తుగా వుంది. ఫైవ్‌స్టార్ హోటలు గదిలో వున్నంత హాయిగా, శోభనం గదిలో వుండేటంత మత్తుగాను వుంది.

మనస్సులోనే హనుమాయమ్మగారికి మళ్లీ మళ్లీ థాంక్స్ చెప్పుకుంటున్నాడు. ప్రతిరోజూ గది తలుపులు తెరచిపెట్టి వెళ్తే ఎలా వుంటుందని ఆలోచన చేస్తున్నాడు.

అప్పటికిగానీ ఉదయం పోస్టులో వచ్చిన వుత్తరాన్నిచూ సేడుకాదు. రమణి గదంతా సర్ది ఆ వుత్తరాన్ని కన్పించేటట్లుగా టేబిల్‌పై వుంచింది. సుబ్రమణ్యం కాస్సేపు ఆలోచన్లు, పచార్లుచేసి పక్కపై వాలబోతూ ఆ వుత్తరాన్ని చూసేడు. చేతిలోకి తీసుకుని దస్తూరీని పరీక్ష చేసేడు. తండ్రిదే! సందేహంలేదు

ఉత్తరాన్ని పరపరా చించేడు.

లోపల దస్తూరి మారింది. భాషకూడ వుత్తరాల్లో వాడేదికాక వాడుకభాషేవుంది అక్షరాలు గుమ్మడికాయ వడియాల్లాగ అనేక సైజుల్లో వున్నాయి. ఉత్తరం చివర్న వుండే సంతకం చూసేడు - బామ్మగారు రాసింది. బామ్మగారికి అరవైపైనే వుంటుంది వయస్సు. ఆవిడ అసలు పేరేమిటో సుబ్రమణ్యానికి తెలీదు. ఆవిడ తనకు బామ్మవుతుందని మాత్రం గుర్తుంచుకున్నాడు. ఆవిడ భర్త పేరు కూడా సుబ్రమణ్యమే. అంచేత మనవడంటే ఆవిడకి గొప్ప ప్రేమ.

సుబ్రమణ్యం వుత్తరాన్ని పఠించటం మొదలుపెట్టేడు.

'సుబ్బులూ!

ఎలా వున్నావ్? కుశలమేనా? భోజనం సరిగ్గా చేస్తున్నావా? పెసరపప్పు, గుమ్మడికాయ దగ్గిరకి రానీకు. అవి నీకు పడవు. రాత్రిళ్లు గ్లాసుడు పాలుతాగు.

అన్నట్లు నాన్న నీకు నాలుగు వుత్తరాలు రాశాట్ట. ఒక్కదానికి నువ్వు జవాబు రాయడంలేదని మండిపోతున్నాడు. నీ పేరుచెబితే రక్తపోటు పెరుగుతోంది. రోజూ నిన్ను తిట్టి ఆపైన జపాని క్కూర్చుంటున్నాడు. వెంటనే వుత్తరం రాసిపడెయ్యి. నే వుత్తరం రాసినట్లు చెప్పక

బామ్మ వ్రాలు.

సుబ్రమణ్యానికి ఆ వుత్తరం చూసేక నవ్వాగిందికాదు. తండ్రిచేత అడ్రసు రాయించి ఆయనకే వుత్తరం రాసినట్లు చెప్పొద్దని హెచ్చరిక!

తండ్రి నాలుగు వుత్తరాలు రాసిన మాట నిజం. కాని తను జవాబు రాయ

లేదనడం సబబుకాదు. మొదటి వుత్తరానికే జవాబు రాశాడు. కాకపోతే డబ్బాలో పడెయ్యటం మర్చిపోయాడంతే! తండ్రి రాసిన నాలుగు వుత్తరాల్లోను ఒకటే విషయం! మొదటిదాంట్లో రాసినట్లు నేవెళ్ళి కల్సుకోమన్న పెద్దమనిషిని కల్సుకున్నావా అని.

కాని సుబ్రమణ్యం బాధ ఎవ్వరికీ అర్థంకాదు.

తండ్రి రాసిన మొదటి వుత్తరంఎక్కడో పోయింది. తాను కల్సుకోవలసిన ఆ పెద్ద మనిషి అడ్రసు అందులోనే. తగలడింది. అడ్రసు లేనపుడు ఎన్ని ఉత్తరాలు రాసినా తనేం చెయ్యగలడు?

ఆ రాత్రి అప్పటికప్పుడే కూర్చుని తండ్రికి సమాధానం రాసేడు. ఎవర్ని కలవాలో ఆ పెద్దమనిషి అడ్రస్సు రాయమనీ, ఈసారి ఉత్తరం వచ్చిన రోజే ఆయన్ని కల్సి, జవాబు రాస్తాననీ నమ్మకంగా రాసాడు.

కానిదీన్ని పోస్టుడబ్బాలో పడేస్తానన్న హామీ కోరుకుంటూ, హే-భగవాన్! నువ్వే కాపాడాలని ప్రార్థనచేస్తూ నిద్రలోకి జారేడు.



సుబ్రమణ్యం తండ్రి శేషగిరి వాళ్ళవూరి ఏకైక స్కూల్లో ఏకైక హిస్టరీ టీచరు. పాఠం చెప్పటంలో మంచి ప్రావీణ్యం వుంది. ఆయన బుద్ధుడి గురించి చెబితే సన్యాసుల్లో కలవాలని, అలగ్జాండరు గురించి చెబితే పక్కవూరిపైన విరుచుకు పడాలని అనిపిస్తుంది.

ఆయనకింకా రెండు సంవత్సరాల సర్వీసే వుంది. ఆ నిజం ఆయనచేత ఈమధ్య పాఠాన్ని తిన్నగాచెప్పనీయటం లేదు. ఇద్దరాడపిల్లలకి ఎలాగో తంటాలు పడి పెళ్ళిళ్ళు చేసేరు. సర్వీసులో వుండగానే కొడుకుకికూడా పెళ్ళిచేసి ఆ కట్నం డబ్బుల్తో అప్పులన్నీ తీర్చేసుకుని, రిటైర్డ్ లైఫ్ ప్రశాంతంగా గడపాలని ఆయన తాపత్రయం.

ఆరోజు ఆయన చాలా కోపంగా వున్నారు. అంచేత స్పీడుగా పచార్లు చేస్తున్నారు. భార్య తాయారమ్మ దూరంగా నిల్చుంది ఎందుకైనా మంచిదని.

"చూసేవా! ఈ వెధవకి సమాధానం రాయాలన్న ఇంగితంవుందేమో? ఒక్కటి కాదు నాలుగు... నాలుగు వుత్తరాలు రాశానే" అన్నారు.

"అందలేదేమో" అంది భార్య తపాలా శాఖ ప్రతాపాన్ని పసిగట్టేసినట్లు.

"ఏమిటీ...అందలేదా! ఒక్కటిగూడా అందుండదా... వెధవకి వొళ్లు బలిసి పోయింది"

"అలా అనబోకురా. ఎక్కడో దూరానున్నాడు" అంది బామ్మగారు. భర్త పేరు కూడా అదే కావటంచేత ఆవిడకో చిన్న సెంటిమెంటు.

"అదికాదే! వాడి మంచి గురించేకదా నేరాసింది. అనుకోకుండా పతంజలి చాలా ఏళ్ళ తర్వాత కలిశాడు. వాడి కక్కడ మంచి పేరు,పలుకుబడివున్నాయ్, డబ్బుంది. 'ఒక్కసారి నీకొడుకునొచ్చి కలవమని చెప్పరా. ఆపైన నేచూసు కుంటా' నన్నాడు. సరేకదాని వుత్తరాలు

రాసిపడేశా. కనీసం ఆయన్ని కలిశాను అని వొక్క ముక్క రాసేడేమో చూశావా వాడి మంచి వాడికి తెలీదు...చెప్పినా అర్థం కాదు.. ఎలా వచ్చేది"

కొడుకిలా రంకెలేస్తున్నాడనే బామ్మ గారు మనవడికి వుత్తరం రాసి పడేసింది. ఆ విషయం కూడా తెల్సుగనుక శేషగిరి మరింత రెచ్చిపోతున్నాడు.

"సరే... నేనంటే లక్ష్యం లేదు. అయ్యో పెద్దది బామ్మ వుత్తరం రాసింది. కనీసం ఆవిడకన్నా జవాబు రాద్దామని జ్ఞానం వుందేమో చూసేవా?"

భార్య కలగజేసుకుంది.

"సర్లెండి....వాడి ఉద్యోగం మీ నౌకరీలాంటిదికాదు. పొద్దునెళ్ళి సాయంత్రం గాని రాడు. మీలాగా పాఠం ఆపి దాహానికి ఇంటికొచ్చే వసతి వాడికుండదుగా" అంది వత్తాసుగా.

"ఓహో... అందే వుద్యోగాల్చేసే వాళ్ళంతా వీధిలాగా కొంపలకి వుత్తరాలు రాయటం లేదంటావా?"

బామ్మగారు అన్నీ వింటోందేగాని చూపుల్ని మాత్రం రోడ్డుపైనే బిగించింది. ఇవ్వాళ వుత్తరం రావొచ్చని ఆవిడకి పదేపదే అన్పిస్తోంది.

ఒక్కోసారి కొన్ని విషయాలపై ముందుగానే కొన్ని వూహలొస్తుంటాయ్ ఆవిడకి. అవి తరచు నిజాలవుతుంటాయ్.

అంచేత ఆశగా రోడ్డువెపు చూస్తోంది.

దూరాన్నుంచి సైకిలు గంట మోగించుకుంటూ వస్తున్న కాకీబట్టల కుర్రాణ్ని చూసేక అంది- "ఇవ్వాళ జవాబు వస్తుందిలే... ఆయాసపడక" అని.

శేషగిరి తల్లిమాట విని పదార్లు ఆపేడు.

పోస్టుమాన్ ఇంటిముందు సైకిలాపి, వుత్తరాల కట్టలోంచి కవర్ని బయటకి లాగి ఆయనకందించి సైకిలెక్కాడు.

బామ్మగారి మొహం వెండిపళ్ళెంలా వెలిగిపోయింది.

"నే చెప్పలా ఇవ్వాళొస్తుందిరాని" అంది బామ్మగారు.

"రాకేం చేస్తుంది... మన కంగారు గాని" అంది భార్య.

శేషగిరి వాళ్ళ మాటలు విన్నాడు కాదు. వుత్తరం చదవటంలో లీనమైపోయాడు.

"ఎవరూ...సుబ్బులేనా?" అనడిగింది బామ్మగారు.

"ఆ... సుబ్బులే! అడ్రసు రాసిన ఉత్తరం ఎక్కడో పెట్టి మర్చిపోయాట్ట. మళ్ళీ రాస్తే వెళ్ళి కలుస్తాను అని"

"మరింకేం! రాసి పడేయ్" అంది బామ్మగారు.

"నేనిలాగే రాసి పడేస్తుంటా, వాడేమో పారేస్తుంటాడు. మతిమరుపు వెధవ"

భార్య సన్నగా గొణుక్కుంటూ లోనికెళ్ళిపోయింది.

బామ్మగారు మెల్లిగా అడిగింది కొడుకుని- "ఆ పతంజలికి పెళ్ళిగావల్సిన పిల్లగానివుందా' అని.

శేషగిరికి ఆ ప్రశ్న వెనకనున్న భావం అర్థమైంది.

"పెళ్ళికి పిల్లవుందనికాదునే చెప్పేది. కాస్త పెద్దవాళ్ళతో పరిచయాలేర్పరచుకుంటే మంచిదని. వాడికక్కడ అవసరమొస్తే వుపయోగపడతాడని. పతంజలికి నేనంటే చచ్చే అభిమానం. సరే... మళ్ళీ రాస్తాలే" అని వీధిలోకెళ్ళిపోయాడు.

బామ్మగారికి కొడుకుకోపానికి కారణం అర్థమైంది.

అంచేత సన్నగా నవ్వుకుంది.

* * *

మతిమరుపు గురించి సుబ్రమణ్యం ఈమధ్యన కాస్త శ్రద్ధగా ఆలోచించేడు. ఆ మాటకొస్తే చాలా రీసెర్చిగూడా చేసేడు. లైబ్రరీకెళ్ళి మతిమరుపు గురించిన చరిత్రంతా చదివేసేడు. ఈ బలహీనతనిజయించేందుకు చిన్న చిట్కా కూడా కనిపెట్టేడు.

గదిలోపల గుమ్మం పైని వెంకటేశ్వరస్వామి ఫొటో వుంది.

బయటికెళ్ళేప్పుడు ఆ ఫొటో వంక చూడటం అలవాటు.

ఒక కాగితంపైన పెద్దపెద్ద అక్షరాల్లో కన్పించేలా ఇంగ్లీషులో రాసేడు, "ఏదేనా మరిచిపోయారేమో! ఆగి, ఆలోచించండి" అని దాని అర్థం. ఆ కాగితాన్ని దేవుడి ఫొటోకి పక్కగా బంక పెట్టి అంటించాడు. బయటికెళ్ళే సమయంలో ఫొటోని చూడ్డం తప్పక జరుగుతుంది.అది చిన్నప్పట్నించీ వచ్చిన అలవాటు. మర్చిపోవటం అనే మాటేలేదు. అప్పుడు ఆ కాగితాన్ని చదువుతాడు. చదివి ఆలోచిస్తాడు...దట్సాల్.

మతిమరుపు రాక్షసి ఇంకో కొంప చూసుకోవాల్సిందే...తప్పదు.

ఆ రోజు సుబ్రమణ్యం ఆఫీసుకని బయల్దేరాడు.

తాళాన్ని చేతిలోకి తీసుకుని వెంకన్న ఫొటోవంక చూసి కళ్ళతోనే నమస్కారం చేసేడు. పక్కన అతికించిన కాగితాన్ని చదివాడు. అంచేత ఆగి ఓ క్షణం ఆలోచించేడు.

పోస్టుచెయ్యాల్సిన వుత్తరాలు – లేవు. బిల్సుకూపన్లు – జేబులోవున్నాయ్. మనీ పర్సు–వుంది. పాంటు బొత్తాలు–సరిగ్గానే వున్నాయ్. తలదువ్వేనా–దువ్వుకున్నాను. ఇంకేమిటి...నథింగ్ మోర్!

ఛలో!

బయటికొచ్చి తలుపుల్ని దభేల్మని మూసేడు.

మొక్కల చాటునున్న రామసూర్యంగారు వులిక్కిపడి లేచి నిల్చున్నారు. సుబ్రమణ్యం తాళంవేసి జాగ్రత్తకోసం దాన్నిపట్టి గుంజుతున్నాడు అదేపనిగా.

రామసూర్యంగారికి కోపం వచ్చింది. భయంగూడా వేసింది. తలుపుల్ని నాశనం చేసేలా వున్నాడనిపించింది. సర్వీసులో వుంటే దేనికీ భయపడేవారుకాదు, దేన్నీ లక్ష్యపెట్టేవారు కాదు.

"తాళంవేశావుగా..ఎందుకలా దాన్ని పట్టుకుని వుయ్యాలూగుతావ్...గొళ్ళెం వూడేను జాగ్రత్త" అన్నారు బలవంతంగా నవ్వుతూ.

ఆ మాటకి సుబ్రమణ్యం సిగ్గుపడి, ఏవీ మర్చిపోలేదన్న ధీమాతో వీధిలోకి వెళ్ళాడు.

రామసూర్యంగారు స్నానానికెళ్ళారు.

రమణి తన పన్లన్నీ పూర్తిచేసుకుని మొక్కలకి నీళ్లుపెట్టింది. ఆ పైన సుబ్రమణ్యం గదిముందు వూడ్చి, నీళ్లు చల్లి ముగ్గుపెట్టింది.

అప్పటికి తండ్రి స్నానంపూర్తిచేసి తదుపరి కార్యక్రమం పూజలో కూచ్చున్నారు. తల్లి వంటగదిలోవుంది.

రమణి తను చెయ్యదల్చుకున్నవి, చెయ్యాల్సినవి పన్లు పూర్తికావటంచేత సగంలో వదిలిన ఎంబ్రాయిడరీ పని మొదలుపెట్టబోతూ బాత్రూంలోకెళ్ళింది.

ఆ గదిలో మూలగావున్న ఎర్ర ప్లాస్టిక్ బకెట్టు ఆమె దృష్టిలో పడింది.

అది సుబ్రమణ్యానిది.

దాంట్లో సబ్బుపెట్టిన పాంటు, షర్టు

పరుగులు కక్కుతున్నాయ్. బంకపెట్టి గోడకంటించుకున్న కాగితం సుబ్రమణ్యానికి దొడ్లో వదిలిన బట్టలగురించి గుర్తుచేసింది కాదు.

రమణి రెండుక్షణాలు నిలబడి ఆలోచన చేసింది.

కావాలని వదలివుంటాడానిగూడా ఆలోచించింది.

'ఛఛ... అలాంటిదేం కాదు. కొంటెతనం కానేకాదు. మతిమరుపే పాపం' అనుకుంది.

ఇంకేం ఆలోచించకుండా బక్కెట్టుని చేతిలోకి తీసుకుంది. పదినిమిషాల్లో ఆ రెండింటినీ శుభ్రంగా గుంజివేసి ఒక మూలగా ఎవరికీ కనిపించకుండా తీగపైన ఆరేసింది.

బక్కెట్టుని ఎక్కడ చూసిందో అక్కడే వుంచింది.

లోనికెళ్ళి ఎంబ్రాయిడరీలో మునిగిపోయింది.

మధ్యాహ్నమయ్యేసరికి రామసూర్యం గారికి నిద్ర ముంచుకొస్తుంది. సర్వీసులో వుండగా ఫైళ్ళ వెనకాలే కునుకు లాగించేవారు-గుమాస్తాల కంట పడకుండా. రిటైరయ్యాక బేఫికరుగా భోంచేసి నిద్రపోతున్నారు. ఏపనీ, ఏ శక్తీ ఆయన్ని ఆ కార్యక్రమం నుంచి ఆపలేవు.

హనుమాయమ్మగారికి మధ్యాహ్నపు నిద్ర అలవాటు లేకపోయినా, పడిన శ్రమకి విశ్రాంతిగా వంటగదిలో గచ్చుపైనే కొంగు పర్చుకొని ఏ పుస్తకమో చదువుకుంటూ ఒక గంటసేపు దొర్లుతుంది.

రామసూర్యంగారు పడగ్గదిలో, హనుమాయమ్మగారు వంటగది గచ్చుపైన పవళించి వుండగా రమణి దొడ్లోకొచ్చింది.

ఎండ ఫెళ్ళున కాచిందేమో ఆరేసిన పాంటు,షర్టుఎండి రెపరెపలాడుతున్నాయ్.

వాటిని మెల్లిగా చేతిలోకి తీసుకుని తల్లి కంటపడకుండా మధ్య గదిలోకెళ్ళింది.

ఎలక్ట్రిక్ ఐరన్ బయటకి తీసి ప్లగ్ తగిలించింది. పెట్టె వేడెక్కాక ఆ రెండింటిని ఇస్త్రీ చేసే కార్యక్రమం మొదలెట్టింది.

ఆ పని ఆమెకి బాగా తెల్సును. తండ్రివి, తల్లివి, తనవి బట్టలన్నీ రెండ్రోజులకోసారి ఉతికి, ఇస్త్రీ చేసి మడతలుపెట్టి బీరువాలో వుంచుతుంది.

కాని ఆక్షణంలో సుబ్రమణ్యం బట్టలకి పెట్టె రుద్దుతుంటే తప్పుగా అన్పించకపోగా ఏదో అర్థంకాని థ్రిల్లుగా కూడా వుంది.

అతడి ముంగిలిలో ముగ్గేసినక్షణం, గదిని శుభ్రం చేసిన క్షణం కూడా తప్పనిపించలేదు.

దానిక్కారణం-

ఆమె కంటికతడు ఆకతాయి కుర్రాళ్ళా కాకుండా భిన్నంగా కన్పించటమే.

తను కన్పిస్తే వులిక్కిపడి తప్పుకునే పద్ధతి, ఎదురై చిరునవ్వు చిందిస్తే అతడిలో కన్పించే తత్తరపాటు, లోకం తెలీని అమాయకత్వం అందుక్కారణాలు.

కొంతమంది ఆడపిల్లలకి గొడవచేసే మొగాళ్ళంటే ఇష్టం. ఇంకొంతమందికి మొరటువాళ్ళంటే మోజు. కొద్దిమందికి బుద్ధిగా దద్దోజనంలాగా వుండేవాళ్ళంటే గొప్ప గురి.

రమణికి గొడవలుచేసే అల్లరి రకం, మొరటుగా వుండే చిల్లర రకమంటే గిట్టదు. బుద్ధిమంతరపుతనం జీవితంలో

చాలా ముఖ్యమని ఆమె థియరీ.

అది సుబ్రమణ్యానికి పుష్కలంగా వుందని కూడా కనిపెట్టింది.

అంచేత అతడంటే ఇష్టాన్ని నిశ్శబ్దంగా పెంచుకోసాగింది.

పాంటు, షర్టు ఇస్త్రీ చేసి ఆ రెండు మడతలని భద్రంగా బీరువాలో వుంచింది. ఈసారి కాస్సేపు ఏడ్పించిగాని ఇవ్వ రాదని గట్టిగా అనుకుంది.

సాయంత్రం అతడొచ్చేసరికి ఏమీ తెలీనట్లుగా దొడ్లో కుర్చీ వేసుక్కూర్చుని దిండు గలీబుపైన చిలకా గోరింక బొమ్మలని అల్లుతోంది.

సుబ్రమణ్యం రావటం చాలా తాపీగా వచ్చేడు. హుషారుగా కూడా వున్నాడు. బట్టలు మార్చి లుంగీ కట్టేడు.

మొహం వాషింగుకని బాత్‌రూంకి కెళ్ళాడు.

అక్కడున్న తన బకెట్టుని చూసాక గాని బట్టల విషయం గుర్తు కొచ్చింది కాదు.

నిజమే....వుదయం ప్యాంటు, షర్టుకి సోపు పట్టించి బక్కెట్లో వుంచాడు... ఆపైన ఏమైంది? స్నానం చేసాడు. ఆఫీసుకెళ్ళేముందు వుతికి గదిలో ఆరేద్దా మనుకున్నాడు. కాని గుర్తు లేక అలాగే వెళ్ళిపోయాడు.

కాని ఇక్కడేమో ఖాళీ బక్కెట్టు మాత్రమే వుంది. బట్టల్లేవు! అంటే?



సుబ్రమణ్యం ఆదుర్దాగా అటూ ఇటూ చూసేడు.

రమణి ఓరకంట అంతా కనిపెడు తూనే వుంది. వేళ్ళు కదుల్తూనే వున్నాయి. ఏంచెయ్యాలో తెలీక వచ్చినపని మర్చిపోయి అలాగే నిల్చుండిపోయాడు సుబ్రమణ్యం.

ప్యాంటుషర్టు పోయినట్లే ... నిక్షేపం లాటివి. కుట్టించి రెండు నెలలు గూడా కాలేదు. ఛఛ...తను బాగుపడ్డు.

కాని వెంటనే చిన్న ఆశ!

ఒకవేళ హనుమాయమ్మగారు తీసి జాగ్రత్త చేసిందేమో?

అతడు అక్కణ్ణుంచి కదిలి కాస్త ముందుకొచ్చేడు.

అతడి ప్రతికదలికని ఆమె గమనిస్తూనే వుంది. ఏమంటాడో చూద్దాంలెమ్మని అలాగే కూచ్చుంది.

"మీ అమ్మగారున్నారాండి?" అన్నాడు బింకంగా.

"లేరండీ! పక్కవారింట్లో వుంది. ఏవన్నా పనాండి?"

"అబ్బే ... ఏం లేదండి! పూరికినే... సర్దాగా"

రమణికి నవ్వాపుకోవటం కష్టంగా వుంది. పళ్ళ బిగువున వెల్లుకొస్తున్న నవ్వుని వెనక్కి తోసేస్తూ కాస్త కోపంగా చూసింది.

ఆ చూపుకి సుబ్రమణ్యం తట్టుకోలేక పోయాడు. తాను చివరిగా వాడినపదం వల్లే ఆమెకంత కోపం వచ్చిందని సర్దుకుంటున్నట్లుగా-

"చిన్నపనుందండి.అంతే!" అన్నాడు పొడిగా.

సరిగ్గా అదే సమయానికి రామసూర్యంగారు వీధిలోకెళ్ళటానికి ఇంట్లోంచి బయటికొచ్చేరు. వాళ్లిద్దర్నీ చూసి ఆగేరు. సుబ్రమణ్యం మొహంలో ఆందోళనచూసి, "ఏవిటోయ్...మళ్ళీఏమైంది" అనడిగారు.

"అహ...ఏం కాలేదండి! ఉదయం పాంటు, షర్టుకి సోపు పెట్టి బక్కెట్లో పడేసి ఆఫీసుకెళ్లానండి. కాని ఇప్పుడు చూస్తే-ఇహిహి...బక్కెట్టు మాత్రమే వుందండి. ఇహిహి...బట్టల్లేవండి"

రామసూర్యంగారు కోపంతో పెద్దగా నిట్టూర్చి, కూతురివంక చూసి, "ఏమ్మా! మీరెవరన్నాగాని తీసేరా..." అనడిగారు.

రమణి తల ఎత్తకుండానే, "ఏమో! నేనయితే చూడలేదు. అమ్మ సంగతి నాకు తెలీదు" అంది.

సుబ్రమణ్యం బోనులో నిలబడ్డ ముద్దాయిలా వుండిపోయాడు. రామసూర్యంగారికి వాళ్ళిద్దర్నీ వదలి వెళ్ళటం ఇష్టంలేక పక్కనేవున్న సిమెంటు అరుగుపై కూర్చుంటూ, "అంత మతిమరుపైతే ఎలాగోయ్! ఒకరోజు దీపం ఆర్పటం మర్చిపోతావు, ఇంకోరోజు గదికి తాళం వెయ్యటమే మర్చిపోతావ్. రేపు బట్టలు లేకుండా ఆఫీసుకెళ్ళేట్టు వున్నావ్" అన్నారు సీరియస్‌గానే.

రమణికి ఆ మాటవిన్నాక నవ్వాగింది కాదు-ఫెళ్ళున నవ్వింది.

కూతురు నవ్వేక తన మాటలోని జోక్ అర్థమయ్యి ఆయనా నవ్వేరు. వాళ్ళిద్దరూ అలా నవ్వేసరికి సుబ్రమణ్యంకి బాధని పించింది. అహంకాస్త దెబ్బతిన్నట్లని పించింది. అవమానం పొందినట్లు తల వంచుకుని గదివేపుగా వెళ్ళిపోయాడు.

అతడెళ్ళిపోగానే రామసూర్యంగారు లేచి నిలబడి "అలా బజార్లోకెళ్లొస్తా" నంటూ వెళ్ళిపోయారు.

మరేం ఆలోచించకుండా రమణి

ఠంగునలేచి చేతిలో సరంజామాని కుర్చీలో పడేసి లోనికి పరిగెత్తి, బీరువాతెరచి పాంటు, షర్టు తీసుకుని అతడి గదివేపుగా బయల్దేరింది.

సరిగ్గా అదే సమయానికి హనుమాయమ్మగారు లోనికొస్తూ కూతురుకెదురయింది. కూతుర్ని, ఆమె చేతిలో బట్టల్ని కూడా చూసింది.

"ఏవిటే అవి?" అనడిగింది అర్థం కాక.

రమణి కంగారుపడింది. ఏం చెప్పాలో తెలీక తడబడింది. "బట్టలు..." అంది.

"ఆ విషయం తెలుస్తూనే వుంది. కాని ఎవరివని?"

ఆ ప్రశ్నకి ఏంచెప్పాలో తెలీక అలాగే నిల్చుండిపోయింది.

హనుమాయమ్మగారికి ఆమె చేతిలో బట్టల్ని, మొహంలో భయాన్ని చూసేక విషయం అర్థమైంది.కూతురివంక గుర్రుగా చూసి విసవిసా లోనికి దారితీసింది.

ఆవిడుద్దేశం కూతురు తనవెనకే వచ్చేయాలని.

కాని రమణి అలా అర్థంచేసుకోలేదు. "వెళ్లి ఇచ్చేసిరా" అన్నట్లు భాష్యం చెప్పుకుని, ముందుకుసాగి అతడి గదిని చేరుకుంది.

సుబ్రమణ్యం మంచం మధ్యలో దిగులుగా, దీనంగా కూర్చున్నాడు. చూపు గోడపైన బంకపెట్టి భగవంతుడి పక్కగా అంటించుకున్న కాగితంపైన వుంది.

నిక్షేపంలాంటి పాంటు, షర్టు పోయాయనే బాధ ఒకవేపు, ఇంటి యజమాని పెళ్ళికాని కూతురి ముందర తనపరువంతా తీసేసాడన్న బాధ ఇంకోవేపు. ఆయనకి తనపైన జోక్ చెయ్యాలనుకుంటే అదేనా సమయం-సందర్భం? తనని పక్కకిపిల్చి, సుబ్రమణ్యం ఇదిగోనోయ్ జోకులన్చెప్పి పెట్టుంటే ఎంతసేపు కావాలంటే అంతసేపు నవ్వివెట్టేవాడే! ఆ మాత్రం సందర్భశుద్ధి ఉండొద్దూ ఆ పెద్దమనిషికి. సరే...ఆ పెద్దమనిషి వుద్యోగంపోయి బాధకొద్దీ ఏడుస్తే బావుండదని జోకేడు. సరే...కాని ఆ పిల్ల ఆ నవ్వేమిటి..ఇహిహి అనుకుంటూ అయినా తనకి మతిమరుపు! ఏవిటి? ఏ జన్మలోనో ఎవరి బుర్రో తినేసి వుంటాడు.

గడపలో గాజుల శబ్దంవిని సుబ్రమణ్యం చూపుల్ని ఆ వైపుగా తిప్పేడు.

అక్కడ రమణి నిల్చునుంది. చేతిలో ఇస్త్రీ బట్టలు, పెదవులపైన చిరునవ్వు.

సుబ్రమణ్యం సర్వంమరిచి అలాగే చూస్తుండిపోయాడు కాసేపు. గుండె లోపల అర్థంకాని అలజడి, బుర్రంతా ఏ ఆలోచనా లేకుండా మొద్దుబారిన ప్రశాంతత.

అతడు తేరుకునే లోపలే ఆమె 'మీ బట్టలు' అంది పొడిగా.

సుబ్రమణ్యం అప్రయత్నంగా లేచి నిల్చున్నాడు. తడబడే అడుగుల్తో కాస్త ముందుకొచ్చి ఆమె చేతిలోని బట్టల్ని అందుకున్నాడు. అప్పుడుతనవేళ్ళకి తాకిన ఆమె లేత చేతి స్పర్శతో బుర్రలోని స్తబ్దతను ఎత్తేసినట్లుగా సందడి...

"ఎక్కడున్నాయండి?" అనడిగాడు ఆనందంగా.

"ఉదయం బాత్‌రూమ్‌లో మర్చిపోయారు. ఉతికి ఆరేసి ఇస్త్రీ చేసేను" అంది కాస్త గొప్పగా.

ఇందాక ఆమె నవ్విందని కోపగించుకున్నందుకు బాధపడ్డాడు.

"చాలా థాంక్సండీ! అసలు పాంటు, షర్టు పోయుంటాయన్చెప్పి సున్నా

చుట్టేసుకున్నా... బతికించేరు" అన్నాడు.

ఆమె అక్కడే నిల్చుని తదేకంగా అతడివైపే చూస్తోంది.

సుబ్రమణ్యం మళ్లీ అన్నాడు-

"ఈ మతిమరుపుతో గొప్ప చిక్కొచ్చి పడిందండీ! మా ఇంట్లో అయితే అమ్మ, బామ్మ వెనకాలేవుండి కవచాల్లాగా కాపాడతారు. ఇక్కడా మీరున్నారనుకోండి. కాని..."

రామసూర్యంగారి ఫ్యామిలీ మొత్తాన్ని వుద్దేశించి 'మీరు' అనే పదం వాడేడు కాని తననే అన్నాడనుకుని రమణి చిన్న చురక వేసింది.

"అంటే నేనూ మీ అమ్మాబామ్మా లాంటిదాన్నేనా?"

చిన్నమాట ఎంత పన్చేసిందో అర్థమైంది. గురుడు సర్దుకున్నాడు.

"అంటే నా వుద్దేశం మీరూ వాళ్ళంత అభిమానంగా అని" అనేసి అక్కడితో ఆగిపోయేడు.

రమణి అతడి కంగారుకి సన్నగా నవ్వుకుంది.

"మొన్న గదికి తాళంవేసి నా ఆస్తిని కాపాడేరు. ఇవ్వాళ బట్టలిచ్చి మానం కాపాడేరు"

రమణి ఈసారి పెద్దగా నవ్వింది.

సుబ్రమణ్యానికి ధైర్యం వచ్చింది.

"ప్రతిరోజూ గదిముందర ముగ్గులు పెట్టేది కూడా మీరేకదూ" ఆసక్తిగా అడిగేడు.

ఆ ప్రశ్నకి ఆమెబదులివ్వలేదు. అతడి వంక అదోలా చూసి అక్కణ్నించి కదిలి మొక్కల పక్కనించి వనదేవతలా మాయమైంది.

ఆ చూపులోనే జవాబుంది అర్థం, చేసుకుంటే.

సుబ్రమణ్యం అర్థం చేసుకున్నాడు.

రమణి లోనికెళ్ళేసరికి హనుమాయమ్మగారు గడపలోనే సిద్ధంగా నిల్చుంది.

"ఇచ్చేవా?" అంది కోపంగా.

రమణి బదులివ్వకుండా లోనికెళ్ళింది. ఆవిడ కూతురు వెంటే వెళ్ళి-

"అదికాదే-పెళ్లి కావలసినపిల్లవి. ముక్కూ మొహం తెలీని ఆ కుర్రాడి బట్టలు వుతకటం, ఇస్త్రీ రుద్దటం, పైగా తీసుకెళ్లి ఇవ్వటం...ఎవరైనాచూస్తే ఎంత అప్రతిష్ట" బుగ్గలు నొక్కుకుంటూ అంది.

రమణి కావాలనే కాస్త విసుగుని ప్రదర్శించింది.

"అబ్బ...ఇప్పుడేమైందని రాద్ధాంతం? ఉతికినవే- మర్చిపోయినట్లున్నాడు. బాత్‌రూంలో కన్పించాయి. తీసి తీగపైన పడేశాను. అవే ఎండాయి. సర్లెమ్మని పెట్టె రుద్దేను. అతగాడు బట్టలు పోయాయని కంగారుపడుతుంటే కాస్త ఏడవనిచ్చి తీసుకెళ్లి ఇచ్చాను. అంతే!" చాలా తేలిగ్గా చెప్పింది.

హనుమాయమ్మగారు కళ్లింతచేసుకుని కూతురి వంక చూస్తూ-

"మొన్నకి మొన్న అతడిగదంతా వూడ్చేవా? రోజూ వాకిట్లో వూడ్చి ముగ్గులు పెడుతున్నావా? ఇవ్వాళ బట్టలుతికేవా? ఇవన్నీ నాన్నగారికి తెలిస్తే ఇంకేమన్నా వుందా?"

రమణి మౌనంగా వుండిపోయింది.

అయితే ఈ రాద్ధాంతమంతా రామసూర్యంగారికి తెలీకుండా జాగ్రత్త పడ్డారు తల్లీకూతుళ్లు.

అమన్నాడు...

రమణి చేతులమీదుగా తీసుకున్న

పాంటు, చొక్కా వేసుకుని ఆఫీసుకెడు తుంటే సుబ్రమణ్యానికి ఒళ్ళంతా వెచ్చ వెచ్చగా, హాయి హాయిగా, గొప్ప థ్రిల్లుగా అనిపించింది.

రామసూర్యంగారు మొక్కల్లో తల మునకలుగావున్నా సరే "హల్లో సార్" అని పలకరించేడు.

అతడి చొరవకి, ఉత్సాహానికి చిరాకు పడి-

"హల్లోలు సరేగానీ...దీపం ఆర్పేవా" అనడిగారు ఆత్రంగా.

"ఆర్పేసనండి"

"ఫాన్?"

"అదీ ఆర్పేనండి"

"కిటికీలు మూసేవా?"

"మూసేనండి"

"బాత్‌రూంలో ఏవన్నా వొదిలేవా?"

"అబ్బే... లేదండి"

"గదికి తాళం వేసావా"

"వేసానండి"

"అయితే ఇహ నడు"

"అలాగేనండి" అని సుబ్రమణ్యం వీధిలోకెళ్ళాడు.

రామసూర్యంగారు 'హమ్మయ్య! పిల్లడు బంగారంగానూ' అని పన్లోకి దిగేరు.

కాని గదికి తాళం బిగిస్తూ పక్కనే గోడఅంచున వుంచిన ఆఫీసు సర్క్యు లేటింగ్ లైబ్రరీ తాలూకు పేక్లిని మర్చి పోయాడని ఆయనా గమనించేరుకాదు.

ఇల్లు సద్దుమణిగాక రమణి మొక్క లకు నీళ్ళు పెట్టి, గదిముందు పూడ్చి ముగ్గేసి వెళ్ళిపోబోతుండగా గోడ అంచున పత్రిక గాలికి రెపరెపలాడుతూ కన్పిం చింది.

ఆమెకి పుస్తకాలు, పత్రికలు చదివే అలవాటులేదు. అయినా కాలక్షేపంగా వుంటుందని తీసుకెళ్ళింది.

భోజనాలన్నీ అయ్యాక తీరుబడిగా ఎంబ్రాయిడరీ మొకలు పెట్టబోతూ బొమ్మలు చూద్దామని పత్రిక తెరిచింది.

దాన్లోంచి జారిపడింది ఇన్‌లాండ్ కవరు. కిందపడ్డ కవర్ని చేతిలోకి తీసుకు చూసింది.

'శేషగిరిరావుగారు, బజారువీధి, సత్యన్నారాయణపురం - విజయవాడ'. అని రాసుంది అడ్రస్సు.

కవర్ని అతికించటం మర్చిపోయినట్లు వున్నాడు.

ఉత్తరాన్ని తిరిగిపుస్తకంలో వుంచబో తుండగా ఆలోచనొచ్చింది.

పరాయివాళ్ళ ఉత్తరాలు చదవటం పద్ధతికాదని ఆమెకి తెల్సును. కానీ సుబ్రమణ్యాన్ని పరాయివాడుగా అనుకో వటం ఎంచేతనో ఆమెకి నచ్చిందికాదు.

అందువల్ల అటూ ఇటూ చూసి వుత్తరాన్ని విప్పింది.

"బామ్మా!" అనే సంబోధనతో మొదలైంది ఉత్తరం.

పైన అడ్రస్సు శేషగిరి అని రాసుంది, లోన 'బామ్మా' అంటూ బిగినైంది. అంటే బామ్మగారి పేరు శేషగిరా!ఏమో... అయ్యుండొచ్చు. మగపేర్లు పెట్టుకునే నారీమణులున్నారేమో తనకేం తెల్సు?

చదవటం ప్రారంభించింది.

"మొన్న నీవు రాసిన వుత్తరం అంది పట్టేవుంది. నాన్నకి ఆయన స్నేహితుడి అడ్రసు రాయమని రాసాను. అందిందా? నువు రాసినవన్నీ తుచ. తప్పకుండా పాటిస్తున్నాను. గుమ్మడికాయని గడప లోపలికిగూడా రానీటంలేదు. రాత్రిళ్లు పాలు తాగటంలేదు. ఇక్కడ దొరికి చావవు. అయినా ఇక్కడ పాలు తాగేవాళ్ళని

పిచ్చివెధవని చూసినట్లు చూస్తారు.

అన్నట్లు...

నేవుంటున్న ఇంటాయనకి ఒక కూతురుంది. చాలా బావుంటుందే. మంచి పనిమంతురాలు. బుద్ధిమంతురాలు. నువ్వయితే 'నా బంగారు తల్లే'న్చెప్పి బుగ్గలు నిమిరేదానివి. మొన్నొక రోజున గదికి తాళం పెట్టటం మర్చిపోయి ఆఫీసుకెళ్ళిపోయానే. ఆ పిల్లగదంతా సర్ది, వూడ్చి భద్రంగా తాళంవేసింది. రోజూ నా గదిముందు నీళ్ళుచల్లి ముగ్గులు పెడుతోంది. సోపు పట్టించి బట్టలు మర్చిపోతే వుతికి, ఆరేసి ఇస్త్రీగూడా చేసిచ్చింది. నువ్వొకసారొస్తే చూద్దూగానీ-వస్తావా? వస్తానంటే నాన్నకి నిన్ను పంపమని గుస్తపెట్టుకుని రాస్తా. ఏ సంగతీరాయి.

బామ్మా... ఈ విషయాలన్నీ అమ్మకిగాని, ఆవిడ మొగుడికిగాని చెప్పకు. పరమ రహస్యం.

వుంటాను ... సుబ్బులు"

రమణికి ఆ వుత్తరం చదివాక మొహం సిగ్గుతో ఎర్రబడింది. కింది పెదిమని మునిపంటితో నొక్కిపట్టింది. మనసు పరవశంగావుంది. వాళ్ళంతా విచ్చుకుంటున్నట్లుగా హాయిగావుంది.

ఆ ఉత్తరాన్ని తిరిగి పుస్తకంలో వుంచుతుండగా చిన్న అనుమానమొచ్చింది. ఈ మతిమరుపు మహారాజు రాసిన ఉత్తరాన్ని పోస్టుడబ్బాలో పడేస్తాడా? వేస్తే ఎన్నేళ్ళకని, ఎన్ని యుగాలకని... చెప్పటం కష్టం.

తన కర్తవ్యమేమిటో అర్థమైంది.

చివుక్కున లేచి పుస్తకాన్ని, వుత్తరాన్ని తీసుకుని, చెప్పులు తొడుక్కుని బయటికొచ్చివీధిలోకెళ్ళబోతూ, వీక్లీని వుదయం ఎక్కడైతే చూసిందో అక్కడే వుంచేసి వుత్తరాన్ని మాత్రం పుచ్చుకుని, వీధి చివర్న కన్పిస్తున్న ఎర్ర డబ్బా దగ్గరకెళ్ళి ఆ వుత్తరాన్ని నాలికతో తడి చేసి అంటించి, డబ్బాలో పడేసింది.

ఇంటికొచ్చి యథావిధిన ఎంబ్రాయిడరీ పని మొదలుపెట్టింది.



## 3

పతంజలిగారిది ఇల్లుకాదు.

పెద్ద భవంతి. ఆ రెండంతస్తుల భవనాన్ని ఎన్ని ఎకరాల స్థలంలో నిర్మించారో చెప్పటం కష్టం.

భవనం చుట్టూ ఎత్తైన ప్రహరీ. ముందర కావలసినంత ఖాళీ స్థలం. ప్రహరీగేటునుంచి భవనం వరకుసిమెంటు రోడ్డు, ఇరువైపులా అందంగా కత్తిరించబడ్డ క్రోటను మొక్కలు, పోకచెట్లు, అందమైన రంగుల్లో హుందాగా నిలబడ్డ భవనం. ఇవన్నీ రోడ్డుపైన నిలబడి చూసినా కనిపిస్తాయి.

ఆ భవనం డాబుని, దర్పాని చూసి అది ఏ సినిమావారిదో, మాజీ మంత్రిదో అనుకునే అవకాశం వుంది. కాని పతంజలి గారికి ఆ రెండు రంగాలతోను సంబంధం లేదు.

ఈ ఇంటితోపాటుగా కాస్తోకూస్తో పొలం కూడా వుంది. బ్యాంకులో ఫిక్సెడ్ డిపాజిట్లున్నాయి.

ఇవన్నీ ఆయన స్వార్జితంకావు.

దత్తత చేసుకున్న తండ్రి చలవ. అంచేత పతంజలిగారికి పన్చేయాల్సిన అవసరం లేదు. ఉన్నవాటిని కాపాడుకునే శ్రద్ధ, కాపాడుకోవాలన్న ఇంగితం వున్నాయ్. డబ్బు డబ్బుని పెంచుతుందన్న విషయం ఆయన కొద్దికాలంలోనే గ్రహించారు. బాగానే వుందనుకున్నారు.

మనిషి సుఖంగా బతకటానికి కావలసిన ఏర్పాట్లన్నీ చేసుకున్నారు.

లంకంత కొంప, లక్ష్మీదేవిలాంటి భార్య, చిచ్చిండ్రీ కూతురు, తరచు చిక్కుల్లో పడేకొడుకు...ప్లస్ ఒక కారు.

పతంజలిగారికి కొన్నికొన్ని స్థూలమైన అభిప్రాయాలున్నాయ్. దేవుడు మనిషికి ప్రేమతో కొన్ని కొన్నింటిని ప్రసాదిస్తాడు. వాటిని మనిషి జాగ్రత్తగా కాపాడుకోవాలి.

వాటిల్లో ఆస్తి, ఆరోగ్యాలు ముఖ్యం.

ఆస్థిని కాపాడుకోవాలంటే తెలివి తేటలు కావాలి.

ఆరోగ్యాన్ని కాపాడుకోవాలంటే మంచి అలవాట్లు, శ్రద్ధ కావాలి.

పతంజలిగారికి అరవైఏళ్లు నిండబో తున్నాయ్.

కాని చూట్టానికి పోతపోసిన కంచు విగ్రహంలాగావుంటారు. ఆరడుగులపైగా ఎత్తు, దానికి తగ్గ లావు, తెల్లటి కచ్చీ జుట్టు, వుక్కుకడ్డీలాంటి చేతులు, వెడల్పయిన మొహం. ఆయన్ని చూసి వయసు అడిగి తెల్సుకుని ఆరోగ్య రక్షకి అగ్రతాంబూలం ఇచ్చేయ్యాల్సిందే.

చిన్నతనంనుంచి కూడా ఆయనకి ఆరోగ్యంపట్ల శ్రద్ధ జాస్తి. వ్యాయామం, దండీలు, బస్కీలు, పరిగెత్తడాలు మొదలైన ప్రక్రియలన్నీ పిన్న వయసులోనే ప్రారంభమైనాయ్. అవన్నీ సరదాగా మొదలై అలవాట్లుగా మారినాయ్.

దత్తతెళ్ళి ఆస్తి కలిసి రావటంతో బతకటానికి శ్రమ తప్పటంచేత తన దృష్టిని పూర్తిగా ఆరోగ్య పరిరక్షణపై కేంద్రీకరించారు.

ప్రతిరోజూ వుదయాన్నే రెండు మూడు బజార్లు పరిగెత్తటం, ఇంటికొచ్చి బస్కీలు తీసి, ఆసనాలెయ్యటం, సాయంకాలాలు వాకింగు చెయ్యటం-ఆయన దిన చర్యల్లో అతి ముఖ్యమైన ఘట్టాలు.

చిన్నతనంనుంచి తల్లిదండ్రులు పిల్లలికి మంచి అలవాట్లు నేర్పి, వ్యాయామం చేయిస్తే ప్రతివాడూ వంద సంవత్సరాలు బతుకుతాడని కాగితం రాసిస్తానంటారు ఆయన.

ఆరోగ్యం నిర్లక్ష్యం చేసి, దుర్వ్యసనాలు చేసుకుని, అయ్యో ఆయు ప్రమాణం పడిపోయిందని గోలపెట్టే వాళ్ళని కాల్చిపారేస్తానని కూడాఅంటారు. ఆయన దగ్గర తుపాకీ వుంది. దానికి లైసెన్సు కూడా వుంది. అయినా దాన్నింతవరకూ వాడలేదు.

ఆయన పిల్లల్ని అలాగే పెంచారు. భార్యచేత కూడా ఆసనాలు వేయించే వారు. పెళ్ళయినకొత్తల్లో ఆవిడ భయంతో చెప్పినట్లు చేసేది. ఆ తర్వాత మొరాయించటం మొదలెట్టింది. నీ ఖర్మని వదిలేసారు.

కొన్నాళ్లుగా ఆయన్లో ఆలోచన్లు ప్రారంభమైనాయి-

ఈ ఆరోగ్యసూత్రాలు తనకి, తన వాళ్ళకే పరిమితంకాకుండా బయట ప్రజలకూ్కడా ఎందుకు చెప్పకూడదు అని.

ఆలోచనవచ్చిందే తడవుగా ఆచరణలో పెట్టేరు. ప్రతి ఆదివారం క్లాసులు ఏర్పాటుచేసేరు. ఆసనాలు వెయ్యటం

ఎలా, వ్యాయామం, రన్నింగ్, వాకింగ్‌ల వల్ల కలిగే లాభాలేవిటి- సోదాహరణంగా వివరిస్తారు.

దగ్గరుండి ఆసనాలు వేయించి, బస్కీలు తీయిస్తారు. అలాగని ఎవరి దగ్గరనుంచి ఏమీ ఆశించరు. పైగా తనే వచ్చినవాళ్ళందరికీ బాదంపప్పులు, పాలు సప్లయిచేస్తారు.

మొదట్లో జనం ఆయన మాటని నమ్మేరుగాదు. కాని ఇప్పుడిప్పుడు ప్రతి ఆదివారంనాడు పదిమందిదాకా వస్తున్నారు. అంతా పెద్దపెద్ద ఆఫీసర్లు. ఆ వచ్చేవాళ్ళకి సదుపాయంగా ఒక చిన్న రేకుల షెడ్డుకూడా నిర్మించారు.

సుబ్రమణ్యం ఆయనని కలవాలని వెళ్ళింది ఆదివారంనాడు.

అతడెళ్ళేసరికి పతంజలిగారు పరవళ్లు తొక్కుతున్నారు.

తెల్లటి మట్టలాగూ తొడిగేరు-స్పోర్ట్సు బనీను, కాళ్ళకి కాన్వాసుబూట్లు కూడా తొడిగేరు.

నిలబడే పరిగెత్తుతున్నట్లు కదం తొక్కుతున్నారు.

తండ్రి రాసిన వుత్తరాన్నిబట్టి పతంజలిగారు గ్లాస్కోపంచె, సిల్కులాల్చీ, పైన పొన్నూరు ఖద్దరుకండువా, చేతిలో ఇంగ్లీషు పేపరుతో కనిపిస్తారని వూహలోనే బొమ్మని గీసుకు మరీ వచ్చాడు సుబ్రమణ్యం.

అంచేత ఇలా వాకిట్లో నిక్కరు తొడుక్కుని ఎగిరెగిరిపడుతున్న ఈ పెద్దమనిషి పతంజలిగారు కాదని,బహుశా పిల్లనిచ్చిన మావగారై వుండొచ్చని అనుకుంటూ ధైర్యంగా గేటుతెరచి చకచకా నడిచివచ్చి ఆయన దగ్గరగా నిల్చున్నాడు.



ఆయన సుబ్రమణ్యాన్ని చూసేరు కాని కార్యక్రమం ఆపేరుకాదు. అలాగని వూరుకుండిపోలేదు.'ఎవరు కావాలి' అనడిగారు.

"పతంజలిగారున్నారాండి?"

"ఆ...వున్నాడు. ఏం?"

"అహ...మా నాన్నగారు..." అని సుబ్రమణ్యం ఏదో చెప్పబోయాడు.

"ఏవిటి...పతంజలి మీ నాన్నగారా?" అనడిగారు కదం తొక్కుతూనే.

"కాదండి...మా నాన్నగారు వుత్తరం రాసేరండి"

"ఎవరికి?"

"నాకేనండి"

"మీ నాన్న నీకుత్తరంరాస్తే, పతంజలితో ఏంపని ... చదివి వినిపించాలా?"

ఆయనోక్షణం భూమ్మీద నిలకడగా వుంటే, విషయం విశదంగా చెబుదామంటే ఆయన ఆగేటట్టుగా లేకపోవటంచేత గట్టిగా చెప్పేడు.

"మా నాన్నగారు వుత్తరం రాసి పతంజలిగారిని కలవమన్నారండి...అందుకని వచ్చాను" అని.

"అలాచెప్పు ... ఇంతకి మీ నాన్న పేరు?"

"శేషగిరి"

ఆ పేరువిన్నాక ఆయన కదం తొక్కటం టక్కున ఆపేరు. ఆశ్చర్యంగా అతడివైపు చూస్తూ ''హార్నీ, నువ్వు శేషు కొడుకువా...చెప్పావుకాదేం? నీ పేరేమిటి, ఏంచేస్తుంటావ్" అంటూ ప్రశ్నలవర్షం కురిపించేరు.

సుబ్రమణ్యం అన్నిటికీ ఓపిగ్గా సమాధానాలిచ్చి, "కాస్త పతంజలిగారిని పిలుస్తారా" అనడిగాడు అమాయకంగా.

పతంజలిగారు పగలబడి పెద్దగా



నవ్వేడు.

"నేనేనోయ్ పతంజలిని" అంటూ దగ్గరకొచ్చి సుబ్రమణ్యం భుజంచుట్టూతా ఆప్యాయంగా చెయ్యివేసేరు.

బలమైన ఆయన చేతులకింద అతగాడి శరీరం కందిపోతోంది.

"నీ వయస్సెంతోయ్" అనడిగారు అతడి వొంటిని పరీక్షగా చూస్తూ.

"పాతికండి"

"అలాగా.... హైటెంత?"

"ఏమో...ఎప్పుడూ లెక్కగట్టలేదండి! కాని ఫైవ్ సెవనుంటానండి"

"పోనీ బరువు తూచుకున్నావా?"

"మొన్న రైల్వేస్టేషన్లో చూసుకున్నానండి...అరవైఅయిదు కిలోలు"

పతంజలిగారు అతడి భుజం పైనుంచి చెయ్యితీసేసివచ్చికాస్త దూరంగా ఎదురుగా నిల్చున్నారు. ఆకాశంవంక చూస్తూ లెక్కలు కడుతున్నారు. సన్నగా తనలో తాను గొణుక్కుంటున్నారు.

సుబ్రమణ్యానికి ముంచుకొస్తున్న ముప్పు అర్థమైందికాదు. వింతగా ఆయన వంక చూస్తున్నాడు. తన ఎత్తు, బరువుల వెనక అంతటి గణితశాస్త్రం వుందందే నమ్మకం కుదరటం లేదు.

కాస్సేపటికి–

"నాలుగు తొమ్మదులెంతోయ్?" అనడిగారు.

"ముప్పై ఆరండి"

"ముప్పై ఆరా...కరక్టేకదూ. అయితే తప్పదోయ్"

"ఏమిటండి?" అమాయకంగా అన్నాడు.

"అదే... నువ్వారోజూ వ్యాయామం చేసి ఆసనాలెయ్యాలి. సర్వాంగాసనంవేసి, బస్కీలు తీసి, రెండు మైళ్ళు పరిగెత్తాలి తప్పదు"

"దేనికండి?"

"దీనికేవిటోయ్! నీ వయస్సుకి ఎలా వుండాలి పోటుగా తలాగా వుండాలి. కాని నువ్వలా లేకపోగా అండర్‌వెయిట్లో వున్నావ్. అందులో పెళ్ళి కావలసిన వాడివి. అంచేత ఇవ్వాళ దివ్యమైన రోజు. నాష్టాటవిని మొదలెట్టు!" అన్నారు.

సుబ్రమణ్యానికిగుండె లోపల ఎక్కడో ఏదో ధాంమ్మని పేలినట్లనిపించింది. ఆయన వాలకం, మాటలు, చూపులు చూస్తుంటే మనస్సేవిటో కీడునే శంకిస్తోంది.

చుట్టం చూపుగా వచ్చినావిణ్ని చూలాల్ని చేసి పంపినట్లు ఈయన బలవంతాన బట్టలూడదీసి బస్కీలు తీయించేలా వున్నాడనిపించి భయపడ్డాడు.

"కానీ ఒంట్లో బాగా లేదండి" అన్నాడు తప్పించుకుని బయటపడే మార్గానికై అన్వేషిస్తూ.

"చూసేవా... ఇప్పణ్నించే నువ్వు ఆరోగ్యం గురించి శ్రద్ధ తీసుకోకపోతే రేపు పెళ్ళయాక పేచీ పెడుతుంది... తర్వాత నీ ఇష్టం" అని ఏమంటావన్నట్లు చూస్తున్నారు.

సుబ్రమణ్యం అదృష్టం మహా దొడ్డది. సరిగ్గా అదే సమయానికి పక్క వ్యాయామశాల షెడ్డులోంచి ఎవరో ఆయన్ని పిల్చారుగనుక బతికి బయటపడ్డాడు.

పతంజలిగారు షెడ్డు వైపుగా వెళ్ళబోతూ "రావోయ్, నా స్టూడెంట్సుని చూద్దూగాని" అని మళ్ళీ భుజంచుట్టూ చెయ్యివేసి నడిపించి తీసుకెళ్ళారు.

తోవలో అడిగారు- "నేనూ, మీ నాన్న ఆరోజుల్లోనే వుదయం వీధుల వెంట పరిగెత్తేవాళ్ళం. అవునూ...వాడింకా రన్నింగ్ చేస్తున్నాడా?" అని.

"లేదండి. కాని తారీఖుకి జీతం రాకపోతే మాత్రం రోడ్లవెంట రన్నింగ్ చేస్తారండి"

పతంజలిగారు అతడి సెన్సాఫ్ హ్యూమర్‌కి పడిపడి నవ్వేరు.

"మీ కుర్రకారుకంతా నవ్వులాటగానే వుంటుందోయ్! డెబ్బై ఏళ్ళొస్తున్నా నేనిలా రాయిలా వున్నానంటే దానికి కారణం వ్యాయామం....తెలుసా?"

"అవునండి. నాకు తెలీకపోవటమేమిటి?"

షెడ్డుని సమీపించారు.

పతంజలిగారు భుజంపైన చెయ్యిని కిందికి జార్చి, సుబ్రమణ్యం చేతిని పట్టి లోపలకి తీసుకెళ్ళారు.

"వీళ్ళేనోయ్ నా స్టూడెంట్సు.వీళ్ళంతా పెద్దపెద్ద ఆఫీసర్లు. వేలమీద జీతాలు. ప్రతి ఆదివారం వచ్చి నా కళ్ళముందు ప్రాక్టీసు చేస్తారు. మిగిలిన రోజుల్లో ఇళ్ళవద్దనే సాధన చేస్తారు"

సుబ్రమణ్యం కళ్ళింతింత చేసుకుని ఆశ్చర్యంగా కన్పిస్తున్న దృశ్యాలని చూస్తున్నాడు.

ఆ గదిలో అరడజను మంది అనేక వయస్సులవాళ్ళు, అనేకానేక భంగిమల్లో సాధన చేస్తున్నారు. కొంతమంది నేల మీద పొర్లుతున్నారు. ఇంకొంతమంది గాల్లో తేలుతున్నారు. మిగిలినవాళ్ళు అటూ ఇటూ కాకుండా ఎగిరెగిరి పడుతున్నారు.

సుబ్రమణ్యం చూస్తూనే వున్నాడు. పతంజలిగారు తన విద్యార్థుల గొప్ప తనాన్ని చెబుతూనే వున్నారు.

"అటు చూడు! తలక్రిందపెట్టి కాళ్ళు పైకి లేపినాయన ఛీఫింజనీరు చిరంజీవి రావుగారు. ఆర్నెల్లుగా ప్రాక్టీసు చేస్తున్నారు. విద్యనంతా అవుపోసన పట్టేరు. ఆఫీసులో గూడా వీలు చిక్కినప్పుడల్లా తలుపులేసుకుని ప్రాక్టీసు చేస్తారట."

సుబ్రమణ్యం తలవొంచి ఆయనవంక చూసేడు.

చిరంజీవిరావుగారు తలకిందులుగానే చిన్నగా నవ్వేరు.

కురుక్షేత్రంలో అర్జునుడికి కౌరవ సైన్యంలోని వృద్ధుల్ని పరిచయం చేస్తున్న కృష్ణునిలా చెప్పుకుపోతున్నారు పతంజలిగారు.

"ఇటు చూడు... రెండు కాళ్ళు భుజాన పెట్టుక్కూర్చున్నాడే, ఆయనో ప్రసిద్ధ రచయిత.ఏ పత్రిక తీసినా కన్పిస్తాడు. ఏ కొత్త మ్యాగజైను పెట్టాలన్నా ముందు పేర్ని తల్చుకుని ఆపైనే విఘ్నేశ్వర పూజ చేస్తారు. వందలు వందలు నవలలు రాసేడు.కాని పాపం ఏంలాభం? ఆరోగ్యం పాడు చేసుకున్నాడు. నెల రోజులుగా వస్తున్నాడు కాలు దింపితే కథ చెబుతాడు. కాని నేపర్మిషనివ్వను"

ఆ నవలా రచయిత దీనంగా చూస్తున్నాడు. శిక్షననుభవిస్తున్న దోషిలా వున్నాడు.

పతంజలిగారు ఇంకోసైపుకి చూపిస్తూ–

"ఇదిగో...ఈ శవాసనంవేసి బిగదీసుకున్న పెద్దమనిషి ఎవరోకాదు. మనూరి మాజీ ఎమ్మెల్యేగారు. పార్టీలు మార్చటం, పార్టీలని చీల్చటం, వెన్నుపోట్లు పొడవటంలాంటి ప్రక్రియలతో ప్రజాసేవ చేసుకుని హైరానాపడి అలసిపోయారు. మొన్న ఎలక్షన్స్‌లో డిపాజిట్టుగూడా పోయింది. దాంతో ఆరోగ్యం పాడైంది మొన్న వచ్చి ఆరోగ్యం కాపాడి రక్షించమని కాళ్ల పట్టుకున్నారు. త్వరలో సొంత పార్టీని కొడుకులు, కోడళ్లు, మనవలు, మిగతా బంధుజనంతో పెట్టాలనుకుంటున్నట్టు చెప్పేడు. సర్లెమ్మని దేశమాత మొహంచూసి ఒప్పుకుని పాఠం మొదలెట్టాను"

సుబ్రమణ్యానికి త్వరగా బయట పడటం మంచిదేమోనన్న ఆలోచన మొదలయింది. అక్కణ్నించి కదిలి గుమ్మంవేపుగా దారితీసాడు.

పతంజలిగారు వెనకేవచ్చి గుమ్మం పక్కనున్న వ్యక్తిదగ్గర ఒకక్షణం ఆగేరు.

ఆ వ్యక్తి ఎర్రగా వున్నాడు. జుట్టు చిరుసుగా,వొత్తుగావుండి పిచ్చికలల్లుకున్న పట్టమైన గూడులా వుంది. మెళ్లో జిగినీ గొలుసు మెరుస్తోంది. నిక్కరు, బనీను వేసుకున్నాడు. చూపుల్లో ఎదుటివారిని ఆకట్టుకునే శక్తి వుంది. అతడు గుమ్మం పక్కనే అదేపనిగా గుంజీలుతీస్తున్నాడు. చెమటలు వొళ్ళంతా దిగ్గారుతున్నాయి.

"ఎన్నయినాయ్ ఇప్పటికి?" అని అడిగారు ఆ వ్యక్తిని.

"నూటయాభైరెండు" అన్నాడతను ఆపకుండానే.

"గుడ్...ఇంకో యాభయితీసి,కాసేపు గోడకుర్చీ వెయ్యి" అని బయటికొచ్చారు పతంజలిగారు.

అక్కడ నిల్చున్న సుబ్రమణ్యాన్ని ఇంటివేపుగా తీసుకెడుతూ, "అతగాడి పేరు బోసుబాబు. ఏదో వ్యాపారం అని చెప్పాడు. చాలా పొరవ, తెలివిగల కుర్రాడు. తనంతట తానేవచ్చి ప్రాక్టీసు

చేసుకుంటానన్నాడు. మంచి కుర్రాడు... వృద్ధిలోకొస్తాడు"

ఇంటిని సమీపిస్తుండగా, "చూసేవా! పెద్ద పెద్దవాళ్ళందరికీ నేనంటే చచ్చేటంత గురి. అంచేత నా మాటవిని నువ్వూ బాగుపడు" అన్నారు.

సుబ్రమణ్యానికి గొంతులో తడారి పోయింది.

"అలాగేనండి. కాని...కాని ఇప్పుడు కాదు"

"సరే...నీ ఇష్టం" అన్నారాయన ముక్తసరిగా ఇంటి మెట్లెక్కుతూ.

ఇద్దరూ లోనికెళ్ళారు,

ముందర పెద్ద గ్రిల్లువసారా. వరసగా కేన్‌కుర్చీలు, వాటిల్లో మెత్తటి ఫోందిళ్ళు. హాలుకానుకున్న గదికి పెద్దకర్టెన్ వేలాడుతోంది.

పతంజలిగారు ఒకకుర్చీలోకూర్చుంటూ- "పూర్ణా...పూర్ణా" అంటూ పిల్చేరు.

సుబ్రమణ్యం ఎందుకయినా మంచిదని గుమ్మం పక్కగావున్న కుర్చీలో ఆయనకి దూరంగా కూర్చున్నాడు.

కొద్దిక్షణాలకి వయస్సు మళ్ళుతున్న ఒకావిడ కర్టెన్ తొలగించుకుని వచ్చి నిలబడింది. వస్తూనే - "పూర్తయినట్లేనా ఇవ్వాల్టికి-ఆ గంతులెయ్యటం" అనబోయి సుబ్రమణ్యాన్ని చూసి ఆగింది.

ఆవిడ ఎర్రగా, లావుగా వుంది. మొహం గుండ్రంగా, పెద్దగా వుంది. జుట్టు నలుపు తెలుపుగా వుంది.

ఆవిడ ధోరణినిబట్టి భర్తగారి ఫిజికల్ ఫిలాసఫీ అంటే గిట్టని మనిషిలా అన్పిస్తోంది. తనని ఆసనాలెయ్యమని, బస్కీలు తియ్యమని భర్త వేధించకుండా దేందుకు ఆ కరుకుతనం కవచంలా ఏర్పాటు చేసుకునుంటుందని అన్పించింది సుబ్రమణ్యానికి. ఆ విధంగాకాక ఆవిడ కనుక మెత్త మెత్తగా వుండివుంటే పతంజలిగారు పేట్రేగి ఆవిడచేత వంట గదిలోను,నీళ్ళతొట్లోను,చివరికి పడగ్గదిలో కూడా ఆసనాలేయించి ఎలా అవస్థ పెట్టి వుండేవారో వూహించుకుని భయపడ్డాడు సుబ్రమణ్యం.

"పూర్ణా! ఇతనెవరో తెల్సునా?" అని అడిగారు పతంజలిగారు భార్యని.

"ఎవరూ! ఇంకో శిష్యుడా?కుర్రాళ్ళని చంపకండి పాపం" జాలికన్నా కోపం కనబరుస్తూ అంది.

"నా ఫ్రెండ్ శేషలేదూ ... వాడి కొడుకు.పేరు సుబ్రమణ్యం. ఈ వూళ్ళోనే వుద్యోగం. మొన్న అక్కడికి వెళ్ళినపుడు శేషుకనిపిస్తే నీకొడుకుని పంపరా అన్నా. ఇదిగో రానేవచ్చాడు"

ఆవిడ సుబ్రమణ్యంవంక చూసింది కాని, మొహంలో ఎటువంటి మార్పులేదు, నిర్లిప్తంగా వుంది.

"స్నానం చేస్తారా...నీళ్ళు సిద్దంగా వున్నాయ్" అంది భర్తతో.

ఆవిడ ప్రశ్నకి బదులివ్వకుండానే, "నా భార్య-పేరు అన్నపూర్ణ. కాస్త విసుగు, కోపం జాస్తి" అంటూనే మళ్ళీ భార్యతో, "అవునూ...అమ్మాయేది?" అన్నారు.

"లోపలుంది" అనేసి ఆవిడ లోనికెళ్ళి పోయింది.

"అమ్మాయిని ఇలా పంపించు" అన్నారు వెళ్ళిపోతున్న భార్యనుద్దేశించి.

"నాకిద్దరు పిల్లలోయ్! ఒక ఆడ, ఒక మగ. పిల్లాడిపేరు అశోక్. వాడికి చదువుమీద శ్రద్ధలేదు, ఆరోగ్యంమీద అంతకన్నాలేదు. ఎప్పుడూ తిరుగుతూ వుంటాడు. ఎక్కడికి పోతాడో, ఏమేం చేస్తాడో నాకేం తెలీదు. పట్టించుకోవటం

కూడా మానేశాను. ఇహ పిల్లపేరు శ్రీలేఖ"

ఆయన చెబుతూండగానే ఆమె కర్టెన్ తప్పించుకునొచ్చి అక్కడ నిలబడింది.

ఆమె ఎత్తుగా, లావుగా తండ్రిపోలిక నుంది. జుట్టుని పైకిలేపి రిబ్బనుతో కట్టటంచేత పొడుగాటి మెడ అందంగా కనిపిస్తోంది. ఆమె జీన్సు పాంటు, షర్టు వేసుకుంది. వయసు పొంగులు చొక్కా లోపల్నించి స్పష్టంగా కనిపిస్తున్నాయ్. పాంటు తొడలకి పట్టినట్లుగా వుండటం చేత వాటి ప్రమాణాన్ని చెపుతోంది.

ఆమె ఒంటికాలిపై నిల్చుని రెండో కాలుతో నేలపై చిన్నగా తాళం వేస్తూ - "యస్ డాడీ-పిల్చార్ట" అంది.

ఆయన సుబ్రమణ్యంకి పరిచయం చేస్తూ-

"ఈమేనోయ్ నాకూతురు. ఫైనలియర్ చదువుతోంది" అన్నాడు.

సుబ్రమణ్యం ఆమెవంక చూసేడు. ఆమె నడుంపైన చేతులుంచుకునిచూస్తూ-

"డాడీ!ఇంతకీ ఎవరితను?" అంది.

"నా ఫ్రెండు శేషగిరి కొడుకు. పేరు సుబ్రమణ్యం. ఈ వూళ్ళోనే వుద్యోగం" అన్నారు.

"వెంకట సుబ్రమణ్యమా?" అంది వెటకారంగా.

"లేదండి! ఒట్టి సుబ్రమణ్యమే" అన్నాడు సుబ్రమణ్యం సిగ్గుపడుతూ.

"ఓహో...అంటే వీళ్ళింటిపేరు ఒట్టి వాళ్ళన్నమాట డాడీ" అంది చేతులు గాల్లో ఒట్టిదేనన్నట్లు తిప్పుతూ.

"చూసేవుగా. వెరీ షార్పు. ఈ పిల్లంటే నాకు చాలా ఇష్టం. దానిమీద గొప్ప నమ్మకం. ఎప్పటికైనా నాకు పేరు తెస్తే ఈ పిల్లే తేవాల్సిందే" అన్నారు శేషగిరిగారు.

శ్రీలేఖ అలాగే నిల్చుని పరీక్షగా చూస్తోంది అతడివైపు.

అంతలో షెడ్డులోంచి ఎవరో పతంజలిగారిని పిల్చారు. ఆయన లేచి వెళ్ళబోతూ, "ఇప్పుడేవస్తా లేఖా డియర్! ఇతగాడికి మన ఇల్లంతా చూపించి, ఓ గ్లాసుడు పాలు తాగించు" అని బయటికెళ్ళిపోయారు.

శ్రీలేఖ సుబ్రమణ్యంతో "కమాన్ యంగ్‌మాన్" అంది నవ్వుతూ.

సుబ్రమణ్యం లేచి భయంభయంగా ఆమె వెంట లోనికెళ్ళాడు.

లోపల పెద్ద హాలు. మధ్యగా సోఫాలు, టీపాయ్. ఎడంవైపునించి పైకి పోవటానికి మెట్లు, పైన మూడు గదులు. హాలుకానుకుని రెండు గదులు.

"కమాన్..డిసీజ్ అవర్ పాలెస్. నా హాం పైనుంది" అని సుబ్రమణ్యం చెయ్యి పుచ్చుకుని పైకి దారితీసింది.

అతడు చెయ్యి విడిపించుకునే ప్రయత్నం చేసేడు కాని ఫలించలేదు. ఆమె గట్టిగా పట్టుకునుంది.

ఇద్దరూ పైన ఆమె గదిలోకెళ్లారు.

గది విశాలంగావుంది. ఒక పక్కగా డెకోలమ్ మంచం, ఫోం బెడ్డు. ఇంకోవైపు బీరువా, డ్రస్సింగ్ టేబిలు. చదువుకోవటానికి కుర్చీ, బల్ల. ఆ బల్లపైన చిందరవందరగా పుస్తకాలు పడున్నాయ్. మంచంపైన టు ఇన్ వన్, కాసెట్లుకూడా వున్నాయి.

"ఇదే నా గది. హౌడూయూ లైకిట్" అనడిగింది.

"బావుందండి"

"మీకు పాప్ మ్యూజిక్కంటే లైకింగుందా?"

లేదన్నట్లుగా తల అడ్డంగా తిప్పేడు సుబ్రమణ్యం.

"ఓ మైగాడ్! పోనీ ఇంగ్లీషు మూవీలన్నా చూస్తారా?"

"లేదు. తెలుగు సినిమాలు. అవీ అప్పుడప్పుడు".

"మేగాడ్ సేవ్యూ" అంటూ మంచం పైన కూర్చుని కాళ్లు ఆడించటం మొదలు పెట్టింది.

సుబ్రమణ్యానికి ఆమె వాలకం నచ్చిందికాదు. ఆ చనువు, ఆ ధోరణి, ఆ వేషధారణ అసహ్యంగాను, ఇబ్బంది గాను వుంది. అక్కణ్నించి బయట పడటం ఎలాగని ఆలోచిస్తున్నాడు.

అంతలో "చిన్నీ... చిన్నీ" అంటూ అన్నపూర్ణమ్మగారు కూతుర్ని పిలిచింది.

"కమింగ్ మమ్మీ" అంటూనే 'వన్ మినిట్' అని సుబ్రమణ్యానికి చెప్పి శబ్దం చేసుకుంటూ కిందకెళ్లింది.

సుబ్రమణ్యం వూపిరిపీల్చుకున్నాడు. గదంతా తేరపార పరీక్షగా చూసేడు. బల్లపైన పుస్తకాలు ఒకటి రెండు చేతిలోకి తీసుకుని చూసేడు. ఫారిన్ బుక్స్. అర్ధనగ్న దృశ్యాలు, సెక్సుని గురించి చెప్పే రచనలు.

సుబ్రమణ్యం భయంగా ఆ పుస్తకాల నక్కడే వుంచేడు.

తిరిగి కాసేపటికి శ్రీలేఖ పైకొచ్చింది.

"డాడీ ఈ పూటకి భోజనం ఇక్కడే చెయ్యమంటున్నారు" అంది.

"ఎవర్ని?"

"ఇంకెవర్ని...మిమ్మల్నే"

"అంటే...ఇక్కడే ఈ గదిలోనేనా?"

శ్రీలేఖ పెద్దగా చప్పట్లు చరుస్తూ నవ్వింది.

"గుడ్ జోక్. ఇక్కడంటే ఈగదిలో అనికాదు... మా ఇంట్లో అని"

సుబ్రమణ్యం అలా అడిగినందుకు సిగ్గుపడ్డాడు.

భోజనాల సమయంలోకూడా శ్రీలేఖ అతడి పక్కనే చేరింది. అన్నపూర్ణమ్మగారు వడ్డిస్తోంది.

"డాడీ! మీ ఫ్రెండ్ కొడుకు ఇంగ్లీషు పిక్చర్సుచూడడట"

"అవునోయ్. నీ హాబీలేవిటి?" అనడిగారు పతంజలిగారు.

సుబ్రమణ్యానికి ముద్ద గొంతు దిగటం లేదు. త్వరగా పని పూర్తిచేసుకుని బయట పడితే మంచిదనిపిస్తోంది.

"అబ్బే... ఏంలేవండి"

"ఓ రాకీమాన్-హాబీలే లేవట"

"చిన్నీ! నోరు మూసుకు తిను. అందరూనీలాగేవుంటారనుకోకు" కూతుర్ని మందలించింది అన్నపూర్ణమ్మగారు.

"డాడీ! నోరు మూసుకు తినాల్ట. కళ్ళుమూసుకుని చూట్టం, చెవులు మూసుకుని వినటం; కాళ్ళు ముడుచుకుని నడవటం.... మమ్మీ ఎప్పుడూ ఇటువంటి సలహాలే చెబుతుంది. మమ్మీచేత మంచి ఆసనం వేయించకూడదూ"

"ఆదిక్కుమాలిన ఆసనాలేవో తండ్రీకూతుళ్లు వేసుకోండి. నా జోలికి రాకండి. నేనట్టే మంచిదాన్నికాదు" అంది అన్నపూర్ణమ్మగారు.

పతంజలిగారు నవ్వేరు. సుబ్రమణ్యం కూడా నవ్వాడు.

భోజనాలయ్యాక సుబ్రమణ్యంవెడతానని బయల్దేరాడు.

"ప్రతివారం వస్తుండవోయ్. ఇది నీ ఇల్లే అనుకో. అన్నట్లు... నీ అడ్రసిచ్చి వెళ్లు" అని కూతురితో "చిన్నీ!అడ్రస్సు నోట్ చేసుకో"

శ్రీలేఖ కాగితం, పెన్ను అందించింది.

సుబ్రమణ్యం రామసూర్యంగారి ఇంటి అడ్రస్సు రాసిచ్చాడు.

ఆపైన అందరికీ చెప్పి బయటికొచ్చేడు.

వీధిలో కొచ్చాకగాని మనసు తేలిక పడిందికాదు.

ప్రపంచం విచిత్రమైంది అనుకున్నాడు సుబ్రమణ్యం, ఆ సాయంత్రం తన గది గడపమీద కూర్చుని.

గదిలోంచి వెలుగు బయటికొచ్చి రమణి దిద్దిన ముగ్గుపైనపడి అందంగా కన్పిస్తోంది.

సుబ్రమణ్యం ఆ ముగ్గువంకే ఆప్యాయంగా చూస్తూ ఆలోచిస్తున్నాడు.

శ్రీలేఖ, రమణి ఒకే వయస్సు వాళ్లు. ఒకేచోట పుట్టి పెరిగారు.

కాని వాళ్లిద్దరి ప్రవర్తనల్లో ఎంతటి వైరుధ్యం!

ఇంతటి మార్పు ఎలా వస్తుంది? ఆస్థి అంతస్థులవల్లనా? పెంపకం వల్లనా? చుట్టూతావుండే వాతావరణంవల్లనా?

ఉదయం శ్రీలేఖ ప్రవర్తన, ఆ చూపులు, ఆ చేష్టలు సుబ్రమణ్యానికి రుచించలేదు. అటువంటివాళ్ళు తన ఆరోగ్యానికి సరిపడరు అనుకున్నాడు.

కాని రమణి...

మాట్లాడదు. తలెత్తి సూటిగాచూడదు. అసహ్యమైన అలంకారాలతో ఆకర్షించాలని ప్రయత్నం చెయ్యదు.

ఆమె ఎంతందంగావుంటుంది! ఎంత ఆకర్షణీయంగా వుంటుంది! అసలు, ఆలోచన్లు రేపేలావుంటుంది.

సుబ్రమణ్యం చాలాసేపు ఆ ముగ్గు వంకే చూస్తూ కూర్చున్నాడు.

రమణి భుజం నిండుగా కొంగు కప్పుకుని, అక్కడే తనకెదురుగా కూర్చుని ముగ్గుపెడుతున్నట్లు, మధ్య మధ్య తలెత్తి తనవంక చూసి చిలిపిగా, చిన్నగా నవ్వినట్లు వూహించుకుని ఆనందించేడు.

ఆరోజువుదయాన్నే పతంజలిగారింటికి వెళ్ళటంచేత రమణిని ఒక్కసారి కూడా చూడలేదు... అందుకే ఏదో దిగులుగా, గుబులుగా వున్నట్లనిపించింది.

లేచి గదిలోకెళ్ళబోతుండగా రామసూర్యంగారొచ్చారు.

కేవలం తనకోసం, తనతో మాట్లాడేందుకొచ్చారని అర్థమవుతోంది. లుంగీ కట్టిపైన టవలు కప్పేరు. భోజనం పూర్తయినట్లు నోట్లో వక్కపలుకు చప్పరిస్తున్నారు.

"ఉదయంనుంచి కనిపించావుకావేం?" అంటూ సిమెంటు చప్టాపైన చతికిలబడ్డారు.

సుబ్రమణ్యంకూడా కాస్త దూరంగా కూర్చున్నాడు.

"మా పాదరు ఫ్రెండుని కలవాలని వెళ్ళానండి"

కొద్దిక్షణాలయ్యేక రామసూర్యంగారన్నారు-

"నీతో చిన్నపనుండి వచ్చానోయ్"

అని.

సుబ్రమణ్యానికర్థం అయిందికాదు. తనవల్ల అయ్యేపన్లు కూడా వున్నాయని తెలిని స్థితి.

"ఏంపనండి?"

"అహ... ఏంలేదు. మీ ఆఫీసులో చూడామణి అనే కుర్రాడుపన్చేస్తున్నాట్ట. సెక్షన్ వగైరా వివరాలన్నీ ఈ కాగితంలో రాసున్నాయ్. ఆ కుర్రాడెలాంటివాడో, అలవాట్లేమిటో మొదలైన వివరాలన్నీ అతడికి తెలీకుండా వాకబుచేసి చెప్పాలి"

అన్చెప్పి వెంటతెచ్చిన కాగితాన్ని అందించారు.

"దేనికండీ?" కాగితాన్ని అందుకుంటూ అమాయకంగా అడిగాడు.

"మా రమణికి సంబంధాలు చూస్తుంటే ఎవరో ఇతడి పేరు చెప్పి, మీ ఆఫీసులోనే పన్చేస్తాడని చెప్పారు.సరే... నువ్వున్నావు గదాని నీకు చెబుతున్నా"

సుబ్రమణ్యంకి కాస్సేపు వూపిరి అందనట్లనిపించింది.అప్రయత్నంగా తల తిప్పి ముగ్గువైపు చూసేడు.ముగ్గులేకుండా గదిని, ఆమె లేకుండా జీవితాన్ని వూహించుకోవాలంటే భయం అనిపించింది. సరిగ్గా అప్పుడే బామ్మకి తాను రాసిన వుత్తరం పోస్టు చేసానా లేదాన్న అనుమానం మొదలైంది.

అతడేం మాట్లాడకపోయేసరికి రామసూర్యంగారు లేచి నిలబడ్డారు.

"నీ స్నేహితులూ వాళ్ళని అడిగి తెల్సుకో ... నువ్విచ్చే రిపోర్టుని బట్టి నే వ్రాసేదవుతా" అన్చెప్పి ఇంటివైపు దారి తీసేరు.

నిజానికి ఆ చూడామణి అనే కుర్రాడు సుబ్రమణ్యానికి బాగా పరిచయస్తుడే. చాలా బుద్ధిమంతుడు. వేళకి ఆఫీసు కొస్తాడు. పూర్తయ్యేదాకా వుంటాడు. కాఫీ తప్ప ఇంకేం పుచ్చుకోడు. సిగరెట్లు తాగటం, కాకాకిళ్ళీలు నమలటం, గుర్రాల పైని ఆడుకోవటం ఎరగడు.

ఈ విషయాలన్నీ సుబ్రమణ్యానికి తెల్సును.

కాని...ఇలాగని రామసూర్యంగారితో చెపితే, రేపే వెళ్ళి తాంబూలాలు పుచ్చేసుకొస్తారు.

మరయితే ఎలా? ఏవిటి చెయ్యటం?

అంటే రమణిని తను పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాడా?

అనుకునేపక్షంలో ఇలా వచ్చిన సంబంధాలని ఎన్నిటినని, ఎన్నాళ్ళని చెడగొట్టగలడు?చెడగొడుతూ కూర్చుంటే సరిపోతుందా?

కాదు...సరిపోదు. ఇంకేదో చెయ్యాలి అనుకున్నాడు.

ఆ మర్నాడు సుబ్రమణ్యం గదికి తాళం పెట్టి ఆఫీసుకి బయల్దేరబోతుండగా మొక్కల మధ్యనించి లేచి నిలబడి, రామసూర్యంగారు, ''ఏవోయ్...రాత్రి నేనిచ్చిన కాగితం తీసుకున్నావా?'' అని గుర్తుచేసేరు.

సుబ్రమణ్యం నాలిక్కరుచుకుని గది తాళం తీసి, కాగితాన్ని జేబులో వుంచుకుని బయటికొచ్చి తాళం వేస్తుండగా, "కాస్త గుర్తుపెట్టుకుని వాకబు చెయ్యి. ఫర్వాలేదంటే మంచిరోజు చూసి వెళ్ళి మాట్లాడతా''నన్నారు.

ఆయనలా అంటున్నప్పుడే రమణి బక్కెట్టుతో నీళ్లు తెచ్చింది.

సుబ్రమణ్యం కాస్త ధైర్యంగా ఆమె వంక చూశాడు.

ఆమె కూడా చూపుల్ని కలిపింది.

కాని ఆ చూపుల్లో ఉత్సాహం, వుత్తేజం కనిపించలేదు. సుబ్రమణ్యానికి. పైగా చాలాదీనంగా, దైన్యంగా అన్పించినాయ్.

రామసూర్యంగారు తిరిగి పన్లోకి జొరబడ్డారు.

సుబ్రమణ్యం వీధికెక్కాడు.

ఆఫీసుకెడుతున్నప్పుడు, అక్కడ పనిచేస్తున్నప్పుడు తీవ్రంగా ఆలోచిస్తూనే వున్నాడు.

సాయంత్రం రామసూర్యంగారికేమని చెప్పాలి?

చూడామణి సత్పురుషుడు, పూర్ణ చంద్రుడిలాంటివాడని వున్నదివున్నట్లుగా చెప్పటమా? లేక వ్యతిరేకంగా చెప్పి ఆలోచనని, ప్రయత్నాలని ఆపు చేయించాలా?

ఒకవేళ తను అబద్ధమాడితే ఆయన అక్కడితో ఆగుతాడని గారంటీ ఏవిటి? రేపు ఇంకోళ్ళచేత వాకబు చేయిస్తే... నిజం బయటపడితే? తనని నిలదీస్తే?

అంతగా నిజం బయటపడి నిలదీస్తే మతిమరుపుని అడ్డం పెట్టుకోవచ్చు. మర్చిపోయి చింతామణి గురించో, శిఖామణి గురించో వాకబు చేశానని చెప్పొచ్చు.

రైటో... శెభాష్ సుబ్రమణ్యం!

తననుతానే అభినందించుకుని ధైర్యం చెప్పుకున్నాడు.

కాని ఒకటి మాత్రం నిజం...

ఎన్నాళ్లో ఇలా వచ్చిన సంబంధాలు చెడగొట్టలేదు. పైగా అది పద్ధతి కూడా కాదు.

ముందు రమణితో మాట కలపాలి, మనసు తెల్సుకోవాలి.

ఎప్పుడు ...ఎలా... ఎక్కడ?

ఆలోచన్లు పూర్తికాకమునుపే ఆఫీసు టైం పూర్తయింది.

సుబ్రమణ్యం ఇంటిదారి పట్టేడు.

తనకోసం, తను తెచ్చే రిపోర్టుకోసం రామసూర్యంగారు ఆత్రంగా ఎదురు చూస్తుంటాగని తెలుసు.



అంచేత కాస్త నెమ్మదిగా, వీధులవెంట తిరిగి, భోజనంగూడా పూర్తిచేసుకుని గదికి చేరేడు.

తలుపుతీసి బట్టలుమార్చుకుని, బాత్ రూంకెళ్ళొచ్చాడు.

అనుకున్నట్లుగానే కాస్సేపటికి రామ సూర్యంగారు రానేవచ్చారు. ఆయనవెనకే భార్యకూడా వచ్చింది.

"ఏవోయ్... నే చెప్పినపని పూర్తి చేసావా?" అనడిగారు యధాస్థానంలో కూర్చుంటూ. హనుమాయమ్మగారు కాస్త దూరంలో నిల్చుంది.

సుబ్రమణ్యం తలొంచుకున్నాడు.

"ఏవిటి...మర్చిపోయావా?"

"అబ్బే లేదండి. వాకబుచేసాను. కాని ఎలా మొదలెట్టాలాని ఆలోచిస్తున్నా" అన్నాడు.

"ఏవిటీ... అంతగొప్ప చరిత్రా?"

"అవునండి! పిల్లాడు చూట్టానికి మహ బుద్ధిమంతుడిలాగా కన్పిస్తాడుగాని మహ డేంజరు మార్కు పిల్లాడండి"

"అంటే?"

"అదే చెబుతున్నానండి. కుర్రాడు తెల్లగా వుంటాడండి, నవ్వితే ఎర్రబడతాడండి... కాని ఎప్పుడూ నవ్వడండి"

"ఎందువల్ల?"

"ఏం నవ్వుతాడండి! పాపం పుట్టెడు వర్రీసండి"

"వర్రీసా?"

"అవునండి. మరి ఆఫీసంతా అప్పులు గదండి"

"అప్పులా... అదేం ఖర్మ"

"మరి ప్రతిరోజూ చీట్లపేకాడి, తాగి, మరి వుంచుకున్నదానికి కాస్తోకూస్తో ముట్టజెప్పాలి గదండి. జీతం ఏమూలకి చెప్పండి. అంచేత అప్పులు"

"ఏవిటి పేకాడతాడా?"

"గొప్ప ఆటగాడని మంచి పేరుంది లెండి. జోకరు, రంగు లేకపోయినా ఆడేస్తాడు"

"తాగుడుకూడా రోజూనా?"

"అవునండి. కాని రోజూ లెక్క ప్రకారం పుచ్చుకుంటాడండి. నిప్కొట్టి నిమ్మకి నీరెత్తినట్టు కూచోగల్డు. హాఫయితే ఆవులింతలు, ఫుల్లయితే పడక. అంతే గాని ఇంకోళ్ళకి ట్రబులిచ్చేరకం కాదు"

రామసూర్యంగారికిగాని, పక్కనే నిల్చున్న ఆయన భార్యకిగాని అతను తాగుతాడని తప్పించి సుబ్రమణ్యం చెప్పిన టీకాతాత్పర్యాలు అర్థంకాలేదు. అంచేత విసుగ్గా, అసహ్యంగా మొహం పెట్టి-

"ఏవిటో ... నువ్వుచెప్పేది నాకేం బోధపడిందికాదు. చీట్లాట, తాగుడు, అప్పులు- ఇవి చాలక వెధవకి ముండ కూడానా?" అన్నారు రామసూర్యంగారు.

సుబ్రమణ్యం చూడామణిని తల్చుకుని జాలిపడ్డాడు. నిప్పులాంటి కుర్రాడు తన నోట్లోపడి నిప్‌లు, హాఫ్‌లు అయి సర్వభ్రష్టత్వం పట్టిపోయేడు. కాస్త ఒక ముక్క మంచిగూడా చెబితే మంచిదని అనుకుని-

"ఆ విషయం మాత్రం ఇదమిద్ధంగా తేల్చిచెప్పలేనండి. కారణం, మనవద్ద సాక్ష్యాలు, ఋజువులులేవు. తెలీకుండా మాట్లాడటం తప్పు. రోజూ పేకాడి, ఆపైన తాగేసి రిక్షా ఎక్కి, మధ్యలో మల్లెపూలు కొనుక్కుని ఆ పిల్ల ఇంటికెడతాడని మాత్రం తెల్సింది. కాని వాళ్ళిద్దరికున్న సంబంధం ఏవిటో తెలీదు. తెలీనివిషయం గురించి మాట్లాడటం తప్పుకదా?" అన్నాడు.

రామసూర్యంగారు సూర్యుణ్ణి మింగినట్టు కస్సుమన్నారు.

"నా పిండాకూడు! తప్పతాగి దాని కొంపకెళ్ళాడంటే అక్కడే అర్థమవుతోంది. శివపురాణం పారాయణ చెయ్యటానికెడుతున్నాడని అనుకుంటామా?"

హనుమాయమ్మగారందుకుంది-

"మంచి సంబంధమే పట్టుకొచ్చారు. అసలు మీకి అడ్రసిచ్చిన ఆ తలమాసిన వెధవని చెయ్యిపట్టి లాక్కురండి... కడిగి పారేస్తా''

"నువ్వెందుకు ... ఆ బ్రోకరు వెధవ కన్పిస్తే నేనూరుకుంటానా- తలంటనూ వెధవని"

సుబ్రమణ్యానికి కాస్త భయం అనిపించింది. నిజంగా రేపాయన అన్నంత పనీచేస్తే కొంపలంటుకోగలవు. నిజం తెలిస్తే అందరూకల్సి తనకి నలుగు పెట్టిమరీ తలంటెయ్యగల్రు. అంచేత-

"పోన్లెండి... ఎందుకొచ్చిన గొడవ. మనకి నచ్చనపుడు అలాగే వుండిపోతే పోతుంది. గంతకితగ్గ బొంత ఎవరికితగ్గ వాళ్లువాళ్ళు కొస్తారు'' అన్నాడు. ఆమాట హనుమాయమ్మగారికి బాగా నచ్చింది.

"బాగా చెప్పావ్ చిన్నవాడివైనా! పదండి పొద్దుపోయింది'' తొందర చేసింది భర్తని.

రామసూర్యంగారు లేచారు. తెచ్చిన సంబంధం ఇలా జారిపోవటం ఆయనకి నచ్చిందికాదు. మొహం దిగులుగాపెట్టేరు.

హనుమాయమ్మగారు లోనికెళ్ళి పోయింది.

ఆయనకూడా వెళ్ళబోయి, మళ్ళీ వెనక్కొచ్చి-

"ఇంతకీ నువు వాకబుచేసింది చూడా పణి గురించికదూ" అనడిగాడు.

సుబ్రమణ్యం జ్ఞాపకశక్తిపైన ఆయనకంత గౌరవం.

ఆ ప్రశ్నవిని అతడు రెండు క్షణాలు తడబడి-

"అవునండి అతడి గురించే" అన్నాడు నిబ్బరంగా.

"అయితే సరే" అనుకుంటూ వెళ్ళిపోయారాయన.

సుబ్రమణ్యంగూడా తలుపు మూసి పడుకున్నాడు.

ఒక్కపక్క సంతోషం, ఇంకోపక్క దిగులు, భయం.

ఏదో చెయ్యాలి - కాని చెయ్యలేక పోతున్నాడు.

అమూల్యమైన కాలం పరిగెడుతోంది.

ఆలోచిస్తూనే నిద్రలోకి జారిపోయేడు.

ఆ మర్నాడు...

పస్లు పూర్తిచేసుకున్న సుబ్రమణ్యం ఆఫీసుకి వెడదామా వద్దాన్న మీమాంసలో వున్నాడు. ఆ రోజు బస్సులు బంద్- వెడితే ఆటోలో పోవాలి. చివరివారం చిల్లరకూడా వెతుక్కోవలసిన వారం.

రామసూర్యంగారుతన నిత్యకృత్యమైన మొక్కల పనిలో వున్నారు.

రమణి తండ్రికి కాస్త దూరంగా చీపురు చేత్తో పుచ్చుకుని చెత్తా [illegible]రం బాగుచేస్తోంది.

చీరెని పైకి లాగి దోపింది. పమిటని బిగించి కట్టింది.

చకచకా పన్చేస్తోంది.

సుబ్రమణ్యానికి గది కిటికీలోంచి ఆమె స్పష్టంగా కనిపిస్తోంది.

ఆమె మొహంలోని హావభావాలు, జుట్టుని వెనక్కి తోసుకుంటున్న పద్ధతి, చేతులు ఆడిస్తున్నపుడు కనిపిస్తున్న పయసు పొంగులు...

సందిగ్ధంలోవున్న సుబ్రమణ్యం కని పిస్తున్న దృశ్యాన్ని చూసాక నిర్ణయిం చేసాడు- ఆఫీసుకి నాగా పెట్టాలని. పెట్టి రోజంతా కన్పిస్తున్న మనోహర దృశ్యా లని చూడాలని. అలా నిర్ణయించి మంచం పైన సర్దుకుర్చున్నాడు- ఫ్రీపాస్ ప్రేక్షకుడిలాగా.

సరిగ్గా అదే సమయానికి ఆ ఇంటి గేటుముందు తళతళ మెరుస్తున్న పాల రంగు ఫియట్ కారొచ్చి ఆగింది.

అందులోంచి శ్రీలేఖ దిగింది.

ఎర్రటి సిల్కుచీరె, అదేరంగుబ్లౌజు, ఎర్రబొట్టు-చూడంగానే ఎర్రగాను, పస్తా యించి చూస్తే వర్రగాను కన్పిస్తోంది. హీల్సు చప్పుడు చేసుకుంటూ గేటు తీసుకుని లోనికొచ్చింది.

పనిలోవున్న రామసూర్యంగారు ఆ వేపుగా చూసేరు.

రమణికూడా చూసింది. కాని సుబ్రమణ్యం చూసేడుకాదు.

శ్రీలేఖ లోనికొచ్చి, "ఎక్స్‌క్యూజ్ మీ! వేరీజ్ మిస్టర్ మణ్యం?" అనడిగింది.

రామసూర్యంగారు లేచి నిల్చున్నారు. చేతులకంటిన మట్టిని దులుపుకుంటూ ఆశ్చర్యంగా 'మణ్యమా పుణ్యమా' అన్నట్లు అయోమయంగా చూసేరు.

"సుబ్రమణ్యమా?" అనడిగింది రమణి.

"యస్... అయ్‌మీన్ సుబ్రమణ్యం" అంది శ్రీలేఖ.

రామసూర్యంగారు ఆ గదివేపు చెయ్యి చూపించి, ఆమెవంకే తదేకంగా చూస్తు న్నారు. శ్రీలేఖ గదివద్దకెళ్ళి తలుపు తట్టింది.

మంచంపై కూర్చున్న సుబ్రమణ్యం తలుపు చప్పుడుతో వచ్చి తలుపు తీసేడు.

కాని వాకిట్లో నిల్చున్న ఆమెని గుర్తించ లేక "ఎవరు కావాలండీ?" అని చాలా మర్యాదగా అడిగేడు.

"ఓ మైగాడ్...అప్పుడే మర్చిపోయా రన్నమాట"

ఆ కంఠం వినగానే చటుక్కున గుర్తు కొచ్చింది.

"మీరా..పతంజలిగారమ్మాయికదూ"

"థాంక్‌గాడ్... బతికించేరు" అంటూ చొరవగా లోపలికొచ్చింది.

బయటినించి తండ్రీకూతుళ్ళు అంతా గమనిస్తూనే వున్నారు.

అది గమనించి సుబ్రమణ్యంకంగారు పడ్డాడు.

"ఆఫీసుకి వేళయింది" అంటూ నసిగాడు.

కాని శ్రీలేఖ అదేం పట్టనట్టు గదంతా పరీక్షగా తనిఖీ అధికారిలా చూస్తోంది. గది, వస్తువులు, బట్టలు అన్నిటినీచూసేక ఆమె అసహ్యంగా మొహం పెట్టి-

"హౌమచ్ యు ఆర్ పేయింగ్ ఫర్ దిస్ డర్టీరూమ్?" అనడిగింది.

సుబ్రమణ్యం చెప్పాడు.

"బాపురే...దారుణం.ఆ ఓనరుకిఉరిశిక్ష వేసెయ్యాలి" అంది పెద్దగా.

సుబ్రమణ్యం బయటకి చూసేడు. రామసూర్యంగారు అక్కడే వున్నారు.

త్వరగా ఈమెని పంపించెయ్యటం మంచిదని, షర్టువేసుకుని తాళం చేతిలోకి తీసుకున్నాడు.

ఇద్దరూ గది బయటకొచ్చారు.

శ్రీలేఖ గదిముందున్న ముగ్గుని వొంగి పరీక్షగా చూస్తోంది.

సుబ్రమణ్యం గదికి తాళం బిగించి తయారుగా నిల్చున్నాడు.

శ్రీలేఖ ముగ్గువంక కాసేపుచూసి, "మోర్వలెస్-ఎవరేశారు..పనిపిల్లా?" అని

అడిగింది.

"కాదు... ఆ పిల్ల" అని దూరంగా నిల్చున్న రమణిని చూపించాడు.

"ఎవరావిడ?సర్వెంట్ మెయిడ్ కదూ?" అంది తేలిగ్గా.

సుబ్రమణ్యంలో కోపం పడగెత్తింది. మొహం ఎర్రబడింది. ఆమెని లాగి పెట్టి లెంపకాయ కొట్టెయ్యాలన్నంత పౌరుషం వచ్చింది.

"ఆల్ ఆర్ సర్వెంట్సు టు సమ్‌వన్ ఆర్ అదర్. ఆమె ఇంటి ఓనరు కూతురు. బుద్ధిమంతురాలు.మనలాకాదు" అన్నాడు.

శ్రీలేఖ అతడివంక ఆశ్చర్యంగా చూసింది. "గుడ్! మీకూ కోపంవుందన్న మాట'' అంది సన్నగా నవ్వుతూ.

రమణి పని చేస్తోందన్నమాటేగాని మాటిమాటికీ వాళ్ళిద్దరివంక చూస్తోంది. ఆమె మాట్లాడుతున్న పద్ధతి, అతడామె వంక చూస్తున్నతీరు, సమాధానం చెబుతున్న ధోరణి గమనిస్తూనేవుంది.

"ఆఫీసుకి టైమైంది'' అన్నాడు సుబ్రమణ్యం గడిమెట్లు దిగుతూ.

"ఇవ్వాళ బస్సులు స్ట్రయికు...లిఫ్టిస్తా పదండి"

సుబ్రమణ్యం మరింతకంగారుపడ్డాడు. ''అబ్బే...నేనెలాగో వెళ్ళగలను''

శ్రీలేఖ చటుక్కున అతడి చెయ్యి పట్టి ముందుకి లాక్కెడుతూ-

"కమాన్ యంగ్‌మాన్... డోంట్ బి టిమిడ్" అంది.

సుబ్రమణ్యం వెడుతూనే తలని వెనక్కి తిప్పి చూసేడు.

రామసూర్యంగారు, రమణి ఆశ్చర్యంగా తామిద్దరివంక చూడటం గమనించి మరింత కుంచించుకుపోయేడు.

ఆరోజు రమణి కూడా తన పనులు చకచకా చేసుకుపోతున్నా మనసు మనసులోలేదు. ప్రతిరోజులాగా వుత్సాహంగా లేదు. చూసిన దృశ్యం మళ్ళీమళ్ళీ గుర్తుకొచ్చి గుండెల్లో గుచ్చుకుంటోంది.

ఎవరా పిల్ల? ఆ చనువేవిటి? అలా చెయ్యి పట్టిలాక్కెళ్ళటమేమిటి? ఇతగాడు ఎవరి వెంటయినా అలాగే వెళ్ళిపోతాడా? ఇన్నాళ్ళూ తను అనుకుంటున్నది, అల్లుకుంటున్నది అంతా భ్రమేనా... ఇంతేం కాదా?

ఆరోజు సుబ్రమణ్యం గదిముందు ముగ్గు సగం పడి ఆగిపోయింది.

మొక్కల పాదుల్లోకి నీళ్లు పుష్కలంగా ప్రవహించలేదు.

గదులు చిమ్మలేదు, బట్టలు వుతికి ఆరెయ్యలేదు.

ఎక్కడివక్కడ ఆగిపోయినాయి.

బిక్కుబిక్కుమంటూ ఎవరికి చెప్పుకోవాలో, ఏం చెప్పుకోవాలా, ఎలా చెప్పుకోవాలో తెలీక తలనొప్పి నెపంతో పడుకుంది.

ఎంత కాదనుకున్నా, సర్దిచెప్పుకున్నా అదేవిటోగాని, అదేం చిత్రమోగాని బాధగానే వుంది.

తనదైనదాన్ని ఎవరో లాక్కెళ్ళిపోయినట్లు!దూరంగా..తనకందనంతదూరంగా..

మాగన్నుగా నిద్రపట్టింది.

అలా భోంచేయకుండా కూడా ఎన్నడూలేంది విచిత్రంగా ఎంతసేపు నిద్రపోయిందోకూడా తెలీదు.

బయట 'పెల్త్రిగాం... పెల్త్రిగాం' అని ఎవరో అరుస్తున్నందువల్ల మెళుకువ వచ్చింది.

ఉలిక్కిపడి లేచింది రమణి. కళ్ళు తడిగా వున్నాయి. తనకి తెలీకుండానే ఏడ్చుండాలి. కళ్లు తుడుచుకుంది.

ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది.

రామసూర్యంగారి గుర్రు జోరీగ శబ్దంలా వినిపిస్తోంది.

హనుమాయమ్మగారి జాడ లేదు. పక్కవాళ్లింట్లో పచ్చీసు ఆటకి వెళ్ళుంటుంది.

రమణి బయటికొచ్చింది.

"సుబ్రమణ్యంగారికి టెలిగ్రాం" అన్నాడు అక్కడ నిల్చున్న కాకీ బట్టలతను.

'ఆ గదిలో వుంటాడు. మాకేం సంబంధంలేద'ని చెప్పాలనిపించింది.

కాని మాట పెగల్లేదు. గుండెలో ఏదో కదిలింది. అది గొంతుకలో అడ్డంపడింది.

అప్రయత్నంగా సంతకంచేసి తీసేసుకుంది.

ఆ వ్యక్తి వెళ్ళిపోయాడు.

చదవాలా, వద్దాన్న మీమాంసలో కొద్దిక్షణాలు గడిచాయి.

మనసుని గట్టిచేసుకుని, నచ్చచెప్పుకుని చేతిలో కాగితాన్ని మడతలు విప్పి చదివింది.

"గ్రాండ్‌మదర్ ఎరైవింగ్ నైట్ బస్. రిసీవ్- శేషగిరి" అనుంది.

అది చదివాక మనస్సు కాస్త వూరట చెందింది. దిక్కుతోచక సతమతమైపోతున్నవాడికి దిక్సూచి కనిపించినట్లనిపించింది.

మనస్సు భారం తగ్గింది, బాధ తగ్గింది. ఆశ పెరిగింది.

వంట గదిలోకెళ్ళి కంచం పెట్టుకుని వడ్డించుకుని భోంచేసింది...హాయిగా.

* * * *

ఆ రోజు సుబ్రమణ్యం గదికి చేరేసరికి చీకటిపడింది.

బట్టలు మార్చుకుని బయటికొచ్చేడు. దీపం వెలుగులో సగంలో ఆగిపోయిన ముగ్గు-సగం చెక్కి వదిలేసిన శిల్పంలా కనిపించింది.

దానివంక తదేకంగా చూస్తున్నాడు.

ఉదయం శ్రీలేఖ తనని చెయ్యిపట్టి లాక్కెళ్ళటం తండ్రీకూతుళ్లిద్దరూ చూసారన్నది స్పష్టం. కాకపోతే ముగ్గు సగంలో ఆగిపోవటానికి, శ్రీలేఖ ప్రవర్తనకి ఏదైనా సంబంధముందా అని దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

పక్కన అడుగుల శబ్దం అయింది - వినిపించుకోలేదు.

సన్నగా దగ్గు వినిపించింది, గాజుల గలగల.

సుబ్రమణ్యం తలతిప్పి చూసేడు.

"మీకు టెలిగ్రాం" అందించింది రమణి తల దించుకుని. సుబ్రమణ్యం కంగారుగా అందుకుని, విప్పి చదువుకున్నాడు.

సంతోషంతో మొహం విప్పారింది

"అరె...బామ్మొస్తోందిట" అన్నాడు పైకి-ప్రపంచానికి అది పెద్ద సంతోషపు వార్తలా.

రమణిఅలాగే నిల్చునుంది. "ఉదయం వచ్చిన ఆమె..." మధ్యలోనే మాటని తుంచేసింది.

"ఓ...ఆ అమ్మాయా! మా నాన్నగారి ఫ్రెండ్ కూతురు. అబ్బో...చాలా ఫాస్ట్" అన్నాడు ఇంకా టెలిగ్రాం సంతోషంలోంచి బయటకి రాలేక.

"చాలా అందంగా కూడా వుంది" అంది రమణి.

ఆ మాటకి ఏం చెప్పాలో అర్థంకాక "థాంక్స్" అన్నాడు పొడిగా.

రమణి వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది.

శ్రీలేఖ గురించి ఎందుకు తరచి

అడుగుతోందన్న ఆలోచన చెయ్యలేదు.

బామ్మ వస్తోందన్న సంతోషం మిగతా ఆలోచనలన్నిటినీ కప్పేసింది.

త్వరగా లేచి బస్సుస్టాండుకెళ్ళాలనుకుంటూ లోనికెళ్ళి తలుపేసుకొన్నాడు సుబ్రమణ్యం.



4

మర్నాడు...

ఉదయం అయిదు గంటలు.

సిటీ బస్టాండు నిద్రలో జోగుతోంది.

అక్కడక్కడ సిమెంటు బల్లలపైన నిద్రపోతున్న జనం-

ఉండివుండి చూసుకొస్తున్న బస్సులు.

బస్సు రాగానే చుట్టుముడుతున్న ఆటో, రిక్షాలవాళ్ళు.

బస్సుల్లోంచి నిద్రకళ్ళతోను, లగేజీలతోను దిగుతున్న ప్రయాణీకులు.

సుబ్రమణ్యం ఒక పక్కగా నిల్చున్నాడు.

రాత్రి సరిగా నిద్రపోయేడు కాదు. ఎక్కడ మెళుకువ రాదోనన్న బెంగకొద్దీ దాదాపు మేలుకునే వున్నాడు. కళ్ళు మండుతున్నాయి. నిద్ర ముంచుకొస్తోంది.

అతి కష్టంపైన మత్తునించి బయటపడి, వస్తున్న బస్సుసల్లా ఆత్రంగా చూస్తున్నాడు.

కొద్దిక్షణాలకి విజయవాడ బస్సు 'దూసుకొచ్చి ఆగింది.

సుబ్రమణ్యం కళ్ళు పద్దుకుని, కదిలి బస్సు దగ్గరకొచ్చేడు. అప్పటికే జనం దిగటం ప్రారంభించేరు. దిగుతున్న జనాన్ని, లోపలున్న జనాన్ని కళ్ళింత చేసుకుని పరీక్షగా చూస్తున్నాడు. కాని బామ్మ జాడ కనిపించింది కాదు.

విజయవాడనుంచి ఆరోజుకొచ్చే ఆఖరి నైట్ సర్వీసు బస్సుని కూడా సర్వే చేసి కనుక్కున్నాడు.

జనం దిగుతూనే వున్నారు. గొడవగా, గందరగోళంగా వుంది.

వస్తోందని టెలిగ్రాం ఇచ్చి రాకపోవటమేమిటి? సుబ్రమణ్యం ఆదుర్దాగా అటూ ఇటూ చూస్తున్నాడు.

పది నిముషాల్లో బస్సు ఖాళీఅయింది.

బామ్మ ఏ కారణంచేతనో ప్రయాణం వాయిదా వేసుకునుంటుందన్పెప్పి నిర్ధారణ చేసి, వెళ్ళిపోబోతూ ఆఖరిసారిగా బస్సులోపలికి చూసేడు.

ఒక పాతకాలంనాటి ట్రంకుపెట్టె, సంచులు, మూటలు లగేజీ అరలో కన్పించాయ్.

ఆ ట్రంకుపెట్టెని ఎక్కడో చూసినట్లనిపించి పస్తాయించి, కాస్త దగ్గరకెళ్ళి పరీక్షగా చూసేడు.

వెంటనే గుర్తుకొచ్చింది. అది బామ్మగారి భోషాణప్పెట్టె. అదావిడకి పుట్టింటివాళ్ళు పసుపు కుంకంతో ఇచ్చిన బాపతు.

అయితే మరి బామ్మ ఏమైనట్లు?

సుబ్రమణ్యం ఒక్క అంగలో బస్సులోపలికెక్కాడు.

కన్పించిన దృశ్యం చూసి కాసేపు అలాగే నిల్చుండిపోయాడు.

బస్సులోని ఆఖరు సీట్లో బామ్మగారు నిటారుగా చాపుకుని పాల సముద్రంపైన విష్ణుమూర్తిలా సుఖంగా పడుకునుంది.

తలకింద గుడ్డలమూట, సీటుకింద మిగతా మూటల్ని సైజువారీగా పేర్చింది. గాఢనిద్రలో వుంది.

సుబ్రమణ్యం దగ్గిరకెళ్ళి తట్టి లేపాడు.

ఆవిడ వులిక్కిపడి లేచింది.

"నువ్వురా సుబ్బులూ! అయితే వూరొచ్చేసిందన్నమాట" అంటూ లేవబోయి ఫెడేల్ని మళ్ళీ సీటుపైబడింది. బాధతో, కోపంతో మొహం చిట్లించి–

"దిక్కుమాలిన బస్సు వొళ్ళంతా హూనం హూనం అయ్యింది. రైల్లో కూచోపెట్టరా అంటే దీంట్లోకూలేసాడు" అని వాయిదాల పద్ధతిపై లేచి కూర్చుంది.

సుబ్రమణ్యం ఆవిడ లగేజీని కస్టమ్సు ఆఫీసర్లాగా బయటకిలాగి పేరుస్తూ, "సరే... ముందు బస్సు దిగు. తర్వాత మాట్లాడుకుందాం" అన్నాడు.

అయినా ఒక పట్టాన బామ్మగారు కదిలింది కాదు.

సుబ్రమణ్యం రొప్పుకుంటూ సామాన్లన్నిటినీ కిందికి దింపేడు.

బామ్మగారలాగే కూర్చుని ఏవిషయం గురించో తీవ్రంగా ఆలోచించి, లోపలికొచ్చిన మనవడితో, "సుబ్బులూ! ఇప్పుడీ బస్సు ఎక్కడికెడుతుంది?" అనడిగింది.

"డిపో షెడ్డుకి"

"ఎక్కడదడి... ఏ పేట?"

"ఏమో తెలీదే... దేనికి?" అర్థంకాక అమాయకంగా అడిగేడు.

"అహ ఏంలేదు! నువ్వుండే గదివైపుగా వెళ్ళేట్టయితే, ఆ డ్రైవరు చేతిలో చేగోడీలో, జంతికచుట్లో పెడితే అక్కడ దింపడా?"

బామ్మగారి మేధస్సుకి సుబ్రమణ్యం జోహార్లర్పించాడు. కొద్దిక్షణాల క్రితం బస్సుని దుమ్మెత్తిపోసిన ఆవిడ ఇంకా దానిపై మమకారం చావక మార్గాలు వెదుకుతోంది.

"అలా చేగోడీలకీ, జంతికచుట్లకీ ఇక్కడ పన్లు జరగవ్...దిగు" కటువుగా అన్నాడు.

బామ్మగారు తప్పక లేచి నిల్చుంది.

సుబ్రమణ్యం చికాగ్గా కిందికి దిగేడు.

"సుబ్బులూ... ఎలా వున్నావురా?" మూటలమధ్యన నిల్చుంది బామ్మగారు.

"సిక్షేపంలావున్నాగాని ఇంత లగేజీ ఏవిటే? ఏ పెట్టో చేత్తో పట్టుకుని రాక"

బామ్మగారు బుగ్గలొత్తుకుంటూ లగేజీ వివరాలు చెప్పసాగింది.

"అదేవిట్రా... అలా అంటావ్! ఏవున్నాయని–ఈ రెండు మూటలు వూరగాయలు, ఈ రెండు చింతకాయ, గోంగూర. ఇవిగో ఇవేమో... జంతికలు, చేగోడీలు. సరే...ఈ బస్తాలో కుంపటి, కాసినిబొగ్గులు. ఆ మూటలో పళ్ళేలు, గరిటలు, గిన్నెలు. ఇదేమో నా పక్కబట్టలు. ఆ పెట్టెలో కట్టుబట్టలు. అంతే... ఏం పెద్ద లగేజీనా?"

సుబ్రమణ్యానికి గొంతులో తడారిపోయింది. ఈవిడ పరామర్శకొచ్చిందా, పర్మినెంటుగా వచ్చిందా అని కూడా డౌటుపడ్డాడు.

"ఇవన్నీ ఎందుకే ... కొద్దిరోజుల భాగ్యానికి"

"ఎందుకేవిట్రా... మరి నా భోజనం ఎలా? ఆదిక్కుమాలిన హోటళ్ళలోనేథస్తే తినను. నా వంట నేచేసుకోవాల్సిందే... నా తిండి నే తినాల్సిందే"

సుబ్రమణ్యానికి బామ్మగారి రాకలోని ఆనందంమాయమై దిగులు మొదలైంది.

రామసూర్యంగారు గది అద్దెకిచ్చే సమయానే ఖచ్చితంగా చెప్పేరు. గదిలో



వంటావార్పు కూడదని, ఇల్లు పాడైపోతుందని, అంచేత హోటల్లో తిని పడుకునేందుకయితేనే ఇస్తానని స్పష్టంగా చెప్పేరు.

సుబ్రమణ్యానికి చిక్కు సమస్య ఎదురైంది.

"అదేం గుడిరా సుబ్బులూ?"

"అది గుడికాదే... మసీదు. ఇలాంటివిక్కడ ఫర్లాంగుకొకటి చొప్పున కనిపిస్తాయ్. గుడనుకుని జొరబడ్డావంటే లేనిపోని మతకలహాలు మళ్ళీ మొదలౌతాయ్. ఇక్కడే వుండు... ఆటో పిల్చుకొస్తా"

బామ్మగారిని, చుట్టూ పేర్చిన సామాన్లని చూసి ఆటోవాళ్లు ఛార్జీగాక ఎక్స్ట్రా అడిగారు.

భాషర్థంకాక బామ్మగారు 'ఎంత కావాల్ట' అనడిగింది.

"ఓ ఎకరం పొలం రాసిమ్మంటున్నాడు" అన్నాడు కసిగా.

"సుబ్బరంగా జట్కా బండో, రిక్షా బండో మాట్లాడు... ఛెంగున పోదాం" అందామె.

చివరికి రెండు ఆటోల్లో- ఒకదానిలో సుబ్రమణ్యం ప్లస్ కాస్త లగేజి! ఇంకో దాంట్లో బామ్మగారు, మిగిలిన లగేజి. ఒకదాని వెనుక వకటి పానకం కావిడ వూరేగింపులా రామసూర్యంగారింటివైపు దారితీసేయి.

ఆటోలు విచిత్రంగా మెల్లిగా వెడుతున్నాయ్.

ముందు సుబ్రమణ్యం వున్న ఆటో, వెనక బామ్మగారిది.

ఎంతోమందిని ఇహ పరలోకాల్లోకి రవాణా చేసిన ఆ ఆటోడ్రైవర్లు బామ్మగారి లగేజీకి బెదిరిపోయారు. ఎందుకైనా మంచిదని చాలా నెమ్మదిగా నడిపిస్తున్నారు.

జంక్షన్లొస్తే మరింత స్లోచేసి ఆపైన వెడుతున్నారు.

బామ్మగారు ఆశ్చర్యంగా మూసున్న దుకాణాలని, వెలిగిపోతున్న రోడ్లని కన్నార్పకుండా చూస్తోంది.

ఒక జంక్షన్‌లో ఆటో బాగా స్లో అయింది.

ఎదురుగా ఒకాయన పరిగెత్తుకొస్తున్నాడు. హస్తలాఘవం ప్రదర్శించి పట్టుపడక తప్పించుకుని పారిపోయి వస్తున్నవాడిలా రొప్పుకుంటూ వస్తున్నాడు.

అతడు మట్టలాగు తొడిగి, స్పోర్ట్సు బనీను వేసుకున్నాడు. కాళ్ళకితెల్లకాన్వాస్ బూట్లు వేసుకున్నాడు.

ఆ వ్యక్తి సామాన్ల మధ్యన కూచ్చున్న సుబ్రమణ్యాన్ని గుర్తించేరు. కాని అతడు ఆ వ్యక్తిని పతంజలిగా గుర్తించలేక పోయేడు.

"హల్లో సుబ్రమణ్యం" అన్నాడాయన ఆటోపక్కగా పరిగెడుతూ. సుబ్రమణ్యం ఆయనవంక తేరిపారజూసేడు. పతంజలిగారు మార్నింగ్ రన్నులో వున్నట్లు అర్థమైంది.

"ఏవిటోయ్... గదికాని ఖాళీ చేస్తున్నావా?"

ఆటో మెల్లిగా వెడుతూనే వుంది. పక్కగా పతంజలిగారు పరిగెడుతూనే వున్నారు.

"లేదండి. ఊర్నించి మా బామ్మగారొచ్చిందండి... తీసుకొస్తున్నా" అన్నాడు.

పతంజలిగారు పరిగెడుతూనే తలని ఆటో లోపలికి దోపి బామ్మగారనే వ్యక్తి కోసరంగాలించి- "ఎక్కడోయ్... లగేజి కిందనుందా?" అనడిగారు.

"వెనకాల వేరే ఆటోలో వస్తోందండి"

సరిగ్గా అదే సమయానికి బామ్మగారు ఆ దృశ్యం చూసింది.

మనవడి ఆటో పక్కగా పరిగెడుతున్న తెల్లలాగువాడు.

ఇక్కడ అడుక్కునేవాళ్ళు కూడా మంచి బట్టలేస్తారనివిందావిడ.

ఆ విషయం ఈ దృశ్యం చూడగానే గుర్తుకొచ్చింది.

బామ్మగారు తల బయటికి పెట్టి, "సుబ్బులూ! పాచి నోటితో బిచ్చం వెయ్యకూడదు. పొమ్మను వెధవని" పెద్దగా అరిచింది.

ఆమాట సుబ్రమణ్యం, పతంజలిగారు ఇద్దరూ విన్నారు.

కాని విననట్లుగా మొహాలు పెట్టేరు.

అంతలో ఇంకో సెంటరు రావటంతో, "సరేనోయ్! మీ బామ్మగార్ని ఓసారి మా ఇంటిక్కూడా తీసుకురా" అన్చెప్పి డైవర్షన్ పుచ్చుకున్నారు.

సుబ్రమణ్యం గాలి పీల్చుకున్నాడు.

ఆటోలు ముందుకెళ్ళాయ్.

* * *

రామసూర్యంగారు అప్పుడే నిద్రలేచి బ్రష్ నోట్లో వుంచుకుని పరాగ్గా పచార్లు చేస్తున్నారు.

టెలిగ్రాం వచ్చిన సంగతికాని, బామ్మగారు వస్తోందన్న విషయంకాని ఆయనకిగాని, ఆయన భార్యకిగాని తెలీదు.

రెండు ఆటోలు పూర్తి లగేజీతో

పుష్పకవిమానాల్లాగా వచ్చి గుమ్మం ముందు రాగే సరికి ఆయన బ్రష్ కొట్టటం ఆపి కాస్త ముందరకొచ్చి చూసేరు.

సుబ్రమణ్యం ఆటోలోంచి దిగేడు.

వెనకదాంట్లోంచి బామ్మగారు దిగింది.

ఆటో డ్రైవర్లు, సుబ్రమణ్యం కలిసి లగేజీని గది గుమ్మం దగ్గిరకి చేరుస్తున్నారు.

రామసూర్యంగారు ఆశ్చర్యంగా చూస్తున్నారు.

గదిముందరి భాగమంతా సామాన్లతో నిండిపోయింది.

ఆ సామానంతా చూసిన రామసూర్యంగారికి చిన్న అనుమానం కూడా కల్గింది- సుబ్రమణ్యం రాత్రికి రాత్రి పెళ్ళి చేసేసుకుని, తెల్లారకముందే కాపురానిగ్గాని పట్టుకొచ్చాడాని.

బామ్మగారు గేటు నెట్టుకొని లోపలికొచ్చి, "సుబ్బులూ! ఎక్కడ్రా నీగది?" అంది నడుంమీద చేతులుంచుకుని.

"ఇదిగో... ఇదేనే" అంటూ గదిని తెరిచే ప్రయత్నంలో వున్నాడు.

రామసూర్యంగారక్కడే నిల్చుని బామ్మగార్ని భక్తి ప్రపత్తులతో చూస్తున్నారు-

"ఆయనే ఇంటి యజమాని" అని అటు తిరిగి నిల్చున్న ఆయన్తో "మా గ్రాండ్ మదరండీ అన్నాడు.

రామసూర్యంగారు అర్థమైనట్లుగా తలూపారు.

తలుపుతీసి సుబ్రమణ్యం సామాన్లన్నిటినీ లోనికి చేరుస్తున్నాడు.

బామ్మగారు గది ప్రవేశం చేసింది మంచంపైన కూర్చుని నాలుగు వైపులా పరిశీలనగా చూసింది. అలవాటులేక చిన్నగదిలో వుండటం అసౌకర్యంగా అన్పించింది.

"పాయిఖానాఎక్కడ్రా?' అనడిగింది

"ఏం... వేళయిందా"

"అహ పూరికినే! కుళాయుందా? బావి నీళ్ళా?"

సుబ్రమణ్యానికి నిద్ర ముంచుకొస్తోంది. ఒక గంట పడకవేస్తే ఎలా వుంటుందని ఆలోచన చేస్తున్నాడు. మధ్యలో బామ్మగారి ప్రశ్నలు విసుగు కలిగిస్తున్నాయ్.

"కుళాయుందిగాని, కాస్సేపు పడుకోవే"అన్నాడు విసుగ్గా.

"ఇంక పడకేవిట్రా! తెల్లవారిపోతేను. రెండు చెంబులు నీళ్ళోసుకుని మడిగట్టుకుంటా" అంది.

సుబ్రమణ్యానికి నిద్ర మత్తు వదిలిపోయింది. గుండె భయంతో గుబగుబలాడింది. ఆవిడ పక్కకి జరిగి కూర్చుంటూ- "అదికాదే! ఇక్కడున్న వారం పదిరోజులు హాయిగా హోటల్నించి మడికట్టుకుని క్యారేజీ తెస్తానే. తిని విశ్రాంతి పుచ్చుకో. వంటగింటూ మొదలు పెట్టకు" అన్నాడు నచ్చజెబుతున్న ధోరణిలో.

బామ్మగారు కస్సుమంది- "మంచి వాడివే! ఇంత బతుకు బతికి చివరికి హోటలు కూడు కూడా తినాలా? ఇంకా నయం! అసలు నేవచ్చింది పదిరోజులు నా చేతిమీదుగా వండి పెడదామని"

"నిజమేననుకో... కాని ఇంటాయన ఒప్పుకోడే! గది ఖాళీ చెయ్యమంటాడు"

"ఎందువల్ల?"

"గది పాడౌతుందని"

బామ్మగారు పనస మొదలెట్టింది.

"పిండాకూడు...వండుకుంటేనే గది పాడవుతుందా? పీడికేవుందా ఇల్లు? ఏం...

వాళ్లొండుకోటంలేదా, తినటంలేదా? చిన్న వెధవనిచేసి అర్థంపర్థంలేని షరతులు పెడతాడా? ఇట్లా పిలు..నే మాట్లాడతా"

సుబ్రమణ్యానికో విషయం నిర్ధారణై పోయింది. తను వేరే గది వెతుక్కోవాలి. బామ్మ పుణ్యమాని తప్పదు. ఆవిణ్ని సమాధానపరచే ప్రయత్నంలో,

"సర్లేవే! నే మాట్లాడతాగాని నువ్వెళ్ళి మొహం కడుక్కురా" అన్నాడు.

బామ్మగారు మంచందిగి భోషాణప్పెట్టెని తెరిచింది. దాంట్లోంచి పళ్ళపొడి పొట్లం, తాటాకుబద్ద తీసి బయల్దేరింది.

సుబ్రమణ్యం ఆవిడవెంటే వెళ్లాడు.

అప్పటికే హనుమాయమ్మగారు లేచి దొడ్డి బాగుచేస్తోంది.

వీళ్లిద్దర్నీ చూసి ఆ పని ఆపి నిలబడి కొత్త వ్యక్తిని చూస్తోంది. సుబ్రమణ్యం కలగజేసుకుని వాళ్లిద్దర్నీ పరిచయం చేసేడు. వాళ్ళిద్దరూ కళ్ళతోటే పలకరించుకుని పరామర్శించుకున్నారు. బామ్మగారు రెండడుగులు ముందుకేసి, "మీ ఇంటి పేరు?" అనడిగింది.

హనుమాయమ్మగారు చెప్పింది.

"అబ్బో...మనకి దగ్గరివాళ్లేరా? బాగా కావలసినవాళ్ళు కూడాను" అని చుట్టరికాలని చెడామడా తిప్పేసింది.

మనవడు తొందరపెట్టటంతో నీళ్ళ గదిలోకెళ్లి దంతధావన మొదలుపెట్టింది. అంతసేపూ సుబ్రమణ్యం నీళ్ళ గది బయట సెక్యూరిటీగార్డులా నిలబడే వున్నాడు.

ఆవిడ ఏ కూతకూసి వాళ్ళకి కోపం తెప్పించి ఎక్కడ తన కొంప ముంచుతుందోనన్న బెంగతో అలాగే ఆవులిస్తూ నిల్చున్నాడు.

"నువ్వెళ్ళి కాస్సేపు పడుకోరా అబ్బీ...నాకన్నీ అర్థమైనాయిగా" అంది నీళ్ళ గదిలోంచి కుళాయి వంక చూస్తూ.

పన్నేసుకుంటున్న హనుమాయమ్మగారు కూడా, "నువ్వెళ్ళు నాయనా! నే వున్నాగా" అంది హామీనిస్తున్నట్లు.

ఇక తప్పదన్నట్లు గదిలో కెళ్ళి మంచంపైన వాలేడు పరధ్యానంగా.

అంతే! ఎప్పుడు నిద్రపట్టిందో అతడికే తెలీదు.

తిరిగి మెళుకువ వచ్చేసరికి తొమ్మిదయింది. ఎండ చుర్రుమంటోంది. కంగారు కంగారుగా మంచం దిగేడు. గదిలో సామాన్లు చూసేకగాని బామ్మ సంగతి గుర్తుకొచ్చిందికాదు.

కాని ఎక్కడ?

ఆదుర్దాగా బ్రష్ చేతో పుచ్చుకుని దొడ్లోకెళ్ళి స్నానాల గదిలోనికెళ్ళబోతూ బామ్మ కోసం చుట్టూచూసేడు. కనిపించిందికాదు. కాని ఎక్కణ్నించో మాట మాత్రం వినిపిస్తోంది.

పని పూర్తిచేసుకుని వస్తూ రామసూర్యంగారింట్లోకి తొంగిచూసేడు.

అక్కడ కనిపించిన సన్నివేశం చూసి అలాగే నిల్చుండిపోయాడు.

బామ్మగారు కుర్చీలో కూర్చునుంది. ఎదురుగా గచ్చునేలపైన రామసూర్యంగారు, ఆయన భార్య కూర్చుని ఆవిడ చెబుతున్న విషయాల్ని అత్యంతాసక్తిగా వింటున్నారు. వాళ్ళకి కాస్త దూరంలో రమణి నిల్చునుంది.

అందరి చేతుల్లోనూ కాఫీ గ్లాసులు వున్నాయి.

"ఇంతకీ ఆ వ్యాజ్యం ఏమైంది?" అడుగుతున్నారాయన.

"ఆ...ఏమవుతుంది! పసుపు కుంకం కిందిచ్చిన ఆ ఎకరం పొలంకోసం వేసిన

దాపా ఆ పసుపు కుంకం పోయినా తేలి చావడంలేదు. ఇంకా నడుస్తూనేవుంది" అంటూ మనవణ్ని చూసి, "లేచావురా సుబ్బులూ! మొహం కడిగేవా? ఆ పిల్ల కాఫీ వుంచింది" అంది రమణి వైపుచూసి.

సుబ్రమణ్యానికి ఇబ్బందిగా, అసౌకర్యంగా అనిపించింది.

బామ్మ తత్వం అతడికి కొత్తేంకాదు. అందిస్తే అల్లుకుపోయేరకం. పరాయింట్లో కూడా పెత్తనం చెలాయించి వాళ్ళింట్లో వాళ్ళచేత సేవలు చేయించుకోగల సమర్థురాలు. కాకపోతే తనకేం తంటా తెచ్చి పెడుతుందోనన్న భయం.

అతడు గదిలోకొచ్చేసిన కొద్దిక్షణాలకి రమణి కాఫీ గ్లాసుతో వచ్చి గడపలో నిల్చుంది.ఇద్దరి చూపులు కల్సుకున్నాయి. చేయిని ముందుకి చాపి గ్లాసుసందించింది.

సుబ్రమణ్యం తడబాటుతో అందుకున్నాడు.

అలా ఆమె చేతిమీదుగా పొద్దున్నే కాఫీ అందుకోవటం ముచ్చటగానేవుందిగాని లోపల ఏవనుకుంటారోనని బెదురు.

"మా బామ్మకి కాస్త నోటి దురుసెక్కువ. ఆవిడేవన్నా పట్టించుకోకండి'' అన్నాడు ముందుజాగ్రత్తకోసం.

"ఏం ఫర్వాలేదులెండి! మీకన్నా మీ బామ్మగారికేచొరవ,ధైర్యం ఎక్కువ" అనేసి గిరుక్కున వెనక్కితిరిగి వెళ్ళిపోయింది.

అది బామ్మకి ప్రశంసాపత్రమో, తన పిరికితనాన్ని ఎత్తిచూపటమో అర్థం కాలేదు. సుబ్రమణ్యం వెళ్ళి స్నానం చేసొచ్చాడు. బట్టలు వేసుకుని ఆఫీసుకి బయల్దేరాడు. భోజనం ఏర్పాటు ఏం చెయ్యాలో అర్థమయిందిగాదు. గదిలోనే వుడకేసుకొమ్మని చెప్పటమా లేక ఇంకేదైనా మార్గం ఆలోచించటమా అన్నది సందిగ్ధంగానే వుండిపోయింది. ఆవిడ ఇటువైపుగా వస్తుందేమో ఏదో ఒకటి తేల్చి చెబుదామంటే అక్కణ్నించి కదిలిరావటం లేదు.

ఆఫీసుకి టైం అవుతోంది.

వెళ్ళి పిల్చుకొద్దామనుకుంటుండగా రామసూర్యంగారొచ్చారు. గుమ్మంలోనే నిల్చుని, "మీ బామ్మగారున్నన్నాళ్ళు ఆవిడ మా ఇంట్లోనే, మాతోపాటే భోం చేస్తుంది...కాదనకు'' అన్నారు.

"అబ్బే.... ఎందుకండీ క్యారేజి తెప్పిస్తాగా!"

"అలాకాదు. ఆవిడకి కాస్త నియమం, నిష్ఠవున్నాయి. అంచేత మాతోపాటే ఎంగిలిపడుతుంది. చాలా సందడిమనిషి" అన్నారు.

సుబ్రమణ్యానికి లోపల హమ్మయ్య అనిపించినా పైకిమాత్రం—

"మీకెందుకండీ శ్రమ. ఆవిడ అన్నీ తెచ్చుకుంది. అంతగా అయితే ఇక్కడే వుడకేసుకు తింటుంది"

"ఎదురుచెప్పక... ఆవిడ సరేనంది. అంచేత నువ్వాఫీసుకెళ్ళు. ఆవిడ గురించి ఆలోచించక" అనేసి వెళ్ళిపోయారు.

'బామ్మా! ఎంత తెలివిగా, తొందరగా ఏర్పాటు చేసేసుకున్నావ'ని అనుకుంటూ ఆఫీసుకి వెళ్ళిపోయాడు.

సాయంత్రం తిరిగొచ్చేసరికి ఆవరణలో సందడే లేదు.

రామసూర్యంగారిల్లు తాళం వేసుంది.

సుబ్రమణ్యం గది తలుపులు తెరచి వెళ్ళి మంచంపైన కూలబడ్డాడు.

ఒళ్ళు బడలికగా వుంది. కళ్లు మంటలుగా వున్నాయి.

కాస్సేపటికి బయటికెళ్ళినవాళ్ళు గలగల

మనుకుంటూ వచ్చారు.

సుబ్రహ్మణ్యం అంతా గమనిస్తూనే వున్నాడు. బామ్మ తనని చూసి లోపలి కొస్తుందని ఆశించాడు. కాని ఆవిడ వాళ్ళతోపాటు పగలబడి నవ్వుతూ వాళ్ళ ఇంటివేపే వెళ్ళిపోతోంది.

'హమ్మా! బామ్మా! ఎంత చిత్రమే? పరిచయంలేనట్లు పక్కకి తప్పుకుపోతున్నావా?' అనుకుని రోషంగా, "బామ్మా! ఓమారిలా రావే" అంటూ కిటికీలోంచి కేకవేసేడు. వెడుతున్న ఆవిడ తిరిగొచ్చి, "కచేరినుంచి వచ్చావురా! భోంచేసేవా?" అంటూ లోనికొచ్చింది.

"అదికాదే ఉదయం వచ్చినదగ్గిర్నించీ వాళ్ళని పట్టావు. అసలు నాతో ఒక్క మాటన్నా మాట్లాడేవా? అసలు వచ్చింది వాళ్లింటికా...నాదగ్గరికా?"

బామ్మగారు అతడి కోపంచూసి ముసిముసిగా నవ్వుకుంది.

"నేనోపనిమీదొచ్చాన్రా అబ్బి! వచ్చిన దగ్గర్నించీ అదేపన్లో వున్నా"

"ఏం పనే...నాకు చెప్పనేలేదు"

ఆవిడ తిరిగి నవ్వింది.

"పిచ్చివెధవా! నాకు ఉత్తరం రాశావ్ గుర్తుందా? ఏంరాశావ్..ఇంటివాళ్ళమ్మాయి అంటే నాకిష్టం అని...అవునా?"

అవునన్నట్లు తలూపి, "అయితే ఆ ఉత్తరం డబ్బాలో పడేశానన్నమాట'' అన్నాడు సుబ్రహ్మణ్యం.

"మరి వాళ్ళెలాంటివాళ్ళో, పరిస్థితులేమిటో, ఆ పిల్ల ఎలాంటిదో తెలియాలంటే మరి వాళ్ళతో కలిసిపోయి కనుక్కోవాలి''

సుబ్రహ్మణ్యం తొందరపడ్డందుకు చిన్నబుచ్చుకున్నాడు.

"ఇంతకీ నీ అభిప్రాయం ఏవిటే?"

"దేన్ని గురించి?"

"అదేనే...ఆ పిల్లగురించి"

"చెబుతాలేగాని, మూటవిప్పి రెండు జంతికలు, ఆ మూటలోవి రెండు సున్నుండలు బయటకి తియ్యి''

సుబ్రహ్మణ్యం ఆ పన్లో లీనమయ్యాడు.

బామ్మగారు మంచంపైన సర్దుకు కూర్చుని—

"పిల్ల నువు చెప్పినట్టు బుద్ధిమంతురాలే. పనివంతురాలు కూడాను. సంసారపక్షంగా బాగానే వుందిగాని..."

సుబ్రహ్మణ్యం తినుబండారాలని ఆవిడకందించి "ఊ.. కానీ''రెట్టించి అడిగాడు.

"కట్నం పెద్దగా ఇచ్చుకోలేదట్లేవుంది. బీదరుపులు అరుస్తున్నాడు.''

"కట్నం ఎవడిక్కావాలే వెధవ కట్నం.''

"అలా అనబోకు అక్కడ మీ నాన్న నీకు పెళ్ళిచేస్తే బోల్డంత కట్నం వస్తుందని ఎదురుచూసి లెక్కలేస్తున్నాడు"

సుబ్రహ్మణ్యం దిగులుగా "మరెలాగే?" అన్నాడు.

మనవడి ఆత్రంచూసి ఆవిడ ముచ్చటపడింది. గడచిపోయిన కాలం గుర్తుకొచ్చింది.

"ఇంతకీ-అసలు నువ్వంటే ఆ పిల్ల కిష్టమేనా?"

"ఏమో...నాకేం తెల్సు! నేనెప్పుడూ అడగందే"

బామ్మగారు బ్రేవ్‌మని తేన్చింది. "సరే..రేపుఇక్కడేదో వెంకటేశ్వరస్వామి గుడుందిటగా ... అక్కడికి తీసుకెళ్ళు"

సుబ్రహ్మణ్యం ఏదో అనబోతుండగా హనుమాయమ్మగారొచ్చి, 'రండి..భోజనం వడ్డించాను" అనటంతో బామ్మగారు లేచి ఆవిడ వెనకే గుసగుసా వెళ్ళిపోయింది.



# 5

ఎవరో తలుపు బడబడా తట్టిన శబ్దంతో గాఢనిద్రలోవున్న సుబ్రమణ్యం వులిక్కి పడి లేచేడు.

బామ్మగారు పడకకూడా వాళ్ళింట్లోనే ఏర్పాటుచేసుకుంది. పెద్దపెద్ద గదులు, మంచాలు, పరుపులు, ఫ్యాన్లు-కాదనలేక పోయింది. అంచేత సుబ్రమణ్యం ఒక్కడే గదిలో పడుకుంటున్నాడు.

తలుపుతట్టిన శబ్దం అవటంతో బామ్మే అయ్యుంటుందని లేచి కళ్ళు నులుము కుంటూ వెళ్ళి తలుపు తీసేడు.

కాని వాకిట్లో పతంజలిగారు నిల్చు న్నున్నారు. మట్టలాగు, స్పోర్ట్సు బనీను, తెల్లకేన్వాస్‌బూట్లు. క్రితంరోజు రమణి పెట్టిన ముగ్గుకి మధ్యగా నిల్చుని కదం తొక్కుతున్నారు.

"మీరా!" అన్నాడు ఆశ్చర్యపోతూ.

"అవునోయ్! మీ బామ్మగార్ని మా ఇంటికి తీసుకువస్తానన్నావ్ రాలేదు. కసు క్కుందామని ఇవ్వాళ ఇటువైపు పరిగెట్టు కొచ్చా"

"రండి...ఇలా కూర్చోండి. బామ్మని పిలుస్తా''అంటూకుర్చీని ముందుకిలాగాడు.

"అబ్బే! నేనుదయంపూట క్షణంకూడా కూర్చోనోయ్" అంటూ కదం తొక్కు తూనే వున్నారు-మారంచేస్తున్న పిల్లవాడి లాగా.

సుబ్రమణ్యం కళ్లు నులుముకుంటూ రామసూర్యంగారింటివైపుగా వెళ్ళేడు. అప్పటికే బామ్మగారు లేచి స్నానపానాలు, కాఫీ టిఫిన్లు పూర్తిచేసి రామసూర్యంగారికి తను విన్న భాగవతంలోని సన్నివేశాలు వివరించి చెబుతోంది. ఆయన గచ్చుపైన కూర్చుని మొక్కల ధ్యాసగూడా మరచి మూగగా వింటున్నారు.

"బామ్మా! ఓసారి ఇలారా. ఆయ నొచ్చారు'' అన్నాడు.

పరలోకంలోవున్న పతిదేవుడు దిగొచ్చాడన్నంత ఆశ్చర్యంగా మొహం పెట్టి, "ఎవర్రా వచ్చింది?" అనడిగింది.

నిద్రమత్తు పూర్తిగా వదలని అతడికి పతంజలిగారి పేరు చప్పున గుర్తుకొచ్చింది కాదు. అంచేత విసుగ్గా "అబ్బ...ఇట్రావే" అన్నాడు.

ఇహ తప్పదన్నట్లు చెబుతున్న భాగోతాన్ని, వింటున్న రామసూర్యం గార్ని అక్కడే వదలి లేచొచ్చింది.

పతంజలిగారు అత్యంత ఉత్సాహంగా పుష్యమాసం హరిదాసులా చిందులు వేస్తున్నారు.

''ఎవర్రా వచ్చింది''

''ఇదిగో ఈయనే'' అని పతంజలి గార్ని చూపించాడు.

ఆయన్నోక్షణం కన్నార్పకుండా చూసి''అదేవిట్రా!అలా గెంతుతున్నాడు. చీమలపుట్టలోగాని కాలు పెట్టేడా'' అనడిగింది హాస్యంగా.

సుబ్రమణ్యం ఆమాట వినిపించుకోనట్టు-

"పతంజలిగారని- నాన్న ఫ్రెండు'' అని ఆయన్తో "మా బామ్మగారండి''

"నేగుర్తున్నానా బామ్మగారూ?" అనడిగారు పనాపకుండానే.

"అబ్బే ... లేదునాయనా" అంది. ఎందువల్లనో ఆవిడ కాస్త భయపడి నట్లుగా వుంది వాలకం.

"అప్పట్లో శేషు, నేనూ కలిసి తిరిగే వాళ్ళం. మీరు నాచేత రహస్యంగా ఇడ్లీ పొట్లాలు తెప్పించుకునేవాళ్ళు"

బామ్మగారి కేవిషయమైనా తిండి పరంగా చెబితే ఇట్టే అర్థమవుతుంది.

"అవునవును .... గుర్తుకొచ్చింది. కులాసానా? అయ్యో...అలా హైరానా పడుతూనే వున్నావ్. ఓ క్షణం కూర్చొ పోయావా"

"ఉదయంపూట నిలకడగా కూర్చొ నండి. వ్యాయామం చేయిస్తాను. చేస్తాను. అసలు మనిషికి గాలి, నీళ్ళు, తిండిలాగా వ్యాయామం కూడా చాలా అవసరం. కాని మనవాళ్ళు గుర్తించి చావరు. అదే విదేశాల్లో అయితే ఇది సర్వసాధారణం. అక్కడ ఆడా మగా అంతా కలిసే ఈత కొట్టటాలు, పరిగెత్తడాలు చేస్తారు. ఇక్కడ సపోజ్...మీరు, నేను పరిగెత్తాం అనుకోండి వింతగా చూస్తారు! అదీ సంగతి"

"ఈమాట చెప్పటానికా నాయనా... పొద్దున్నే పాపం పరిగెట్టుకొచ్చావ్" అంది బామ్మగారు.

సుబ్రమణ్యం వాళ్ళ సంభాషణని వినటం లేదు. నిల్చునే కునుకు లాగిస్తు న్నాడు.

"అబ్బే...కాదండి! మీరు రావటం చూసాను. మా ఇంటికి తీసుకురమ్మని మీవాడికి చెప్పాను. కాని రాలేదు. గుర్తుచేసి పోదామని ఇలా వచ్చాను"

బామ్మగారు సంబరపడిపోయింది.

"అలాగే ... తప్పకుండా వస్తాలే నాయనా! మా సుబ్బులికి చెప్పండి నాకు దారి తెలీదు" అంది.

పతంజలిగారు సుబ్రమణ్యం వైపు చూపు తిప్పి "ఏవోయ్... ఎప్పుడొస్తావ్?" అనడిగారు.

సుబ్రమణ్యం రెండు క్షణాలాలో చించి 'రేపాదివారంనాడొస్తామండి' అన్నాడు.

"సరే... ఆరోజు మా పిల్లని కారిచ్చి పంపుతా...అందులోరండి" అని బామ్మ గారికి మరోమాట చెప్పి వీధిలోకి త్వర పడ్డారు.

ఆయన వెళ్ళిపోయాకగూడా బామ్మ గారు చాలాసేపు ఆయన గురించే ఆలోచించింది- 'ఇంకానయంకార్లో రమ్మ న్నాడు, పరిగెట్టుకురమ్మనకుండా' అనుకుంటూ గదిలోకెళ్ళింది.

సుబ్రమణ్యం అప్పటికే మొహం కడిగి స్నానానికెళ్ళాడు,

బామ్మగారు ఘోషాపెట్టెని తెరచి వస్తువుల్ని, బట్టల్ని సర్దుకుంటోంది.

సుబ్రమణ్యం స్నానం చేసొచ్చాడు. బట్టలేసుకున్నాడు. తల దువ్వుకున్నాడు. సరిగ్గా అప్పుడే గుర్తుకొచ్చింది- ఆరోజు ఆఫీసు ఇన్‌స్పెక్షన్ జరగబోతున్నట్లు, ప్రతిరోజుకంటే త్వరగా రమ్మన్న సంగతి.

టైము చూసుకున్నాడు- తొమ్మిదింపావు!

తాళాన్ని చేతిలోకి తీసుకున్నాడు.

మూలగా కూర్చుని పెట్టె సర్దుకుం టున్న బామ్మ సంగతి బుర్రలో అడు క్కెళ్ళిపోయింది.

తలుపులు దగ్గరగా లాగాడు.

మరుగుకోసం తలుపు మూస్తున్నాడను కుని బామ్మగారు తన పనిలో తానుంది.

సుబ్రమణ్యం గడియపెట్టి తాళం

వేసి లాగి చూసుకుని, గేటుదాటి రోడ్డు ఎక్కాడు.

జరిగింది తెల్సుకుని బామ్మగారు చివుక్కున లేచి కిటికీ దగ్గరకొచ్చేసరికి సుబ్రమణ్యం వీధి దాటేడు.

* * *

సాయంత్రం ఆఫీసయ్యాక ఇంటిదారి పట్టి తోవలో టీ తాగుదామని ఇరానీ హోటల్లోకెళ్లాడు సుబ్రమణ్యం.

పక్క టేబులు వద్ద కూర్చున్న వాళ్లు వెంకటేశ్వరస్వామి గుడిని గురించి మాట్లాడుకోవటం విన్నాక వెంటనే బామ్మ ఆ సాయంత్రం గుడికి తీసుకెళ్ళమని అడిగిన విషయం చప్పున గుర్తుకొచ్చింది.

టీ తాగి చకచకా బయటికొచ్చి ఆటోని పిల్చి ఎక్కి కూర్చున్నాడు.

అప్పటికి బామ్మగార్ని గదిలో బంధించిన ధ్యాసే లేదు.

గది ముందుగా ఆటో దిగి, డబ్బులు ఇచ్చి గేటు తీసుకుని లోనికెళ్లాడు.

కన్పిస్తున్న దృశ్యం చూస్తూ అలాగే చలనం లేకుండా నిల్చుండిపోయేడు. బామ్మగారు కిటికీలో కూర్చునుంది. బోనులో పెట్టిన సింహంలాగా గుర్రు గుర్రుమంటోంది.

బయట కిటికీ పక్కగా కుర్చీవేసుకుని రమణి కూర్చుంది- బామ్మగారికి ధైర్యం చెబుతోంది.

సుబ్రమణ్యానికి అప్పుడర్థమైంది, జరిగిన తప్పు.

పెద్దగా నవ్వాలనుకున్నాడుగాని బలవంతాన ఆపేసుకున్నాడు.

చాలా సీరియస్సుగా వెళ్ళి తాళం తీసేడు.



రమణి ముసిముసి నవ్వులు నవ్వు తోంది.

తలుపులు తెరిచేసరికి బామ్మగారు బుసలుకొడుతూ నిల్చునుంది.

సుబ్రమణ్యం వెంటనే చేతులు పుచ్చు కుని, 'పొరపాటైపోయిందే క్షమించవే' అన్నాడు.

"ఓరి నీ మతిమరుపు బంగారంగాను! ప్రాణం తీసేవుగదరా... తిండి తిప్పల్లేక చచ్చేను" అనుకుంటూ జైలునుంచి విడు దలయినట్లుగా బయటకొచ్చి నిలబడింది.

"అన్నం తినలేదా? వండుకోలేక పోయావా?"

"ఎలా వండుకునేది ? అయినా ఓపూట వుపవాసం మంచిదిలే అనిచెప్పి ఆ జంతికలు, చేగోడీలు తిని నీళ్ళు తాగా. పాపం పిచ్చిపిల్ల పొద్దుట్నించి ఈ కిటికీ దగ్గిర్నించి కదిల్తేదికాదు"

"అదికాదే''

"ఛ మాట్లాడక. ఓసారి గదికి తాళం వెయ్యటం కూడా మర్చిపోయావుట! మన ఇంటావంటాలేదు... ఈ మతిమరుపు. నీకె క్కడ్నించొచ్చిందిరా" అని దీర్ఘాలు రాగాలు తీసింది.

పక్కన నిలబడి వాళ్ళ సంభాషణంతా వింటున్న రమణి కలగజేసుకుంటూ-

"ఇంకా మీరు అదృష్టవంతులు బామ్మ గారు... గుర్తుపెట్టుకుని గదికొచ్చేరు" అందిచిలిపిగా సుబ్రమణ్యంవంకచూస్తూ.

"నిజం చెప్పావు మాత ల్లే!నా ఆయుష్షు కూడా నువ్వే పోసుకో. అలా జరిగుంటే చచ్చుండేదాన్ని" అంది భయంగా బామ్మ గారు.

సుబ్రమణ్యం సంభాషణ మారుస్తూ, "సరే... గుడికెళదామన్నావుగా పద" అన్నాడు.

"అవున్రోయ్... ఆ మాటే మర్చి పోయాను"

సుబ్రమణ్యం, రమణి ఇద్దరూ పగల బడి ఒకేసారి నవ్వారు.

"దేనికర్రా అలా నవ్వుతారు?" అంది అర్థంకాక.

"అదికాదే మతిమరుపు మన ఇంటా వంటా లేదన్నావుగా! నువ్వే మర్చి పోయావుగా"

బామ్మగారు నిండుగా నవ్వింది.

రమణి లోనికెళ్ళిపోయింది.

"అమ్మాయ్ నువ్వూరా గుడికి. పక్కన నువ్వుంటే నాకు ధైర్యం. ఈ మతి మరుపు వెధవ ఎక్కడ మర్చిపోయి వచ్చేస్తాడో"

రమణి పస్తాయించింది.

సుబ్రమణ్యం కూడా "ఫరవాలేదు రండి! బామ్మా వాళ్ళమ్మగారికి చెప్పిరావే" అన్నాడు.

పావుగంట తర్వాత ముగ్గురూ దేవాలయానికి బయలుదేరారు.

* * *

విశ్రాంమందిరంలో రద్దీ ప్రతిరోజు కన్నా తక్కువగా వుంది.

స్వామివారి దర్శనం పూర్తిచేసుకుని ముగురూవిశాలమైనమంటపంలోకొచ్చారు.

"గుడిమాత్రంఎంతోచక్కగా,హాయిగా వుందిరా అబ్బీ" అని మనమణ్ని మెచ్చు కుంది బామ్మగారు, అక్కడికి సుబ్ర మణ్యమే దగ్గరుండి ఆ దేవాలయ నిర్మాణం చేయించినట్లుగా.

ముగ్గురూ పాలరాతి గచ్చుపై కూర్చు న్నారు.

"ఒరే.. సుబ్బులూ! ప్రాణం సొలేసుకు పోతోంది. వెళ్లిలింటానికేవన్నా పట్రా" అంది బామ్మగారు.

"కాని ఇక్కడ అరటిపళ్ళు, హారతి కర్పూరంతప్ప ఇంకేం దొరకవే! అయినా ఆ జంతికలు, చేగోడీలు, చల్లమిరప కాయలు, అప్పడాలు, వడియాలు అన్నీ తిన్నావుకదే" అన్నాడు సుబ్రమణ్యం నవ్వుతూ.

"ఏం తిన్నా భోజనం సాటిరావురా! వెళ్ళి ఏదో ఒకటి పట్రా"

రమణి మౌనంగా కూర్చుని అంతా గమనిస్తోంది.

సుబ్రమణ్యం ఇహ తప్పదని లేచి మెట్లుదిగికిందకొచ్చేడు. కనుచూపుమేరలో తినదగ్గపదార్థాలేమున్నాయాని పరిశీలనగా చూసేడు. మిర్చిబజ్జీలు తప్ప మరేం కనిపించలేదు.

రెండు రూపాయలవి వేడివేడిగా పొట్లం కట్టించుకుని తిరిగి పైకెళ్ళాడు.

బామ్మగారు లేరు. రమణి ఒక్కర్తే కూచునుంది.

"బామ్మేది?"

రమణి చెయ్యి చూపించినవేపు చూసాడు సుబ్రమణ్యం.

బామ్మగారు కొత్తదంపతుల మధ్యన కూర్చునుంది. వాళ్ళకేదో నూరిపోస్తోంది. తదేకంగా వింటూ ఆవిడకి కొబ్బరి ముక్కలు, అరటిపళ్ళు అందిస్తున్నారు వాళ్ళు. వాటినారగిస్తూనే అనర్గళంగా మాట్లాడుతోంది.

సుబ్రమణ్యం రమణి పక్కగా చతికిల పడుతూ, "ఇహ బామ్మ అక్కడ సెటిలై పోయింది. వాళ్ళ ప్రసాదం, సహనం పూర్తిగా హరిస్తేనేగాని రాదు. ఇంద ఇవి తీసుకో" అంటూ పొట్లంవిప్పి రెండు బజ్జీలనందించాడు.

"అబ్బే... వద్దు"

"ఫర్వాలేదుతీసుకో...చల్లారిపోతాయ్. వేడిగా వున్నప్పుడే ఏదయినా రుచి"

రమణి చురుగ్గా అతడివేపు చూసి "అబ్బో... చాలా విషయాలు తెల్సే" అంది కొంటెగా.

"అవును. నాకు చాలా విషయాలు తెల్సు-కాని పైకలా కన్పించను"

"అది మీ టెక్నిక్కా?" అంది సినిమా డైలాగు గుర్తుచేసుకుంటూ.

"కాదు చిన్నప్పట్నించి అంతే" అని చేతిలో మిర్చిని సగం కొరికాడు. చుర్రు మంది. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయ్.

"అద్సరే నిన్నోవిషయం అడుగుతా! నిజం చెబుతావా?"

"ఏదీ...నాకిచ్చిన బజ్జీ కారంగా వుందా లేదానా" అంది ముసి ముసి నవ్వుల్తో.

సుబ్రమణ్యం చూపుని కాస్సేపు ఆమె పైనే నిలిపిచూసేడు.

"అంతకుమించి అడగటానికి విషయాల్లేవనా నీ ఉద్దేశం"

రమణి మాట్లాడిందికాదు.

"నేనో అతిముఖ్యమైన సంగతి అడగబోతున్నా! బాగా ఆలోచించి సమాధానం చెప్పు"

రమణి వూపిరి బిగపట్టి వింటోంది. నిజానికి అతడడగబోయే విషయం ఆమెకి తెల్సు. అడిగితే బావుండుననికూడా అనుకుంది. కాని అడుగుతాడనిగాని, అతడికంత ధైర్యం వుందనిగాని వూహించింది కాదు.

సుబ్రమణ్యం పరిస్థితీ అలాగేవుంది. ధైర్యంచేసి బామ్మ పుణ్యమాని మాట కలిపాడేగాని అసలు సంగతి అడగాలంటే ఏదో గొప్ప ఇబ్బందిగా వున్నట్లనిపించింది. తనలోతాను ధైర్యాన్ని కూడగట్టుకుని పెదవి విప్పబోతుండగా-

బామ్మగారి మాటగా కొత్త పెళ్ళికొడుకొచ్చి, "ఆవిడ మిర్చి, బజ్జీల పొట్లం తెమ్మంటున్నారండి" అనడిగి చేతులు కట్టుకు నిల్చున్నాడు.

సుబ్రమణ్యం ఆవైపుగా చూసేడు.

బామ్మగారు పొట్లం పంపించమని సంజ్ఞల ద్వారా ఆత్రంగా చెబుతోంది.

సుబ్రమణ్యం చేతిలోవున్న పొట్లం అతడికందించాడు. కొత్త పెళ్ళికొడుకు కదిలి వెళ్ళిపోయేడు.

సుబ్రమణ్యం జారిపోయిన ధైర్యాన్ని తిరిగి కూడదీసుకోటానికి కొద్దిసేపు పట్టింది.

రమణికి ఆశాభంగం అయి కాస్త అనుమానం కూడా కలిగింది – కొంపతీసి చెప్పదామనుకున్న విషయాన్ని మర్చిపోయాడాని.

అంతలో అతడు విషయాన్ని ప్రారంభిస్తున్నట్లు, "నేనడగబోయే విషయం చాలా ముఖ్యమైనదని చెప్పాకదూ. అరమరికలు, మొహమాటం లేకుండా నీ వుద్దేశం చెబితే సంతోషం"

మళ్ళీ రమణి వూపిరి బిగించింది. ఆ ఒక్కమాటకోసం ఎదురుచూస్తోంది.

సుబ్రమణ్యం చిన్నగా దగ్గి "నా గురించి..."

అంతలో ఆ కొత్త పెళ్ళికొడుకు మళ్లీ వచ్చేడు. "ఆవిడ ఇంకో రెండ్రూపాయలవి తెమ్మన్నారండి" అన్నాడు వినయంగా నిలబడి.

సుబ్రమణ్యానికి కోపం చర్రుమంది. పానకంలో పుడకలా మాటిమాటికి అడ్డొస్తున్న అతడిపైన, పరోక్షంగా కారకురాలైన బామ్మపైన గొప్ప కోపంవచ్చింది. జేబులోంచి పర్సుతీసి అతగాడికందిస్తూ –

"ఆవిడకి ఎన్నిరూపాయలవి కావాలో కొని మేపండి. కాని క్షణక్షణానికి అడ్డు రాకండి" అన్నాడు.

వచ్చిన కొత్త పెళ్ళికొడుకు తెల్లబోయేడు. "అబ్బే డబ్బులగురించి కాదండి నేనొచ్చింది. ఎక్కడ దొరుకుతాయో కనుక్కుందామని. అంతే!" అని తిరిగి పర్సుని సుబ్రమణ్యానికందించేడు.

సుబ్రమణ్యం అలా విరుచుకుపడ్డందుకు విచారపడ్డాడు.

"మెట్లుదిగి కిందికెడితే ఎడంవైపుకు వెళ్ళ బడ్డీపక్కనున్నాయి" అన్నాడు.

అతడెళ్ళిపోయాడు.

సుబ్రమణ్యం బామ్మవైపు చూసేడు. గుండె ఝల్లుమంది.

ఇక్కడేదో గొడవ జరుగుతోందని కాబోలు బామ్మగారు అక్కణ్ణించి లేచి మెల్లిగా వస్తోంది.

తను చెప్పాలనుకున్న సంగతి చెప్పనే లేదు. బామ్మ రానేవస్తోంది. ఇటువంటి అవకాశం మళ్ళీ రాకపోవచ్చు. చెప్పెయ్యాలి... టైంలేదు.

"నువ్వంటే నాకు చచ్చేటంత ఇష్టం. ప్రేమిస్తున్నాను... పెళ్ళికూడా చేసుకోవాలనుకుంటున్నాను. మరి నీ పరిస్థితేమిటి? ప్రేమిస్తున్నావా? పెళ్ళాడతావా? అదిగో బామ్మ వచ్చేస్తోంది. అంచేత ఆలోచించి నీక్కూడా ఇష్టమైతే రేపు నా గదిముందు రథం ముగ్గుపెట్టు, ఇష్టంలేని పక్షంలో ఏ ముగ్గూ పెట్టొద్దు–గుర్తుంచుకో" గడగడా పాఠం అప్పగించినట్లుగా చెప్పేశాడు.

బామ్మగారొచ్చేసింది. తలకాయ లొంచుకుర్చున్న వాళ్ళిద్దర్నీ చూసింది.

గొడవపడ్డారా, మాటా మాటా అనుకున్నారా? సర్దాగా దగ్గిరవుతారని వదిలి వెళ్ళటం తప్పయిందా?

"ఏవిరా సుబ్బులూ! అలా మొహాలు

తిప్పుకొస్తున్నారు" అంది పక్కనే కూర్చుంటూ.

సుబ్రమణ్యం తలెత్తాడు. ముందు రమణి వంక చూశాడు. చాలా సీరియస్సుగా, దూరంగా కనిపిస్తున్న సిటీదీపాల్ని చూస్తోంది. భయం వేసింది- కోపంగాని వచ్చిందాని.

తర్వాత బామ్మ వంక చూశాడు.

"అదికాదే... వాళ్ళిద్దరూ మొదటిసారి పెళ్ళిచేసుకుని మొదటిసారిగా గుడికొస్తే నువ్వెళ్ళి వాళ్ళ మధ్య దూరి ఏదో నూరి పోశావ్"

"అబ్బే... నేనేం చేశారా! వాళ్ళిద్దరూ పెళ్ళయ్యాక వెడతారు ఏవిటది?"

"హనీమూన్"

"అదే... ఆ పనిమీదొచ్చారట. నాకు తెల్సిన వివేకానందుడి గురించి, పరమ హంస గురించి రెండు సంగతులు చెప్పానంతే" అంది చాలా తేలిగ్గా.

"హనీమూన్లోవున్న వాళ్ళకి మన్మధుడి గురించి, మల్లెపూల గురించి చెప్పాలి గాని పరమహంస గురించికాదే. పాపం... అతగాడు నిజంగా బజ్జీలకనే వెళ్ళాడో లేక మనసు విట్టి సన్యాసం పుచ్చుకో టానికో" అన్నాడు.

బామ్మగారు భళ్ళున నవ్వింది.

కాని రమణి నవ్వింది కాదు. లేచి నిలబడింది.

సుబ్రమణ్యానికి భయం అధికమైంది.

ముగ్గురూ ఇంటిదారి పట్టేరు.

* * *

సుబ్రమణ్యానికి రాత్రి నిద్రపట్టింది కాదు.

తను విషయం చెప్పగానే ఎందుకలా సీరియస్గా మారిపోయింది? తప్పుగా అర్థం చేసుకుందా? లేక తనేపొరబడ్డాడా?

రమణి కావుద్దేశమే లేదా?

గది ముందు ముగ్గులు పెట్టడాలు, గది సర్దటాలు, బట్టలు వుతికి ఇస్త్రీ చెయ్యటాలు- ఇవన్నీ కేవలం పాపం మతిమరుపు పిల్లాడనే జాలివల్లనేనా... వేరే ఏం కాదా?

ఉదయం లేచి గదిముందు రథంముగ్గు లేకపోతే తన కర్తవ్యమేమిటి?

అనుకున్నవి, వూహించుకున్నవి చెరిపేసి చిత్తు కాగితంలాగా బతకాలా? అసలివన్నీ మర్చిపోగలడా? దేవుడు మతిమరుపు తన దురదృష్టాన్ని మర్చిపో టానికే ఇచ్చాడా?

అ స్తవ్యస్తమైన ఆలోచన్లు- అర్థంకాని టెన్షన్.

రాత్రిలో చాలా భాగాన్ని ఆలోచన తోనే గడిపాడు. చివరి జాములో తెలీకుండానే నిద్రలోకి జారేడు.

ఆకాస్త నిద్రలోనే చిత్రమైన కలలు-

పతంజలిగారు తనని తరుముకొస్తు న్నట్లు... శ్రీలేఖ ఎగతాళిగా తనని చూసి నవ్వుతున్నట్లు.... బామ్మ నువ్వెవరి పిల్లాడివని అడిగినట్లు... రామసూర్యం గారింట్లోకి వయసులో వున్న కుర్రాళ్ళు వరుసగా వెడుతున్నట్లు... రమణి వేరే ఇంకొకరి గదిముందు ఏడుస్తూ ముగ్గు పెడుతున్నట్టు... ఆ గది గుమ్మంలో నిల్చున్న కుర్రాడు పెద్దగా నవ్వు తున్నట్లు...

మళ్ళీ మెలుకువ వచ్చేసరికి తెల్లారి పోయింది. వెలుగు పూర్తిగా వచ్చేసింది. కాని చాలాసేపు అలానే పడుకునున్నాడు- లేచే ధైర్యం లేక.

లేవక తప్పదని, పచ్చినిజాల నుంచి పారిపోయి బతకాలంటే కుదిరేపని కాదని

కొద్దిక్షణాలకే తెల్చుకున్నాడు. వెంకన్నని స్మరించుకుని మంచందిగేడు.

చేతులు గది తలుపుల్ని పుచ్చుకున్నపుడు సన్నగా వణకటం గమనించాడు. ఇప్పుడు తెరవబోతున్న ఈ తలుపులు గదివి కావు. తన భావి జీవితానివి. కాని దాని స్వరూపం ఎలాంటిదో తెలీదు.

మనసు చిక్కబట్టుకుని, ధైర్యం తెచ్చుకుని తలుపుల్ని మెల్లిమెల్లిగా తెరిచాడు. ఏమీ కనిపించింది కాదు. అంతా చీకటి.

గది తలుపులతో పాటు, కళ్లు కూడా తెరవాలని కాసేపటికి అర్థమై, కళ్ళు మెల్లిగా, మెల్లి మెల్లి గా... అతిమెల్లి గా... పూర్తిగా తెరిచి చూశాడు.

ముందుగా అతడికికనిపించిందిరమణి. మొహమంతా చెమటలు దిగ్గాపతున్నాయ్. జుట్టు చిందరవందరగా పరచుకునుంది. మొహంలో అలసట. చేతిలో ముగ్గుడబ్బా. గేటు దాటి బయటిదాకా తీసుకెళ్ళింది ముగ్గుని-- రథం ముగ్గుని. ఇంకా పూర్తి కాలేదు. రథం పూర్తయింది. ఇక జయ పతాకాన్ని దిద్దాలి.

సుబ్రమణ్యాన్ని చూడగానే ఆ పని పూర్తి చెయ్యకుండానే సిగ్గుతో పరిగెత్తు కెళ్ళింది ఇంట్లోకి.

సుబ్రమణ్యం గది గుమ్మం వద్ద మొదలయి, రోడ్డెక్కిన రథం ముగ్గుని ఆప్యాయంగా చూసుకున్నాడు. సంతోషాన్ని ఆపుకోలేకపోయాడు.

"బామ్మా"అని పెద్దగా అరచి జయ పతాకాన్ని ఎగరేశాడు.

బామ్మగారు ఒక్కపరుగున గదివద్ద కొచ్చింది. ఆవిడవెంటే రామసూర్యంగారు, భార్యాకూడా హడలుకుంటూ వచ్చేరు.

"ఏమైందిరా సుబ్బులూ?"అనుకుంటూ వచ్చింది బామ్మ.

సుబ్రమణ్యం ముగ్గులోకి దిగేడు. మొహం లక్షకాండిల్సు బల్బులా వెలిగిపోతోంది. ఆపుకోలేని సంతోషంతో–

"బామ్మా ముగ్గుపడిందే! రథంముగ్గు పడిందే!" అంటూ చిందులు తొక్కుతున్నాడు.

అక్కడున్న మిగతా ముగ్గురికీ ఈ ముగ్గు కథేవిటో అర్థమైందికాదు.

"ముగ్గుపట్టం ఏవిట్రా సుబ్బులూ? నాన్నా! కలతనిద్దర్లో లేచావా ? లోపలికి పద"అంది రెక్కపుచ్చుకుని బామ్మగారు.

సుబ్రమణ్యం సర్దుకున్నాడు. సంతోషాన్ని, ఆవేశాన్ని బలవంతాన అణచుకుంటూ కలత నిద్దట్లోంచి లేచినట్లు 'నేనెక్కడున్నాను' అనడిగాడు అమాయకంగా.

"వీథిలో వున్నావ్. పదపద" అంటూ లోనికి నడిపించుకెళ్ళింది.

ఇంట్లోకెడుతూ హనుమాయమ్మగారు భర్తతో, "ఆ పిల్లడికి రవ్వంత పిచ్చిగాని వుందా? కాకపోతే ముగ్గుపడిందే అంటాడేవిటి?" అనడిగింది అమాయకంగా,

రామసూర్యంగారు సమాధానమివ్వలేదు.

సిగ్గుతో, ముగ్గుడబ్బా చేత్తోపుచ్చుకుని ఎదురొచ్చిన కూతుర్ని, 'ముగ్గుపడిందే' అని అరచిన సుబ్రమణ్యాన్ని–ఈ రెండు సన్నివేశాలని కలిపి ఆలోచిస్తున్నారు.

అప్పట్నించి రామసూర్యంగారిలో అనుమానం మొదలైంది.

కూతురు అతడివంక చూస్తున్నపద్ధతి, అతగాడి ప్రస్తావన రాగానే కనబడే వుత్సాహం, అతడి గదిముందు ప్రతి రోజూ వూడ్చి ముగ్గులు పెట్టడాలు, బామ్మ

గారినడ్డం పెట్టుకుని గుళ్ళకి గోపురాలకి వెళ్ళటాలు...

రమణి అతడంటే మనసుపడుతోందా? మరి అతడి పరిస్థితేవిటి?

అతడూ ముచ్చటపడుతున్నాడా... పెళ్ళిచేసుకుంటాడా?

చేసుకుంటానంటే చిక్కేలేదు. కాని అతడికా వుద్దేశం బలంగాలేనపుడు పిల్ల వూహల్లోవుంటే సరిదిద్దాల్సిన బాధ్యతుంది కదా!

కాబట్టి అతగాడి వుద్దేశాన్ని కనుక్కోవాలి.

'ముగ్గుపడిందే ముగ్గుపడిందే...' అని అరచిన అతడి కేకలు కేవలం నిద్రకళ్ళన అన్నవి కావని వాటివెనుక నిగూఢమైన అర్థముందని అర్థమైందాయనకి.

ఆ రాత్రి సుబ్రమణ్యం గదిబయట కూర్చునుండగా రామసూర్యంగారెళ్ళి అతడి పక్కనే చేరారు.

"ఏవిటోయ్, అంతలా అరిచావుద యాన... హడలి చచ్చేమనుకో"

సుబ్రమణ్యం తడబడ్డాడు. నిజానికి వున్నదున్నట్లు ఆయనతో చెప్పేయ్యొచ్చు. కాని విని ఆయనెలా రియాక్టవుతాడో, 'ఛ...నువ్విలాటివాడివా?, అంటాడేమో! రమణిని బయటకి రాకుండా కట్టడిచేస్తాడేమో! లక్ష సందేహాలు.

రామసూర్యంగారికి అనుమానంలో అర్థభాగం అర్థమైంది.

"అవునూ... వుదయం మీ ఆఫీసు కొచ్చేను ఎక్కడా కనిపించలేదే?"

"ఎన్నింటికొచ్చేరు? ఏంపనిమీదొచ్చేరు"

"చిన్నపని.ఆ చూడామణిని ఒకసారి చూసి మాట్లాడిపోదామని వచ్చేను"

సుబ్రమణ్యం గుండెల్లో పిడుగు పడింది. మొహంలో నెత్తురు, ఒంట్లో ఓపిక, గుండెల్లో ధైర్యం మాయమైనాయ్. ఆయనవంక వెర్రిగా చూసేడు.

ఆ పరిస్థితి చూసేక రామసూర్యం గారికి మిగిలిన అర్థభాగం అనుమానం కూడా అర్థమైంది.

ఈ కుర్రాడు రమణిని ప్రేమిస్తున్నాడు. ఈ విషయం వెంటనే భార్యతో చర్చించాలి.

రామసూర్యంగారు చివాల్న అక్కడ్నించి లేచి ఇంటివైపుగా వెళ్ళేరు.

ఆయనలా చెప్పాపెట్టకుండా లేచి వెళ్ళటానికి సుబ్రమణ్యం ఇంకోలా అర్థం చెప్పుకున్నాడు.

తాను చూడామణి విషయంలో చెప్పిన వన్నీ అబద్ధాలని ఆయనకి తెల్సిపోయింది. అందుకే అలా కోపంగా వెళ్ళిపోయారు. రేపు గది ఖాళీచేసి పొమ్మంటాడా? అంటే ఏవిటి?

ఆయనా మాట చెప్పకముందే తనా మాట చెప్పేస్తే?

తను చెప్పటంకన్నా బామ్మచేత చెప్పిస్తే?

సరిగ్గా అదే సమయానికి బామ్మగారు గదిలోకొచ్చింది పక్కింటినించి.

"భోంచేశావురా సుబ్బులూ" అనుకుంటూ వచ్చింది.

"బామ్మా... నాకో చిన్న సహాయం చెయ్యాలే"

"ఏవిట్రా అది..."

"అలా కూర్చో చెబుతా" అన్నాడు. బామ్మగారు కూర్చుంది.

"అదికాదే మొన్న రామసూర్యంగారు వాళ్ళమ్మాయికి సంబంధం పట్టుకొచ్చేరు. అతడూ మా ఆఫీసులోనే పన్చేస్తాడు. కుర్రాడెలాంటివాడో వాకబు చెయ్యమని

నన్నడిగాడు... సరేనన్నాను"

బామ్మగారు శ్రద్ధగా వింటోందని గమనించి చెప్పుకుపోతున్నాడు.

"నిజానికి ఆ కుర్రాడు బంగారం లాటివాడు. కాని అలా అని చెబితే ఎక్కడ ఆ సంబంధం స్థిరపరుస్తారోనని అబద్ధాల్చెప్పాను"

"ఏమని?''

"ఆ కుర్రాడు పరమ దుర్మార్గుడని, జూదం, తాగుడు వ్యభిచారం- వగైరా లున్నాయని చెప్పా"

బామ్మగారు జడ్జీలాగా నిటారుగా కూర్చుని వింటోంది

"సరే... ఇప్పుడేమైంది?"

"ఉదయం రామసూర్యంగారు ఆఫీసుకొచ్చి స్వయానా ఆ కుర్రాడితో మాట్లాడేరట"

"అయితే నీకెందుకు భయం?''

"ఆమాట చెప్పి చటుక్కున లేచెళ్ళి పోయారు. అబద్ధాలాడేనని కోపం వచ్చింది. ఆ కోపంకొద్దీ రేపు గది ఖాళీ చెయ్యమంటే?"

"అంటే ఇంకో గది చూసుకో! ఈ వూళ్ళో గదులే దొరకవా?"

సుబ్రమణ్యానికి కోపంవచ్చింది- తన ఆవేదన ఆవిడ అర్థం చేసుకోనందుకు.

"బామ్మా! నిజంగా నీకు బుర్రలేదే" అన్నాడు దంతాలు కరుస్తూ.

"పిచ్చివెధవా! బుర్రలేంది నాక్కాదు నీకే" అందావిడ.

"ఎలాగ"

బామ్మగారు సర్దుకూర్చుంది. హనుమాయమ్మగారు పెట్టిన అటుకులు బాయిదాల పద్ధతిలో నోట్లోకి విసురు కుంటూ మనవడికి ఎందువల్ల బుర్ర తక్కువో చెప్పసాగింది.

"ఆ పిల్ల నీకు నచ్చింది, పెళ్ళికూడా చేసుకోవాలనుకున్నావ్ అవునా?''

"అవును...అయితే?"

"ఆ పిల్ల తండ్రి ఒక సంబంధం తెచ్చి ఆ కుర్రాడి గుణగణాలని గురించి కాస్త వాకబుచేసి పెట్టమనడిగాడు ... అవునా?''

"అబ్బ...అవునే...తర్వాత''

"ఆ తర్వాత ఆ కుర్రాడు మంచి వాడని చెబితే ఎక్కడ ఆ పిల్ల మెడలు విరిచి ఆ కుర్రాడికి కట్టబెడతారోనని ఆయనతో అబద్ధాలు చెప్పావ్... అవునా?''

"నే చెప్పిన విషయాలే మళ్ళీ నాకు చెబుతావేమే?"

"వస్తున్నా పిచ్చి వెధవ! ఆ పిల్ల కూడా నువ్వంటే మనసుకుదిరిందనుకో మీ ఆఫీసులో కుర్రాడినేకాదు, ఈ జిల్లా కలక్టర్ని తెచ్చి నిలబెట్టినా నచ్చలేదని మొహం తిప్పేసుకుంటుంది. అర్థమైందా?"

"అంటే...''

"అంటే దాన్నే మీ కుర్రాళ్ళు ప్రేమని పిల్చుకుంటారు. మా రోజుల్లో 'రాసిపెట్టుంది' అనే వాళ్ళం"

"నిజమేనే.నాకంత ఆలోచనే పోలేదే''

సుబ్రమణ్యం సిగ్గుపడ్డాడు - ప్రేమలో ప్రాథమిక సూత్రాన్నికూడా పట్టుకోలేక పోయినందుకు.

"అనవసరంగా అబద్ధం ఆడి హైరానా పడ్డావ్. అంచేతే నీకు బుర్రలేదని ఢంకా బజాయించి చెప్పేను''

ఆ క్షణంలో అతడికి బామ్మ సాధారణ మైన బామ్మలా కాకుండా పరబ్రహ్మ స్వరూపంలా అనిపించి-

"సరే...ఇప్పుడేం చెయ్యమంటావ్?" అనడిగాడు.

''చేసేందుకేముంది. రేపు ఆయన గది



ఖాళీచెయ్యమంటే – 'చెయ్యనండి పైగా మీ పిల్లని పెళ్ళి చేసుకుంటానని గూడా చెప్పెయ్యి"

"అమ్మో...ఆయనేమంటాడో?"

"ఏమీ అనడు. ఎగిరి గంతేసి ఒప్పేసుకుంటాడు. నీలాంటి కుర్రాడు దొరకాలంటే మాటలా? బంగారం లాంటివాడివి నీకేం తక్కువని కాదంటాడు? కాలొంకరా చెయ్యొంకరా? చదువు, నౌకరీలేనివాడివా? ఇంతకన్నా ఎక్కువాడొస్తాడా ఆ నల్ల పిల్లకి"

బామ్మగారికి భోజనంవేళ దగ్గరౌతున్న కొద్దీ కోపం ఎక్కువవుతూవుంటుంది.

"పోనీ ఆయన గది ఖాళీ చెయ్యమనకముందే చెప్పేస్తే బావుంటుందేమో?"

"ఏమని...గది ఖాళీచేస్తున్నాననా? చెప్పెయ్యి అయితే"

"అలా అనికాదే! మీ పిల్లని..."

"చేసుకుంటాననా? చెప్పమరి ... ఆలోచన దేనికి?"

"నేనే చెప్పనా?" బేలగా అడిగాడు.

"పోనీ నేచెప్పనా" అంటూ లేచింది బామ్మగారు.

"బామ్మా...తొందరపడకే"

"ఓరి నీపెళ్ళి బంగారంగాను! నా ప్రాణాలు తాగేసేలా వున్నావ్! మళ్ళీ ఏమిటి?"

"కాని నాన్న ఏమంటాడో?"

"మీ నాన్నమాత్రం ఘనంగా కట్నం కావాలనుకుంటున్నాడు. మరి ఈయనేమో అరిటాకులిచ్చి, అటుకులు పెట్టి ఆ మూడు ముళ్ళూ వేయించేలా వున్నాడు. మీ నాన్నకి చెప్పకునే పూచీ నీదే" అంది.

6



రామసూర్యంగారు సుబ్రహ్మణ్యం గది నుండి ఒకసారి ఇంట్లోకెళ్ళారు.

కమల పడగ్గదిలో పక్కలు సరి చేస్తోంది. భార్య వంటగదిలో వుంది.

"ఆ గదిలో కుర్రాడులేడూ" అంటూ ప్రారంభించేరు."ఆ కుర్రాడి గురించి నీ అభిప్రాయం ఏవిటి?" అనడిగారు.

"కుర్రాడికేం... బంగారంలాటివాడు, బుద్ధిమంతుడు-దేనికి?"

"ఆ కుర్రాడు నీ కూతుర్ని చేసుకుంటానన్నాడనుకో. ఏమంటావ్?"

ఆశగా భార్యవంక చూస్తూ అడిగేడు.

"నెత్తిన పాలు పోసిన వాడవుతాడు. నిక్షేపంగా చేసుకోమంటాను" అంది.

భార్యకూడా ప్రోత్సాహంగా మాట్లాడే సరికి ఎక్కడలేని వుత్సాహంవచ్చి, ఇహ తను పరిశోధించి పట్టుకున్న విషయాన్ని చెప్పేశారు.

"ఆ కుర్రాడు, మన పిల్ల ప్రేమించుకుంటున్నారోయ్! ఉదయం అతడు పెట్టిన కేక మామూలు కేకకాదు. ప్రేమకేక. మన పిల్ల అతడి గదిముందు వేసిన రథం వాళ్ళ ప్రేమరథం... తెల్సునా?"

"సరే! ఇది చెప్పటానికా పిల్చింది" అని చాలా సాధారణమైన విషయాన్ని విన్నట్లుగా లోనికెళ్ళిపోబోయింది.

రామసూర్యంగారికి పౌరుషం పొడుచుకొచ్చింది.

"అంటే నీ దృష్టిలో ఇదంత తేలికైన విషయమా?"

"కాదుకాని.....ఈ సంగతి నాకెప్పుడో తెల్సును" అంది.

ఆయన ఆశ్చర్యం ప్రకటిస్తూ-

"ఏమిటీ... తెల్సునా?" అనడిగాడు.

"ఏనాడైతే అది ఆ పిల్లాడి బట్టల్ని వుతికి ఆరేసి ఇస్త్రీచేసి భద్రంగా తీసుకెళ్ళి ఇచ్చిందో ఆనాడే నాకంతా అర్థమైంది?"

"మరైతే నాకు చెప్పావుకాదేం?"

"దేనికైనా సమయం రావాలండీ - అంచేత వూరుకున్నాను"

భార్య తెలివితేటలకి మురిసిపోయారు.

కాసేపాగి, "అయితే ఇహ ఆలస్యం దేనికి? అతడి దగ్గరవాళ్ల నాన్న అడ్రస్సు పుచ్చుకుని ఒకసారివెళ్ళి చెప్పొస్తే బావుంటుందేమో?"

"అవును. బాగానే వుంటుంది"

"ఇవ్వాళతిథికూడా బావుంది. ఇప్పుడే చూచాయగాచెప్పి అడ్రసు రాయించుకొస్తా"అని అక్కణ్నించి కదిలారు.

"అందరికీ పెద్దావిడ బామ్మగారుండగా! ఆవిడక్కూడా ఒకమాటచెప్పండి" భర్తవెనకేవస్తూ సలహాఇచ్చింది హనుమాయమ్మగారు.

భార్యాభర్తలిద్దరూ సుబ్రహ్మణ్యం గది వైపుగా వస్తున్నారు.

ఇంకోవైపునించి మనవడి వుద్దేశాన్ని చూచాయగా చెప్పటానికి బామ్మగారొస్తోంది.

ఆవిణ్ని చూసి దంపతులు కాస్త తగ్గేరు.

వాళ్ళని చూసి బామ్మగారక్కడ ఆగిపోయింది.

కాస్త దూరంలోనే ఎవరికివాళ్ళు రెండో

వాళ్ళొస్తారని ఆగిపోయారు. కొద్దిక్షణాలు సందిగ్ధంలో గడిచాక హనుమాయమ్మగారే సంభాషణని ప్రారంభించింది "అబ్బాయి గదిలో వున్నాడా?" అని.

బామ్మగారు మెల్లిగా- "ఆ వున్నాడు పిచ్చివెధవ" అంది.

హనుమాయమ్మగారు గోడకి పెట్టున్న నులకమంచాన్ని వాల్చింది. బామ్మగారు ఒక పక్కన అంచుపైన కూర్చుంది. రామసూర్యంగారు ఇంకోపక్కన కూర్చున్నారు. హనుమాయమ్మగారు పక్కగా నిల్చుంది.

రామసూర్యంగారు గొంతు సవరించుకుని మెల్లిగా-

"మీరు పెద్దవారుకదా... ముఖ్యమైన సంగతి చెప్పాలని బయల్దేరా! అంతలో మీరే ఎదురైనారు"

బామ్మగారు అప్పటికి బయటపడకుండా డిప్లొమేటిక్కుగా 'ఏవిటి' అంది.

"అదే... మీ మనవడికి"

"సర్లెండి... ఆ విషయమా?" అంది బామ్మగారు మధ్యలోనే అంది పుచ్చుకుని.

"అవును. దాన్ని గురించే"

"మా వెధవకూడా జరిగిందంతా చెప్పేడు" అంది బామ్మ.

"చెప్పాడా! పోన్లెండి...పని తగ్గించాడు" అంది హనుమాయమ్మగారు.

"చిన్న వెధవలు...తెల్సితెలిక అనేకం చేస్తుంటారు. వాగుతుంటారు. వాటినన్నిటినీ మనం పట్టించుకోకూడదు" అంది బామ్మగారు మనవణ్ని బయటపడేసే ప్రయత్నంలో.

కాని ఆ మాట ఆ దంపతులకి పాయసంలో వుప్పుగడ్డలా అన్పించింది.

వాళ్ళిద్దరూ అయోమయంగా మొహం మొహం చూసుకున్నారు.

"అంటే మీరనేది..." అనబోయింది హనుమాయమ్మగారు.

కాని బామ్మగారందుకు అవకాశం ఇవ్వకుండా "నేచెబుతున్నాగా పెద్దదాన్ని. నామాటే ఖాయం. మీరటువంటివేం పెట్టుకోకండి. వాడు అందర్లాటి కుర్రాడు కాడు"

"అంతేనంటారా...కుర్రాడు బుద్ధిమంతుడుకదాని ఆశపడ్డాం. ప్చ్... ప్రాప్తం వుండాలి దేనికైనా" అంది హనుమాయమ్మగారు నిరాశగా.

సరిగ్గా బామ్మగారికి అప్పటికిగాని వెలిగిందికాదు. వెంటనే విషయాన్ని పసిగట్టి ధోరణి మార్చింది.

"ఆశపడి వూరుకుంటే సరిపోతుందా! అడగొద్దూ! అలా నులకమంచంపై కూర్చుని నీళ్ళు నవుల్తే సస్తాపురాయా" అంది గట్టిగా.

ఆవిడ మాటలో వచ్చిన మార్పు చూసి వాళ్ళిద్దరూ ఆశ్చర్యపోయారు.

"అడుగుదామనే వచ్చాం. కాని మీరు అటువంటివేం పెట్టుకోవద్దనేసరికి నీళ్ళు కారిపోయాం" అన్నారు రామసూర్యంగారు.

"అలా అనటంలో నా వుద్దేశం మనలో మనం చిన్నచిన్న విషయాల దగ్గర పట్టింపులేం పెట్టుకోవద్దని. అంతేగాని మీరనుకున్నట్లుగా కాదు"

"అయితే మా రమణిని మీ మనవడికిచ్చి చెయ్యటానికి మీకేం అభ్యంతరాల్లేవుగా?" అనడిగాడాయన.

"మావాడికి మీ పిల్లంటే ఇష్టమే. శుభం...కానివ్వండి. మా అబ్బాయి అడ్రసు పుచ్చుకుని ఓకార్డు రాసి పడెయ్యండి. ఇహ ఎవ్వరూ ఏం మాట్లాడకండి...పదండి పొద్దుపోయింది"

ఆకలి దంచేస్తుండటంచేత ఆవిధంగా సభని ముగించింది బామ్మగారు.

ఆరోజు ఆదివారం—

పతంజలిగారింటికి వెళ్లాల్సినరోజు.

ఆ విషయం సుబ్రమణ్యం ఏనాడో మర్చిపోయాడు.

కాని బామ్మగారు భద్రంగా గుర్తుంచుకుంది.

"సుబ్బులూ! ఇవ్వాళ వాళ్ళింటి కొస్తానని చెప్పావు కదూ''

"ఎవరింటికి?'' పరధాన్యంగా అడిగాడు.

"అదేరా... నిక్కరు తొడుక్కుని పరిగెత్తుకుంటూ వచ్చాడూ?"

"పతంజలిగారా! అవునే... ఆ మాటే మర్చిపోయాను"

"త్వరగా పన్లు కానియ్యి. వెళ్లొస్తే సరిపోతుంది. నాన్నకూడా మరిమరి చెప్పాడు"

సుబ్రమణ్యం చకచకా పనులు పూర్తి చేసుకున్నాడు.

బామ్మగారు కూడా తయారైంది.

కాఫీలు, టిఫిన్లు వేళకి ఘనంగా ముడుతున్నాయ్. వియ్యాలవారి మర్యాదలప్పుడే మొదలైనాయ్.

రమణి ఇదివరలా సుబ్రమణ్యంముందుకి రావటంలేదు. సిగ్గువల్ల తప్పుకు తిరుగుతోంది. కాని పన్లుమాత్రం వేళకి జరిగిపోతున్నాయ్. కాని అతడికి ఆమె కళ్ళబడకపోవటం పెద్దలోటుగానేఅన్పించింది. కొన్నాళ్లు చెప్పకుండావుంటే బాగుండేదని చిరాకుపడ్డాడు.

తొమ్మిదయింది.

బామ్మగాను దొడ్లో బాతాఖానీలో ఉంది. సుబ్రమణ్యం గదిలో పచార్లు చేస్తున్నాడు. రామసూర్యంగారు మొక్కల మంచిచెడ్డలు విచారిస్తున్నారు.

అంతలో గేటుముందు కారాగింది. దానిలోంచి శ్రీలేఖ దిగింది.

ఆమె రాత్రి తొడిగిన నైట్‌గౌన్ మార్చిందికాదు. అలాగే వచ్చేసింది. వయసు పొంగులని ఆ గౌన్ దాచలేపోతోంది.

జుట్టుని పైకి లేపి నీలంరంగు రిబ్బన్‌తో ఆర్టిస్టిక్కుగా కట్టింది.

లక్నో చెప్పుల్ని చప్పుడు చేసుకుంటూ గేటుదాటి లోనికొచ్చింది.

సుబ్రమణ్యం ఆమెని చూడగానే ఎందువల్లనో వులిక్కిపడ్డాడు.

"హాయ్... యంగ్‌మాన్! వేరీజ్ గ్రాండ్‌మదర్" అంటూ మంచంపైన విసురుగా కూలబడింది.

"దొడ్లోవుంది" అన్నాడు పొడిగా.

"డాడీ మిమ్మల్నిద్దర్నీ పట్టుకురమ్మని పంపించారు.కమాన్...త్వరగా వెడదాం" అంది.

సుబ్రమణ్యం వెళ్ళి బామ్మగార్ని పిల్చుకొచ్చేడు.

"మా బామ్మ" పరిచయం చేసేడు. శ్రీలేఖ విష్‌చేసింది.

బామ్మగారు రెండు క్షణాలు ఆమెవంక వింతగా చూసింది.

"వెడదాం పదండి! డాడీ మీ గురించి వెయిట్ చేస్తుంటారు'' అని బయటికొచ్చి మొక్కల్ని పరీక్షగా వొంగుని చూస్తోంది.

అంతలో రమణి బక్కెట్టుతో నీళ్ళు తెచ్చి మొక్కల పాదుల్లో పోస్తోంది.

శ్రీలేఖ రమణివంక రెండు క్షణాలు పరీక్షగా చూసింది. ఆమె అప్పటికే స్నానంచేసి వాయిల్‌చీరె కట్టుకుంది. తల దువ్వుకుంది. తల్లో ఎర్రటి మందార పూవుని పెట్టుకుంది. తళతళా తోమిన

అమ్మవారి విగ్రహంలాగా వుంది.

శ్రీలేఖ కాస్సేపు ఆమెవంక చూసి, మాట కలపాలన్న వుద్దేశంతో తన ముందున్న మొక్కనిచూపిస్తూ, "వాటీజ్ దిస్ ప్లాంట్" అనడిగింది.

రమణి ఆమెవంక చూసింది. కాని ఆమె అడిగిన ప్రశ్న అర్థంకాక తెల్లగా చూస్తుండిపోయింది. కాని రామసూర్యం గారు బదులిచ్చారు.

"అది మామిడి మొక్క. కాయలు కాస్తుంది.. కాని పూలు పూయదు'' అని.

"అయ్‌సీ'' అంది సన్నగా నవ్వుతూ. రమణికూడా చిన్నగా నవ్వింది.

గదిలో బామ్మగారు చీరె సర్దుకుంటూ ''ఆ పిల్లకి ఆ గౌనేవిట్రా సుబ్బులూ?'' అంది బాధగా. అక్కడికి సుబ్బులే ఆమెని పట్టి గౌన్ తొడిగినట్లు.

''పోన్లేవే! మనకెందుకే. వెదదాంపద అక్కడ అనవసరంగా మాట్లాడక'' అని హెచ్చరించాడు.

"నాకేం పని... అలాగే"

ఇద్దరూ బయటికొచ్చారు.

శ్రీలేఖ కారు వెనకడోర్‌తీసి బామ్మగార్ని కూర్చోమంది. ఆవిడ ముసిముసిగా నవ్వుకుంటూ ఎక్కింది. సుబ్రమణ్యం కూడా ఆవిడవెనకే ఎక్కబోయాడుకాని శ్రీలేఖ అడ్డుపడింది.

"నేనేం డ్రయివర్నికాను. వచ్చి ముందు కూర్చోండి''

సుబ్రమణ్యం ముందు సీట్లో ఒక పక్కకి వొదిగిపోయి కూర్చున్నాడు.

రామసూర్యంగారు, రమణి అక్కడే నిల్చుని అంతా గమనిస్తున్నారు.

కారుని స్టార్టు చెయ్యబోతూ, శ్రీలేఖ పక్కనున్న సుబ్రమణ్యంపైనించి వొంగి తలుపుని సరిచూసుకుంది.

ఆమె ఒంటిపైనించి మంచి గంధపు వాసన గుప్పుమంది.

కారు కదిలింది.

బామ్మగారు కార్లోంచి వీధుల్ని, మనుషుల్ని విచిత్రంగా చూస్తోంది.

శ్రీలేఖ కారు డ్రయివ్‌చేస్తూ కూడా ఒక కంట సుబ్రమణ్యాన్ని గమనిస్తూనే వుంది.

అతడు భయంతో ఒకమూలగాముడిచి పెట్టుకుని మూటలా కూర్చోటం ఆమెకి నవ్వు తెప్పించింది.

"కాస్త ఇటువైపుకి జరగండి, లెఫ్టు సైడు బరువెక్కువయింది" అంది సీరియస్‌గా.

సుబ్రమణ్యానికి అర్థంకాలేదు. జట్కా బళ్ళకి, ఎద్దుబళ్ళకి బరువుని బాలన్సుచేసే గొడవుంటుందని తెలుసునుకాని, కార్లకి వుంటుందన్నట్లుగా తెలీదు. కాని వెంటనే ఏమో ఎవడికి తెల్సుననుకుంటూ ఆమెకి కాస దగ్గరగా జరిగాడు. అయినా బిగించుకునే కూర్చున్నాడు.

కాసేపటికి కారు పతంజలిగారి ఇంటి ముందాగింది.

శ్రీలేఖ దిగి, బామ్మగారి సదుపాయం కోసం తలుపుతీసి పుచ్చుకుంది. అప్పటికే సుబ్రమణ్యందిగి నిల్చున్నాడు.

ఆరోజు ఆదివారం కావటంచేత వ్యాయామశాల సందడిగా వుంది.

"డాడీ–డాడీ'' అంటూ పెద్దగా పిలిచింది అక్కణ్ణించే.

"యస్... లేఖా డియర్'' అన్నారు పతంజలిగారుకూడా వున్నచోటునించే.

"గ్రాండ్ మమ్మీ అండ్ గ్రాండ్ యంగ్‌మాన్ ఎరైవుడ్" అంది టెలిగ్రాం ఇచ్చినట్లు.

పతంజలిగారు షెడ్డులోంచి బయటి

కొచ్చేరు.

ఆయన తన యూనిఫాంలోనే వున్నారు. ఆయనతో పాటు ఇంకో వ్యక్తి కూడా బయటికొచ్చారు. సుబ్రమణ్యం అతిగిని గుర్తించాడు-క్రితంసారి వచ్చి నపుడు బోసుబాబుగా పరిచయం చేయబడ్డ వ్యక్తి.

పతంజలిగారు అక్కణ్నించి పరిగెత్తు కుంటూ వచ్చారు.

"వచ్చారా... నమస్కారం" అని బామ్మకి దణ్ణం పెట్టుకున్నాడు.

బామ్మగారు స్వీకరించినట్లు నవ్వింది.

పతంజలిగారు కూతురితో, "పైకెళ్ళి పాలు కాగాయేమో చూసి ఇతడికివ్వు. వాళ్ళందరికీ పోస్తాడు" అన్నారు.

శ్రీలేఖ అలాగేనని కారు తాళాలు వేలితో గిరగిరా తిప్పుకొంటూ శబ్దంచేస్తూ వెళ్ళింది. బోసుబాబు ఆమె వెంటే వెళ్ళాడు.

సుబ్రమణ్యం వాళ్ళిద్దరి వంక చూస్తుండగా, బామ్మగారు ఇంటిని, ఆవరణని, పక్కనున్న షెడ్డుని అదే పనిగా చూస్తోంది.

అది గమనించి పతంజలిగారు- "ఈ స్థలం, ఇల్లు నా పెంపుడు తండ్రి ద్వారా సంక్రమించింది. ఆ షెడ్డు మాత్రం ఈమధ్యనే వేయించాను" అన్నారు.

"అదేమిటి... గొడ్లసావిడా?" అంది బామ్మగారు షెడ్డుని చూపి.

సుబ్రమణ్యానికి భయం వేసింది. ఎక్కడ పతంజలిగారికి కోపం వచ్చి ఇద్దరిచేత పద్మాసనం వేయిస్తాడోనని.

కాని ఆయనకి కోపం రాకపోగా, చాలా నమ్రమతగా తన గురించి చెప్పుకో సాగాడు.

"లేదమ్మా! నేను ఆసనాలు వేయటం నేర్పిస్తాను. వ్యాయామం చేయిస్తాను. అందుకోసం పెద్దపెద్ద వాళ్ళొస్తుంటారు. వాళ్ళకోసం! అన్నట్లు మీ వయసెంత?" అనడిగాడు.

"డెబ్భై దాటినాయ్ నాయనా"

"మనం పూర్వకాలం వాళ్ళం కాబట్టి ఇంత వయసొచ్చినా ఇంకా లేచితిరుగుతూ మన కాళ్ళపై మనం నిలబడి, మన చేతుల్తో మన పన్లు చేసుకుంటున్నాం. అదే ఈ కాలం కుర్రాళ్ళయితే ముప్పయి ఏళ్ళకే డీలాపడి పోతున్నారు. అందుకే చిన్నతనం నుంచి కూడా వ్యాయామం అవసరం ఎంతైనా వుంది- ఏమంటారు?" అనడిగాడు.

బామ్మగారు కాదనలేదని తలూపింది.

"రండి... ముందు నా స్టూడెంట్సుని చూసి ఆపైన ఇంట్లో కెళదాం" అని షెడ్డు వైపుగా దారితీసేరు.

బామ్మగారు ఎటువంటి సందేహము, సంకోచం, భయం లేకుండా ఆయన వెంట అదే వేగంగా నడుచుకుంటూ వెడుతోంది. సుబ్రమణ్యం తప్పక అనుసరించాడు.

ముగ్గురూ షెడ్డులోకి ప్రవేశించారు.

లోపల బాగా రద్దీగా వుంది. క్రితం సారి వచ్చినప్పటికన్నా జనం పెరిగి నట్లుగా గుర్తించాడు సుబ్రమణ్యం.

ఈసారి పతంజలిగారు అక్కడున్న వాళ్ళను పేరుపేరునాపరిచయంచేయలేదు.

కాని లోగడ చూసిన శీర్షాసనం చీఫింజనీరు, శవాసనం ఎమ్మెల్యే, సర్వాంగాసనం రచయితలతో పాటు నాలుగైదు కొత్త మొహాలు కూడా దర్శన మిచ్చాయి సుబ్రమణ్యానికి.

బామ్మగారు అక్కడ జరుగుతున్న ప్రదర్శనని నోరు వెళ్ళబెట్టి చూస్తోంది. తలకిందులుగా వున్నవాళ్ళు, నేలపైన

బిగదీసుకుని పడున్నవాళ్లు, వంగుని భూమిని తొలిసారిగా చూస్తున్నట్లు పరీక్ష చేస్తున్నవాళ్లు, కాళ్ళకింద నిప్పులున్నట్లు ఎగిరెగిరి పడుతున్నవాళ్ళు.

"వీళ్ళే నా స్టూడెంట్సు. పెద్ద పెద్ద ఉద్యోగస్తులు. ప్రతి ఆదివారంనాడు వచ్చి నా సమక్షంలో ప్రాక్టీసు చేస్తారు. కానీ పుచ్చుకోను. పైగా పాలు, బాదం పప్పు సప్లై చేస్తాను. ఎంతోమంది ఆరోగ్యం మందగించి, మొండికేస్తే నా వద్దకొచ్చి పూర్తి ఆరోగ్యాన్ని సంపాదించుకుని ఆంజనేయ భక్తుల్లా వూరంతా తిరిగేస్తున్నారు. అంతకన్నా నాకేం కావాలి... ఏవంటారు?" అంటూ ముగించారు.

బామ్మగారి మొహంలో ఇందాక లేని భయం కొద్దికొద్దిగా చోటు చేసుకో సాగింది.

"బామ్మగారూ...ఇంతకీ మీఆరోగ్యం ఎలా వుంది?"

పతంజలిగారెందుకడిగారోగాని బామ్మగారి మాటెలా వున్నా సుబ్రమణ్యానికి భయం వేసింది.

"మా బామ్మ ఆరోగ్యం గొప్పదండి! ప్రజలంతా మా బామ్మలాగా వుంటే దేశంలోని డాక్టర్లంతా వేరే పనులు చేసుకు బతకాలి" అన్నాడు ఆయన్ని నమ్మించే ధోరణిలో.

"ఓహో! అయితే నీ ఆరోగ్యమే బాగా లేదన్నమాట. క్రితంసారి వచ్చినప్పుడు కూడా అలానే అన్నావ్" అన్నారు సూటిగా, చురుగ్గా చూస్తూ.

సుబ్రమణ్యం వులిక్కిపడ్డాడు.

"అబ్బే...నా వొళ్ళు వజ్రంకదండి" అన్నాడు వర్రీగా.

"గుడ్ కీపిటప్! ఏదైనా ట్రబులుంటే మొహమాటపడక వచ్చెయ్"

సరేనన్నాడు, బ్రతుకుజీవుడా అనుకుంటూ.

బామ్మగారు ఇదేం పట్టనట్టు ప్రతి మనిషినీ పరీక్షగా చూస్తోంది.

కుర్రాళ్లుగా కనిపించినవాళ్ళని 'పెళ్ళయిందా నాయనా, మీ ఇంటిపేరేవిటని' అడుగుతోంది. కాస్త వయస్సు మళ్ళినవాళ్ళని 'పిల్లలా' అంటోంది.

బామ్మగార్ని అక్కణ్నించి బయటికి తీసుకెడితే మంచిదేమోనన్న ఆలోచన విచిత్రంగా పతంజలిగారికి వచ్చింది. ఈవిడవాలకం చూస్తుంటే తనచేత ఆసనాలేయించేట్టుందనిగూడా డౌటుపడ్డారు.

"సరే... పదండి మా ఇల్లు కూడా చూద్దురుగాని" అని ఆయన అనటంతో ముగ్గురూ బయటికొచ్చేరు.

బోసుబాబు పెద్ద స్టీలుగిన్నె నిండుగా వేడిపాలు తెస్తూ ఎదురయ్యాడు.

అతడివెనకే గాజుగ్లాసుల్తో శ్రీలేఖ.

వాళ్ళిద్దరూ దాటివెళ్ళిపోతుంటే పతంజలిగారు గుర్తింపుగా తలాడించేరు. బామ్మగారు ఆయనపక్కనే నడుస్తూ, "ఇంతకీ మీ ఆరోగ్యం ఎలావుంది?" అనడిగింది.

ఆ మాటకి పతంజలిగారు పడిపడి నవ్వేరు. 'పెద్దజోక్-సుపర్బ్' అని మెచ్చుకున్నారేగాని ప్రశ్నకి బదులిచ్చారు కాదు.

ఇంట్లోకి వెళ్ళగానే 'అన్నపూర్ణా... అన్నపూర్ణా' అంటూ భార్యని పిలిచేరు. ఆవిడ పక్కగదిలోంచి విసుగ్గా మొహం పెట్టి వచ్చింది. ఏదో అనబోయి కొత్త వ్యక్తుల్ని చూసి ఆ ప్రయత్నాన్ని విరమించుకుంది.

'మా శేషవాళ్ళమ్మగారు' అని,

'బామ్మగారితో-నాభార్యండి...పేరు అన్నపూర్ణ, భూదేవికున్నంత సహనం' అని పరిచయంచేసారు.

భర్త మాట వినగానే ఆవిడ మొహం విప్పారింది.

ఈయనకి ఆరోగ్యసూత్రాలతోపాటు వశీకరణం విద్యలుగూడా తెల్సునా అని చిన్న అనుమానం వచ్చింది సుబ్రమణ్యానికి.

అన్నపూర్ణమ్మగారు ఆదరంగా "రండి-ఇల్లుచూద్దురుగాని. ఒకసారి మీ మనవడొచ్చేడు. అబ్బో ఎంత సిగ్గోఆ పిల్లాడికి" అంటూ లోనికి దారితీసింది.

బామ్మగారు ఆవిడవెంటేలోనికెళ్ళింది.

పతంజలిగారు ఇప్పుడే వస్తానని ఆయన ప్రపంచంవైపుగా వెళ్ళారు.

"రండి... పైన నా గదిలో కూర్చుందాం" అంది శ్రీలేఖ వచ్చి.

''అక్కర్లేదు. ఇక్కడే వుంటా.

''ఓ... కోపం వచ్చిందా!సారీ" అని చెయ్యి పుచ్చుకు లాగింది.

సుబ్రమణ్యానికి పరిస్థితేవిటో అర్థం కాకుండా వుంది. అమాయకత్వమా, అదోరకం తెలివితేటలా? ఒళ్ళుపొగర్ని కప్పి పుచ్చుకునే విధానమా?

తప్పక లేచి ఆమె వెంటే పైకి వెళ్ళాడు.

అతణ్ణిఅక్కడే కూర్చోమని "ఒక్క క్షణంలో స్నానం చేసొస్తా" అంటూ టవలు భుజానవేసుకుని ఎటాచ్డ్ బాత్‌లో కెళ్ళి తలుపేసుకుంది.

సుబ్రమణ్యం బుద్ధిగా కూచ్చుని అందుబాటులో వున్న పుస్తకాలని తిరగేయసాగేడు. లోపల్నించి నీళ్ళ గల గలమని శబ్దం చేస్తున్నాయ్.

పది నిమిషాల తర్వాత తలుపు తీసుకు బయటికొచ్చింది. టవల్ని వొంటికి చుట్టుకుంది. భుజాలు పచ్చగా, నునుపుగా, పుష్టిగా వున్నాయ్. మొహంపైన అక్కడక్కడ నీటి చుక్కలు తళుక్కున మెరుస్తున్నాయ్.

సుబ్రమణ్యం చటుక్కున చువ్వలాగా లేచి నిల్చుని,చరచరా బయటికొచ్చేసేడు.

ఆమె కొంటెగా నవ్వి తలుపుని కొద్దిగా మూసింది. సుబ్రమణ్యానికి ఆమె మనస్తత్వం అంతు చిక్కటంలేదు.

అందరు మొగాళ్ళతోనూ ఇలాగే ప్రవర్తిస్తుందా లేక తనవద్దేనా? అలా ప్రవర్తించటం ఆమెకలవాటా లేక తనని చిన్న వెధవ కింద జమకట్టి, హార్మ్‌లెస్ క్రీచర్ కింద జమకట్టినందువల్ల అలా ప్రవర్తిస్తోందా?

కొద్దిక్షణాలతర్వాత ''యంగ్‌మాన్... ప్లీజ్ కమిన్'' అంటూ పిల్చింది.

సుబ్రమణ్యానికి వెళ్ళాలనిపించలేదు. కాని ఆమె తన సభ్యతని చేతకాని తనంగాను, పిరికితనంగాను అర్థం చేసుకుని మరింత చిన్నచూపు చూసే ప్రమాదం వుంది. అది అతడికిష్టం లేదు. అంచేత లోనికెళ్ళాడు.

ఆమె లోపలి లంగా తొడుక్కుంది. బ్లౌజు వేసుకుంది. కట్టుకోవలసిన చీర చేతిలోనే వుంది.

"కాస్త ఈ హుక్కు పెట్టండి. మా టైలరు ముసలివెధవ. వాడంటేనే నాకసహ్యం. కాని మా డాడీ జాలికొద్ది వాడికే ఇమ్మంటారు" అంటూ వచ్చి వీపుని అతడి వైపుగా తిప్పి నిల్చుంది.

సుబ్రమణ్యానికి గాభరాగా వుంది. 'ఎవరన్నా చూస్తే?'

వణుకుతున్న చేతుల్తో హుక్కుని

బిగించాడు. వేళ్ళకి తాకిన ఆమె చల్లటి ఒళ్లు వేడిని పుట్టించేలా వుంది.

"థాంక్స్" అంటూ చేతిలోవున్న చీరెని చుట్టుకుంది.

సుబ్రమణ్యం కర్చీఫ్‌తో పట్టిన చెమటలని తుడిచేసుకున్నాడు.

భోజనాల ఏర్పాట్లు జరిగినాయ్.

అన్నం తింటూ బామ్మగారడిగింది, "మీ పిల్లకి సంబంధాలు చూస్తున్నారా?" అని. పతంజలిగారు ఏం పట్టనట్లు మౌనంగా తింటున్నారు.

అన్నపూర్ణమ్మగారు నిట్టూర్చి "సరే... ఆయనకెంతసేపూ బస్కీలు, ఆసనాలు తప్ప ఆడపిల్ల గురించి ఆలోచనే వుండదు మీ బోటివాళ్ళు అడుగుతుంటేనైనా తెలిసొస్తుందేమో" అంది.

పతంజలిగారు తినటం ఆపి తలెత్తి భార్యవంక, బామ్మగారి వంక చూసేరు. ఇపుడాయన బస్కీలు తీసి, పరుగులెత్తి చిందులు తొక్కే పతంజలిగారు కాదు· ఆయన మొహంలో విచిత్రమైన మార్పొచ్చింది, గుండెల్లో ఏమూలో దాగున్న దిగులు, బాధ నల్లటి మబ్బులా మొహంలో కమ్ముకున్నాయ్.

ఆయన నిశ్చలంగా కూర్చుని దూరానెక్కడో చూస్తూ చెప్పసాగేరు.

"నాకిద్దరు పిల్లలు. ఒక మగా, ఒక ఆడ. మగపిల్లవాడు చదువుసంధ్యమానేసి ఏవో విప్లవాలంటూ తిరగటం మొదలు పెట్టేడు. వాడికోసం వేళగాని వేళల్లో మనుషులు వస్తుండేవారు. మొదట్లోనే హెచ్చరించాను. ఊహూఁ-విన్నాడుకాదు



వాళ్ళూ వీడిని వదిలాతుకాదు. బహుశా డబ్బుకోసం అయ్యుంటుంది. వాడి చేతికి డబ్బు అందకుండా జాగ్రత్తపడ్డాం. తాళాలు విరిచి తీసుకెళ్ళసాగేడు. ఒక రోజు నిలేశాను అంతే....మళ్ళీ పత్తాలేడు"

"అంటే ఇప్పుడు ఇంటికి రావటం లేదా?" అనడిగాడు సుబ్రమణ్యం.

"రాడు. ఎప్పుడో కొన్ని నెల్లకి ఓసారి రహస్యంగావచ్చి వాళ్ళమ్మచేత అన్నం పెట్టించుకుని తిని కాస్తోకూస్తో పైకం పుచ్చుకుపోతాడు. మళ్ళీ వచ్చేవరకు వాడి గురించి తెలీదు. వస్తే వున్నాడనుకుంటాం, రాకపోతే రాలిపోయాడనుకుంటాం" చివరి మాట అంటున్నప్పుడు ఆయన గొంతు కాస్త వణికింది.

"అలా అనకండి. పిచ్చివెధవ .... ఎక్కడున్నాడో ఏం చేస్తున్నాడో?" అన్నపూర్ణమ్మగారి కళ్ళల్లో నీళ్ల తిరిగాయి.

బామ్మగారు శ్రద్ధగా అన్ని విషయాలు వింటోంది.

పతంజలిగారు మళ్ళీ అన్నారు.

"ఇదంతా ఎందుకు చెప్పొచ్చాననంటే- వాడలా వెళ్లిపోయాక మిగిలింది ఒక్కర్తి- శ్రీలేఖ. దానికిప్పుడే పెళ్లి చేసి, సంసారం రొచ్చులోకి దించటం నాకిష్టం లేదు. కొడుకైనా కూతురైనా నాకు మిగిలింది ఈ పిల్లే. నాకూ ఆశలు, ఆశయాలు వున్నాయి. వాటినన్నిటిని తీర్చుకోవాలంటే నాకా పిల్లే ఆధారం. అంచేత దాన్ని బాగా చదివిస్తా. అది గొప్ప చదువులుచదివి పెద్ద వుద్యోగాల్చెయ్యాలి. మంచి హోదాగా, దర్జాగా బతకాలి....అది నాఆశయం. అంచేతే నేదాని పెళ్లి గురించి ఆలోచించటంలేదు"

ఎవ్వరూ కాసేపు మాట్లాడలేదు.

శ్రీలేఖ ఓరగా సుబ్రమణ్యం వంక చూస్తోంది. కాని అతడిచూపులు కంచంలో వున్నాయి.

కాస్సేపటికి అన్నపూర్ణమ్మగారంది- "ఎంత చదువు చెప్పించినా ఆడపిల్ల అన్నాక పెళ్ళిచెయ్యక తప్పదుగదా! అంతగా అయితే పెళ్లయ్యాక కూడా చదువుకోవచ్చు" అని.

బామ్మగారు 'నిక్షేపంగా' అని మాత్రం అంది.

పతంజలిగారు ఆ సలహాని పట్టించుకో లేదు.

భోజనాలయ్యాక కాసేపు పిచ్చాపాటి వేసి వెడతామని బయల్దేరారు బామ్మ, మనవడు.

అన్నపూర్ణమ్మగారు బామ్మగారికి చీర పెట్టింది.

బామ్మగారు ఒక పట్టాన పుచ్చుకుంది కాదు.

"పెద్దవారు ... రాకరాక వచ్చేరు - తీసుకోవాల్సిందే" అని వదలకుండా పట్టుబట్టడంతో తీసుకోక తప్పిందికాదు.

సుబ్రమణ్యాన్ని ప్రతివారం రమ్మని మరీమరీ చెప్పారు.

మళ్ళీ కార్లోనే శ్రీలేఖ వారిని గదివద్ద దింపింది.

కారాగిన చప్పుడు విని రమణి బయటి కొచ్చింది.

సుబ్రమణ్యం తలుపుతీసి లోనికెళ్లాడు. బామ్మ అలసటగా మంచంపైన వాలి పోయింది.

శ్రీలేఖ మాట్నీ సినిమాకెడదామని అడిగింది సుబ్రమణ్యాన్ని.

కాని రానన్నాడు. బామ్మగారు కలగ చేసుకుంది-"వెళ్ళిరా... నేకాసేపు పడు కుంటా-కాదంటే బావుండదు" అని

నచ్చజెప్పింది.

సుబ్రమణ్యం కారెక్కాడు. శ్రీలేఖ కారు స్టార్టుచేసింది.

రమణి చూస్తుండగానే కారు కనుమరుగైంది.

* * *

మరో మూడు రోజులకి బామ్మగారు తిరుగు ప్రయాణమైంది.

హనుమాయమ్మగారు ఇంకొన్నాళ్లుండమని బతిమాలింది. కాని బామ్మ ససేమిరా వీల్లేదంది.

బామ్మ వున్నన్ని రోజులు సుబ్రమణ్యానికి వసతిగాను, అత్తవారింట్లో వున్నట్లుగాను అనిపించింది. కాఫీ గ్లాసులు గదిలోకే వచ్చేవి. చిరుతిళ్లు, ఫలహారాలు అప్పుడప్పుడూ మొహం చూపించేవి. స్నానాలగదిలోకెడితే ఏర్పాట్లన్నీ సిద్ధంగా వుండేవి.

ఇవన్నీ బామ్మ చలవే. అందుకని అతడిక్కూడా బాధగానే వుంది.

రమణికీ దిగులుగానే వుంది. ఆవిడ ఎక్కడికెళ్లాలన్నా ఆమెనే వెంట తీసుకెళ్లేది. మనవడి గురించి ఎంతో సమాచారం, ఎన్నో సంగతులు చెప్పింది. పెళ్లయ్యాక ఎలా వుండాలో, ఈ మతిమరుపు మగాడితో ఎలా కాపురం చేసుకోవాలో చెప్పింది. అంచేతనే ఆవిడ ప్రయాణం అవుతుంటే దిగులుగా నిల్చుని కళ్ళకి నీళ్ళు కూడా తెచ్చుకుంది.

"మళ్లీ వస్తాగా. అయినా నే రావటం ఏవిటి నా మొహం..నిన్నే మా ఇంటికి తీసుకెడతాం. అన్నట్లు మావాడి పైన ఓ కన్నేసుంచు. గదిముందు ముగ్గులు పెట్టటం కాదు. మంచీ చెడుకూడా చూస్తుండు" అని తల నిమిరింది బామ్మగారు.

హనుమాయమ్మగారు కలగజేసుకుని, "మీ మనవడికేం ఫర్వాలేదు. మేం వున్నాంగా" అంది హామీపత్రం రాసిచ్చినట్లుగా.

రామసూర్యంగారు బస్టాండుదాకా వస్తానన్నారుగాని సుబ్రమణ్యం వద్దన్నాడు.

బామ్మగారు అందరికీ పేరుపేరునా వరసనా చెప్పి ఆటో ఎక్కింది.

తోవలో "నాన్నకి చెప్పవే. నువ్వు చెబితే కాదనడు. అడిగినంత కాకపోయినా వీళ్ళు కాస్తో కూస్తో కట్నం ఇస్తారు" అన్నాడు సుబ్రమణ్యం.

"సరేలే... చూద్దాం" అంది పరాగ్గా బామ్మగారు.

బస్టాండులో విజయవాడ బస్సు ప్రతిరోజులాగానే కిటకిటలాడుతోంది. వూరికెళ్ళేవాళ్ళే కాకుండా, దింపటానికొచ్చిన బంధుజనం కూడా బస్సులోకెక్కటం చేత గొప్పరద్దీగా వుంది.

సుబ్రమణ్యం బామ్మగార్ని, ఆవిడ భోషాణం పెట్టెని అతికష్టంపైన బస్సు లోపలకి రవాణా చేసేడు.

రామసూర్యం గారమ్మాయి సంసారపక్షం పిల్ల. బుద్ధిమంతురాలు. కాని పతంజలిగారు బాగా వున్నవాడు. వాళ్ళమ్మాయిని చేసుకుంటే కట్నం బాగా ఇస్తాడు. పైగా అందగాకూడా వుంటాడు. ఎలాగూవున్న ఆ ఒక్కడూ దేశాలుపట్టిపోయాడు కాబట్టి ఆస్తిగూడా దక్కుతుంది'' ఆవిడ గొంతు బస్సులోనేకాకుండా బయటంతా కూడా ఖంగుమని మోగుతుంది. జనమంతా ఇద్దరివంక మార్చి మార్చి చూస్తున్నారు.

సుబ్రమణ్యం అక్కణ్నించి పారిపోదామనుకున్నాడు.

అంతలో బస్సు కదిలింది.

## 7



బామ్మగారెళ్ళిపోయింది.

ఇన్నాళ్ళూ మైదాపిండిలా మనుషులందర్నీ పట్టుకొచ్చి అతికించిన ఆవిడ వెళ్ళిపోవటంతో తిరిగి అందరూ ఎవరి పన్లకివారు అంకితమైపోయారు.

రామసూర్యంగారు తిరిగి మొక్కల పోషణా కార్యక్రమాన్ని చేపట్టేరు. ఇప్పటికి నీకు గుర్తుకొచ్చామా అంటున్నట్లు, మొహాలు మాడ్చుకున్నట్లు వున్న చెట్లని చూసి కాస్త గిల్టుగా ఫీలయ్యేరు.

రమణి తన పన్లు తను చకచకా చేసుకుపోతోందిగానీ సిగ్గుచేత సాధ్యమైనంతవరకు సుబ్రమణ్యాన్ని తప్పుకు తిరుగుతోంది.

హనుమాయమ్మగారు ఎప్పటిలాగా వంటగదికి అంకితమైపోయింది.

కాని విచిత్రంగా శ్రీలేఖ తరచుగా వస్తోంది. ఆఫీసు వేళకొచ్చి కార్లో దింపుతానంటుంది. సెలవు రోజుల్లోవచ్చి సినిమా కంటుంది. రానంటే ఒకపట్టాన వదలదు.

రామసూర్యంగారి ఫ్యామిలీ సభ్యులు కూడా ఆపిల్ల తరచు రావటం గమనించేరు. పెద్దవాళ్ళ మాటెలావున్నా రమణికి మాత్రం ఆమె అలా రావటం, అతడిని కార్లలో తిప్పటం నచ్చింది కాదు.

సుబ్రమణ్యానికావిషయం చెప్పాలని కూడా అనుకుంది.

అలా అనుకుంటుండగానే—

ఒకరోజు—

ఆ ఉదయం ఆకాశం మబ్బులేసి సన్నటి చినుకుల్ని రాలుస్తోంది.

ఆ ఉదయంఆఫీసులక్కూడా సెలవు.

గాలి పిచ్చివాడి చెయ్యిలా వుండి వుండి విసురుతోంది.

వర్షంచేత, సెలవువల్ల సుబ్రమణ్యం గదిలోనే వుండిపోయేడు. పాత వారపత్రిక పేజీలు తిప్పుతున్నాడు.

శ్రీలేఖ సుడిగాలిలా గదిలోకొచ్చి నవ్వుతూ నిల్చుంది. ఆమె రాగానేగదంతా వింత సువాసన గుప్పుమంది.

ఆమెని తొలిసారి చూసి ఎంతకాలమయిందో అతడికి గుర్తులేదు. కాని ఆమెని చూసిన ప్రతిసారీ భయపడి, కంగారుపడటం మాత్రం గుర్తుంది.

"మీరా ఏమిటిలా వచ్చారు?" అంటూ లేచి నిలబడేప్రయత్నం చెయ్యబోయాడు. కొద్దిక్షణాలక్రితమే స్నానం చేసేడు. ఇస్త్రీలుంగీ కట్టాడు. కాని బనీనుతొడుక్కోవాలనుకుంటూనే మర్చిపోయేడు.

శ్రీలేఖని చూసేక గుర్తుకొచ్చిన మొదటి సంగతి అదే!

సుబ్రమణ్యం ఎర్రటి మనిషి. పొడగరి కాకపోవటంచేత ఛాతీవిశాలంగా కనిపిస్తుంది. ఎర్ర గుండెలపైన నల్లటి వెంట్రుకలు నాచు మొక్కల్లాగా విస్తరించి వుంటాయి. ఒళ్లు కండలు తిరిగి వుంటుంది. చేతులు ఉక్కుస్తంభాల్లాగ బలంగా వుంటాయి. అంత అమాయకుడికి అంతటి బలమైన మొరటు శరీరం విచిత్రంగా అనిపిస్తుంది-డబ్బు విలువ తెలీనివాడి దగ్గర కోట్లు కోట్లు మూలుగుతున్నట్లు.

సరిగ్గా అతణ్ణి, అతడి ఒంటిని,

వయసుని చూసినశ్రీలేఖఅచ్చంగా అలాగే అనుకుంది. అనుకుని అతడివంక తేరిపార చూస్తోంది.

సుబ్రమణ్యం సిగ్గుపడ్డాడు. వంటిపైన కప్పుకోటానికేంలేక ఇబ్బందిగా కళ్ళతోనే గదంతా వెతుకుతున్నాడు.

శ్రీలేఖ దగ్గరకొచ్చి అతడి పక్కనే భుజాలనానుకుంటూ కూర్చుంది.

వర్షం పెద్దదయింది. దూరాన్నెక్కడో ఆకాశం వురిమింది.

"మమ్మీ, డాడీ ఎవరింట్లోనో ఫంక్షనుంచే వెళ్ళారు. ఒక్కదానికీ బోరనిపించి ఇలా వచ్చేసాను'' అంది రాకకి కారణం చెబుతున్నట్లు.

సుబ్రమణ్యం లేచేడు. వెళ్ళి అద్దం దగ్గర తల దువ్వుకోసాగాడు.

"ఆఫీసుకి సెలవా?''

"అవును" తల దువ్వుకోటం పూర్తి చేసి బనీనుకోసం గాలిస్తున్నాడు.

''అబ్బ... ఇవాళ ఏవిటోగా వుంది'' అంది ఒళ్ళు విరుచుకుంటూ.

"అవునవును. నాకూ అలానే వుంది'' అనేసాడు.

శ్రీలేఖ చివుక్కున లేచి నిలబడింది.

''ఏవిటి మీకూ అలానే వుందా? అఫ్‌కోర్స్ అదంతే'' అంది ఖండితంగా.

శ్రీలేఖ నిల్చున్న స్థలంనించి కదిలి ముందుకొచ్చింది. అతడి చేతిలోవున్న బనీనుని లాగి దూరంగా గిరవాటేసింది. ఆపైన చటుక్కున అతడి గుండెలపై వాలిపోయి రెండు చేతుల్తో అతణ్ని పెనవేసుకుపోయింది. అతడిని అబగా, ఆత్రంగా తన ఒంటికి అదుముకుంటోంది.

అతడు జరిగింది తెల్సుకోవటానికి రెండు క్షణాలు పట్టింది. తనకావుద్దేశం లేకపోయినా తన ఒళ్లు వేడెక్కటం విచిత్రం అనిపించింది.

మొదటి ఆడస్పర్శ! బుసకొడుతున్న వయసు!

శరీరం కావాలంటోంది - మనస్సు తొందరపడద్దని పదేపదే చెబుతోంది.

నిగ్రహించుకోవటం కష్టంగా వుంది అతడికి.

ఒకే ఒక క్షణం ఆలోచించేడు.

ఏదయినా కావాలనుకుని, కలలుకని, కష్టపడి సాధించిన రుచివేరు. అనుకోకుండా, ఆయాచితంగా, అనాలోచితంగా, వచ్చిపడ్డ రుచివేరు. పదార్థం ఒకటే కావచ్చు, కాని రుచుల్లో తేడావుంటుంది. మొదటిదాంట్లో తృప్తి, నాది అన్న నిండుదనం వుంటాయి. రెండోదాంట్లో భయం భయం, ఇంకో మనిషికి సమయంవస్తే సమాధానంచెప్పాల్సిన బాధ్యతవుంటాయి. తనక్కావలసింది తృప్తి! భయం కాదు. నాది అనే నిండుదనం కావాలి. ఆత్రత లేకుండా అనుభవించటం తప్పు. మరుక్షణంలో-

సుబ్రమణ్యం శ్రీలేఖని బలంగా వెనక్కి తోసాడు.

ఇప్పుడతడిలో సంకోచం లేదు. సందిగ్ధంలేదు. అయ్యో అనుకునేందుకు నిస్పృహ లేదు.

శ్రీలేఖ మంచంపైన వెల్లకిలా పడింది. పమిట చెదిరింది. జుట్టు మొహాన పడుతోంది. అలాగే పడుకుని అతణ్ని పరీక్షగా చూస్తోంది.

సుబ్రమణ్యం బనీనుని తిరిగి వెతికి తెచ్చుకున్నాడు. వొంటికి తొడుకున్నాడు.

తలని తిరిగి దువ్వుకున్నాడు. మొహానికి పట్టిన చిరు చెమటల్ని తుడుచుకున్నాడు. వెనక్కి తిరిగి ఆమెవైపుగా

చూసేడు.

ఆమె అలాగే పడుకునుంది. పమిటని సర్దుకోలేదు. జుట్టుని సరిచేసుకోలేదు. అక్కణ్నించి లేచి నిలబడాలన్న ప్రయత్నం చెయ్యలేదు.

అతడివంక తదేకంగా చూస్తోంది.

ఆ చూపుల్లో ఆమెకర్థంకాని విషయమేదో స్పష్టంగా కనిపిస్తోంది. ఇంత కాలం తను ఎరిగిన కుర్రకాయ ప్రపంచానికి భిన్నమైన కుర్రాడు. కాలేజీలోను, బయట కూడా కుర్రాళ్ళు తనవంక, తన వంటివంక ఆత్రంగా, ఆశగా చూస్తారన్న సంగతి తెల్సు. అసలదే తనకి గర్వంగా వుండేది. వీలైతే ఏదో నెపంతో తాకాలని, మాట కలపాలని ప్రయత్నించటం తెల్సు.

కాని ఇతగాడు అందుకు విరుద్ధంగా తనకి తాను ఆహ్వానించి, ఆనందించమంటే నిరాకరించి దూరంగా అలా నిల్చుండిపోయేడేం? రుచీ పచీ తెలీని చప్పిడి కుర్రాడా?

తప్పు ఒప్పులని ప్రతి విషయాన్నీ తూకంకట్టే బాపతా? పెళ్ళి కాకుండానే సెక్సు మంచిది కాదనుకునే పాతకాలం వాడా?

"ఏవిటలా చూస్తున్నావ్?" అనే అతడి ప్రశ్నతో లోకంలో కొచ్చింది శ్రీలేఖ.

అప్పుడు పమిటని సరిచేసుకుంది. జుట్టుని వెనక్కి తోసుకుంది. మంచం పైనించి లేచి నిలబడింది.

"ఎందుకలా చేసేవ్?" అంది.

ఇప్పుడు వాళ్ళిద్దరూ ఏక వచనంలోనే సంభాషించుకుంటున్నారు. అర్థంలేని గౌరవ పదాల్లేవు.

"ఏంచేసేను?" గోడకానుకునిల్చున్నాడు.

"అదే...ఏం నేను అందంగా లేనా?"

"వున్నావ్"

"సెక్సీగాలేనా"?

"వున్నావ్"

"మరెందుకు వెనకాడేవు?"

"అందము, సెక్సేకాదు మనిషిక్కావలసింది. ఇంకా వున్నాయ్"

"ఏమిటవి?"

"నాది అనే హక్కులేని చోట చనువు తీసుకోవటం నాకిష్టంవుండదు"

"మా డాడీకి మనిద్దరికీ పెళ్ళి చెయ్యాలన్న వుద్దేశం వున్నట్లు నేగమనించాను"

సుబ్రమణ్యం చిన్నగా పచార్లు చేస్తూ "కాని నాకావుద్దేశ్యం లేదు. అందుకే నీవందించినదాన్ని నిరాకరించేను. నేనో పిల్లని ప్రేమించాను" అన్నాడు.

"ఎవరూ! ఆ ముగ్గులేసే పిల్లా?"

ఆమాట అంటున్నప్పుడు ఏదైనా వ్యంగ్య భావం వుందేమోనని ఆమెవంక చూసేడు. రమణి పేరు తెలీకే అలా అందని నిర్ధారించుకుని-

"అవును...ఆ పిల్లే. పెళ్ళి కూడా చేసుకోవాలని అనుకున్నాం. నిన్ను మోసం చేయటం ఇష్టంలేక చెప్పేస్తున్నా"

శ్రీలేఖ దెబ్బతిన్న పక్షిలాగా వుంది. తొందరపడ్డందుకు పశ్చాత్తాపంగా భంగపడ్డందుకు బాధగావుంది.

కాని అంతరాంతరాల్లో అతడంటే ఇది వరకు లేని గౌరవం.

"అసలు నేనంటే ఇష్టమేనా...ఒక్క మాట చెప్పు చాలు" ఆ మాటలో ఏదో బేలతనం. బోర్లాపడ్డా మీసాలకి మట్టి అంటుకోలేదని తృప్తిపడే అహంభావం.

"ఇష్టం వేరు, ప్రేమవేరు. అనేక మందిని ఇష్టపడొచ్చు. కాని ఒక్కళ్ళనే ప్రేమించేది. నువ్వంటే ఇష్టం వుందో

లేదో చెప్పలేనుగాని, అసహ్యం మాత్రం లేదు" శ్రీలేఖ అలాగే నిల్చుంది, అతడి వంక తీక్షణంగా చూస్తూ.

"తనకు తానుగా మనసు పడి వచ్చిన దాన్ని నిరాకరించిన మొగాణ్ని గురించి ఆడది ఏమనుకుంటుందో తెలుసా?" చిన్న బెదిరింపులాటి చురక.

"వాజమ్మని, చేతకాని వెధవని, పిరికి పందని. పచ్చిగా చెప్పాలంటే పనికిరాని వాడని–ఆ క్షణంలో అలాగే అనిపిస్తుంది. కాని జీవితం ఆ క్షణంతో ముగియదు. ఇంకా చాలా జీవితం ఉంటుంది. అది ముగిసేలోగా ఆ అభిప్రాయం తప్పని తెలిసొచ్చే క్షణం కూడా వస్తుంది" అన్నాడు సుబ్రమణ్యం.

శ్రీలేఖ అక్కణ్నించి కదిలి గుమ్మం దాకా వెళ్ళింది. ఏదో గుర్తుకొచ్చినట్లు ఆగింది. తలని మాత్రం వెనక్కి తిప్పి–

"మొట్టమొదటగా నిన్ను చూసినపుడు విచిత్రమైన మనిషి అనుకున్నా. నీ అమాయకత్వం, పిరికితనం చూసేక ఆట పట్టించాలనుకున్నా. నే సినిమాలకి, షికార్లకి పిల్చినపుడు ఇష్టంలేకపోయినా మొహమాటానికి నా సంతోషంకోసం వచ్చినప్పట్నించి మంచి ఫ్రెండువనుకున్నాను. కాని ఈరోజు నీతో అనుభూతిని పంచుకోవాలన్న దృఢనిశ్చయంతో వచ్చి, భంగపడి వెడుతుంటే ఇంకో కొత్త విషయం తెల్సింది"

సుబ్రమణ్యానికి ఆశ్చర్యం వేసింది, తానూహించినంత పట్టించుకోని రకంకాదని

"ఏవిటి-ఏం తెల్సింది?"

"నువ్వంటే వొట్టి ఇష్టంకాదు, నిన్ను నేను ప్రేమిస్తున్నానని – గుడ్‌బై" అని మెట్లుదిగి వెళ్ళబోతూ పమిటకొంగుతో కళ్ళుతుడుచుకుని, చకచకా వీధిలోకెళ్ళి పోయింది.

గొడుగుతో బజార్నించి వస్తున్న రామసూర్యంగారికంట ఆ పిల్ల, ఆ పిల్ల కళ్ళల్లో నీళ్లు, వాటిని ఆమె తుడుచుకున్న దృశ్యం – అన్నీ చోటుచేసుకున్నాయ్. గడపలో నిల్చుని వెళ్ళిపోతున్న ఆమెవంక అయోమయంగా చూస్తున్న అతణ్ని అనుమానంగా చూసుకుంటూ లోని కెళ్ళారు.

* * *

ఆ సంఘటన జరిగిన దగ్గర్నించి సుబ్రమణ్యంలో మునుపులేని ధైర్యం, తనపై తనకి నమ్మకం అధికమైనాయ్.

రామసూర్యంగారు తను చూసిన దృశ్యం రెండ్రోజుల తర్వాత ఒకరాత్రి భార్యకిచెప్పి–"నాకేవిటో అనుమానంగా వుంది" అన్నారు.

"ఛఛ-ఆపిల్లాడుఅలాంటివాడుకాదు" అని తెగేసి చెప్పింది.

"ఎవరు చెప్పగల్రు-ఆడది రెచ్చగొడితే ఎంతటి మొగాడైనా అంతే! అయినా పైకి మెత్తమెత్తగా వుండేవాళ్ళే కొంపలు తీస్తారని మా మేనత్త చెబుతుండేది"

భార్య ఏం అనకపోయేసరికి మళ్ళీ తనే అన్నారు.

"ఎందుకైనా మంచిది – మన పిల్లని కూడా ఓకంట కని పెట్టుండు"

ఈసారి ఆవిడ టక్కున బదులిచ్చింది–

"మనపిల్ల అలాంటి పిచ్చిపిచ్చి వేషాలేం వెయ్యదు – అతడికి ఎదురుగా కూడా వెళ్లదు" అని.

రామసూర్యంగారు తాపీగా అన్నారు.

"మా మేనత్తగూడా ముగ్గురు పిల్లలు పుట్టేదాకా మొగుణ్ని చూసి సిగ్గుపడేది. ఆ పైన ఆయన సిగ్గుపడేవాడు, ఈవిణ్ని కట్టుకున్నందుకు"

హనుమాయమ్మగారి ఆలోచన్లు ఎక్కడో వున్నాయ్-పరధ్యానంగా అంది

''ఈ ముసలావిడ వెళ్లి కొడుకుచేత వుత్తరం రాయిస్తానంది. వెళ్లి పదిహేను రోజులైంది. వాళ్లకిష్టంలేదేమో''

ఆ మాటతో ఆయనలోని ఉత్సాహం సన్నగిల్లింది. మళ్లీ కుర్రాళ్లవేటలో తిరగాలేమోనన్న దిగులు, బెంగ-

''పోనీ ఒకసారి వెళ్లిరానా'' అన్నారు

''కానీండి - ఇంకో వారం చూసి వెళ్లొచ్చు''

పక్కగదిలోంచి సన్నగా వినిపిస్తున్న సంభాషణని కూతురు ఆసక్తిగా వింటోందని వాళ్ళకి తెలీదు.

రమణి ఆ రాత్రి చాలాసేపు ఆలోచించింది.

శ్రీలేఖ ఎందుకు తరచు ఇతడిగది కొస్తోంది? మాట్లాడుకోవాలంటే తలుపు వేసుకోనక్కర్లేదే? తండ్రి చెప్పినదే నిజమైతే వర్షంవచ్చినరోజు గదిలోకెళ్ళి తలుపులు మూసుకోవటం దేనికి? ఆ పిల్ల ఏడుస్తూ ఎందుకెళ్ళింది? తనకి చెప్పినట్లే ఆమెకూ చెప్పాడా? లేక ఆమె ఆస్తి, అంతస్థుచూసి మనసుగాని మార్చుకున్నాడా?

అన్నీ ప్రశ్నలే-శూలాల్లాంటిప్రశ్నలు. ఆలోచించినకొద్దీ గుండెలో గాయంచేస్తున్నాయ్.

సుబ్రమణ్యం పరిస్థితి అయోమయంగా వుంది. శ్రీలేఖని, ఆమె తొందరపాటుని తట్టుకుని నిలదగలిగానన్న సంతోషం ఒకమూలవున్నప్పటికీ బొత్తిగా రమణితో మాట్లాడటం కుదరకపోవటంచాలా బాధగా వుంది. శ్రీలేఖని తిరస్కరించిన క్షణం నించి రమణిపైన తనకేదో హక్కు, అధికారం ఏర్పడ్డట్టుగా అన్పిస్తోంది.

ఆ రోజు అతడి పుట్టినరోజు-

ప్రతి సంవత్సరం ఆరోజున గుళ్ళోకెళ్ళటం అలవాటు. కాని ఈ సంవత్సరం వంటరిగా వెళ్ళాలంటే మనస్కరించటం లేదు. ఎవరిదో తోడు కావాలనిపిస్తోంది.

ఆ సాయంత్రం త్వరగా ఆఫీసునించి వచ్చి గదిలో నిఘా వేసేడు.

ఆమె కనిపించగానే పేరుపెట్టిపిల్చాడు ధైర్యంగా. అతడి పిలుపులో జంకుగొంకు గాని, భయం మొహమాటంగాని లేవు.

అతడి పిలుపువిని రమణి ఆశ్చర్యపడి అలానే నిల్చుండిపోయింది.

''ఇవ్వాళ నా పుట్టినరోజు, గుళ్ళోకెడదాం వస్తావా?'' అనడిగాడు.

రమణికి ఏంచెప్పాలో తెలీక రెండు క్షణాలు అలానే నిల్చుండిపోయింది. ఆపైన,''అమ్మకిచెప్పొస్తా''అంటూ లోనికి దారితీసింది.

తోవలోనే ఆలోచించింది.

అమ్మ సరేనంటుందన్న గారంటీ ఏవిటి? అడిగి వొద్దనిపించుకున్నాక వెళ్ళటం కుదర్దు.

'రావంటే అతనేం అనుకుంటాడో - వెడితే మొన్న జరిగిన సంగతులేమన్నా చెబుతాడేమో!'

ఇంట్లోకెళ్ళింది. చీరె మార్చుకుంది. తల సరిచేసుకుని చెప్పులేసుకుంటూ తల్లితో-"అలా జయప్రదావాళ్లింటికి వెళ్ళొస్తా'' అంది.

"ఇప్పుడెందుకే చీకటిపడి" అని తల్లి అంటున్నా బయటికొచ్చింది.

సుబ్రమణ్యం గదిముందు తాళంచేత్తో పుచ్చుకుని తయారుగా నిల్చున్నాడు.

రమణి అతణ్ని దాటుకుంటూ వెడుతూ, "అక్కడ సందు చివర్న నిల్చుంటా" అంటూ వెళ్లిపోయింది.



సుబ్రమణ్యానికి ముందు అర్థంకాలేదు. తర్వాత అర్థం చేసుకుని పది నిమిషాలాగి గదికి తాళం పెట్టి బయటికొచ్చేడు.

ఆమెను కల్సుకుని ఇద్దరూ పక్కపక్కగా నడుస్తున్నారు. రద్దీ రోడ్లపైన జనాన్ని తప్పుకుంటూ నడుస్తున్నప్పుడు అప్రయత్నంగా తాకుతున్న ఆమె చేతులు, భుజాలు గొప్ప థ్రిల్లుగా అన్పించింది.

కాస్తదూరం నడిచి రిక్షా పిల్చాడు.

అతడి చొరవకి, ధైర్యానికి కాస్త ఆశ్చర్యపడింది. 'దగ్గరేగా నడచివెడదాం' అంది.

అతడు వినిపించుకున్నాడుకాదు. రిక్షా బేరంఆడి ఎక్కి కూర్చున్నాడు.

రమణికి ఎక్కక తప్పిందికాదు.

రిక్షా కదిలింది.

పెళ్ళికిపూర్వం, పెళ్ళి అయిన కొత్తల్లో రిక్షాలో వున్న సుఖం పదగ్గదిలోకూడా రాదని పిల్లలు పుట్టేకగాని తెలీదు. పైగా ఆ వూరి రోడ్లకి గతుకులున్నాయి.

రిక్షా రోడ్డుమీద వెడుతుంటే ఆమె భుజం, తొడలు, నడుం మెత్తమెత్తగా ఒత్తుకుంటుంటే గొప్ప సుఖంగా వుందనిపించింది. రిక్షా చక్రం గతుకులో పడ్డప్పుడు ఆమె అతడి ఒడిలోనే వుంటోంది. వెంటనే సర్దుక్కూర్చుంటోంది.

అలా పది నిమిషాలు స్వర్గంలో విహరించి ఇద్దరూ గుళ్ళోకెళ్ళారు.

దైవదర్శనం పూర్తిచేసుకుని పక్కనే వున్న మంటపంలో కూర్చున్నారు.

అతడేవన్నా చెబుతాడేమోనని కాసేపు ఎదురుచూసింది. కాని సుబ్రమణ్యం ఇంకా రిషా మతులోంచి బయటపడలేదు.

అంచేత ఆమె కదిపింది- "మొన్న వర్షంపడ్డరోజు శ్రీలేఖ వచ్చిందా?'' అని

అవునన్నట్లు తలూపాడు.

"మా నాన్న మా అమ్మకి చెబుతుంటే విన్నా" అంది మళ్ళీ.

"ఇంకేం చెప్పాడు?'' సుబ్రమణ్యం ప్రశ్న.

"అంతే ఇంకేవైనా వుందా చెప్పటానికి'' రమణి ఎదురుప్రశ్న.

"వుంది-చాలావుంది"అంటూ మొదలుపెట్టి ఆరోజు గదిలో జరిగిందంతా ఏదీ దాచకుండా చెప్పేశాడు.

రమణికి అతగాడి నిజాయితీపై నమ్మకం ఏర్పడింది.

"ఇందులో నా తప్పేమన్నా వుందా?'' అనికూడా అడిగాడు.

"లేకపోవచ్చు. పోనీ ఆ పిల్లని రావద్దని చెప్పొచ్చుగా'' అంది.

"చెప్పొచ్చు. కాని ఎలా చెబితే ఆమెకి అర్థం అవుతుందో నాకర్థంకావటంలేదు"

గుళ్ళోంచి బయటికొస్తుంటే అతడు ఎదురయ్యాడు-

పంచెకట్టు, పిలక, పైన అంగవస్త్రం, మొహాన బొట్టు, చేతిలో సంచి. పెళ్ళి సంబంధాలు చూపించే శాస్త్రిలుగారు.

ఎదురొచ్చి చూసిచూడగానే రమణిని గుర్తించాడు.

అది గమనించని రమణి, సుబ్రమణ్యం బయటకొచ్చి నడక ప్రారంభించేరు.

సుబ్రమణ్యం నడుస్తూనే ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు.ఆమె వారించలేదు. అతడు పూసగుచ్చినట్లు అంతా చెప్పేయ్యటంతో ఆమెకి అతడిపైన నమ్మకం పెరిగింది.

ఇద్దరూ చెయ్యీ చెయ్యీ పుచ్చుకుని పదడుగులు వేసేరో లేదో వెనకనించి శాస్త్రిలుగారు పడుతూ లేస్తూ వచ్చి నడుస్తున్న వాళ్ళని నిలేశాడు-

"చూడమ్మా! నువ్వు రామసూర్యం గారమ్మాయికదూ?" అనడిగాడు.

ఆయన్ని చూడగానే కాస భయం అన్పించింది. సుబ్రమణ్యం చేతిలోవున్న తన చేతిని విడిపించుకుంది.

''అవునండి" అంది తలొంచుకుని.

"నాకు బాగా గుర్తు. అవునూ-పెళ్ళయిపోయిందా? ఇతనెవరు?" అనడిగాడు సూదుల్లాంటి చూపుల్తో సుబ్రమణ్యం వంక చూస్తూ.

"పెళ్ళింకా కాలేదండి. కాని నిశ్చయం అయిపోయింది" అంది.

''శుభం. మరి మీ నాన్న ఇంకా సంబంధాలంటూ ప్రాణం తీస్తాడేమిటి?" అన్నాడు.

సుబ్రమణ్యానికి ఆయన వాలకం, చూపులు, పద్ధతి మహచికాగ్గా వున్నట్లనిపించింది.

"అది వాళ్ళ నాన్నగారినే అడిగి తెల్సుకుంటే మంచిది" అన్నాడు.

"అవును ... అదీ నిజమే. పోన్లే పెళ్ళయింది. సంతోషం. ఈడుజోడు కూడా బావుంది. అయితే నా పుస్తకంలో నీపేరు కొట్టెయ్యొచ్చుగా" అనుమానంగా అడిగాడు.

రమణి ఏం మాట్లాడలేదు. కాని సుబ్రమణ్యం అన్నాడు-

"నిక్షేపంలా కొట్టేసుకోండి" అని.

శాస్త్రిలుగారు వెళ్ళిపోయారు.

ఇద్దరూ కాస్త దూరం మళ్ళీ చెయ్యి చెయ్యి పట్టి నడిచేరు.

కాఫీ హోటల్లో కాఫీ త్రాగేరు. బయటికొచ్చి రిక్షా ఎక్కారు.

సుబ్రమణ్యం మెయిన్ రోడ్డుపైనే దిగి భోజనానికెళ్ళాడు.

రమణి ఇంటికి చేరేసరికి తొమ్మిదయింది.

రామసూర్యంగారు, భార్య ఆదుర్దాగా ఎదురుచూస్తున్నారు.

ఇంటికి రాగానే కూతురు గురించి అడిగారు. భార్య చెప్పిన సమాధానం విని వూరుకున్నారు. కాని ఎనిమిది దాటినా ఇంటికి రాకపోయేసరికి కంగారెక్కువైంది. జయప్రదావాళ్ళింటికెళ్లొస్తానని వెళ్ళారు.

పదినిమిషాల్లో తిరిగొచ్చారు. "ఏదీ! ఇంకా అక్కడే వుందా?" అనడిగింది భార్య. రామసూర్యంగారు బదులివ్వక మంచం వాల్చుక్కూర్చున్నారు.

ఆవిడ మళ్ళీ ఆత్రంగా అడిగింది- పిల్ల ఏదని.

"నిజంగా జయప్రదావాళ్ళింటికనే చెప్పిందా... సరిగ్గా విన్నావా?"

"అంటే అక్కడ లేదా?"

"అసలు వాళ్ళింటికే రాలేదట... జయప్రదే చెప్పింది"

హనుమాయమ్మగారికి భయం పట్టుకుంది. నిల్చున్న చోటే కూలబడింది.

"అంటే ఎక్కడికెళ్లిందంటారు?" అంది దిగులుగా.

"ఏమో....రానీ కనుక్కుందాం" అన్నారు.

"మీరేం గొడవ చెయ్యకండి... నేలడిగి తెల్సుకుంటాగా"

తొమ్మిదింటికి మెల్లిగా గేటు తీసుకొస్తున్న కూతుర్ని చూసి ఇద్దరూ గంభీరంగా కూర్చున్నారు.

ఆమె ఇంట్లోకెడుతుంటే రామసూర్యంగారామెని పరీక్షగా చూసేరు. మొహాన కుంకం బొట్టు, చేతిలో కొబ్బరి చిప్ప-కొద్దిగా అర్థమైంది.

"ఏమే గుళ్లోకెళ్ళొచ్చావా?" అనడిగింది తల్లి-చీర మార్చుకుంటున్న రమణిని.

"అంటే - జయప్రదావాళ్ళింటికెళ్ళ లేదా?"

రమణిచీరని మడత పెడుతూనే ఒక్కక్షణం ఆలోచించింది-

నిజం చెప్పేయటమా లేదాని!

నిజాన్ని జీర్ణంచేసుకోవటం వాళ్ళకి కష్టం-ఆ సంగతి ఆమెకి బాగా తెల్సు. అందుకే తాపీగా చెప్పింది-"వెళ్ళా జయప్రద, నేను, వాళ్ళమ్మగారు కల్సే గుళ్ళోకెళ్లాం"

హనుమాయమ్మగారికి పూర్తిగా అర్థమైపోయింది.

కూతురు తనవద్దనించి ఏదో దాస్తోంది. తమకి తెలీకుండా పెద్ద గ్రంథం నడుస్తోంది. కాని ఎవరతను? సుబ్రమణ్యమేనా?

అప్పుడే అడిగెయ్యాలనిపించింది. కాని భర్త వుండగా అయితే పెద్దగొడవైపోతుంది.

అంచేత బాధని, దుఃఖాన్ని దిగమింగుకొని బయటకొచ్చింది.

"ఎక్కడికెళ్ళిందట?" రామసూర్యంగారు భార్యని అడిగేరు.

"జయప్రదావాళ్ళింటికని బయల్దేరిందట. తోవలో ఇంకో స్నేహితురాలు కనిపించి గుడికి లాక్కెళ్ళిందట. సరే... మీరు కాళ్లు కడుక్కోండి"

అంతసేపూ వున్న బాధని మరచి భోజనానికి లేచేరు.

ఆ మర్నాడు-

ఉదయం పదయింది. సుబ్రమణ్యం ఆఫీసుకెళ్లాడు. రమణి తన పన్లన్నిటినీ పూర్తి చేసుకుని లోపల గదిలో చీరకి ఇస్త్రీ రుద్దుకుంటోంది.

రామసూర్యంగారు స్నానం చేసి పోస్టాఫీసుకని వెళ్లారు.

హనుమాయమ్మగారికి అదే సరైన అదునుగా అన్పించింది. మెల్లిగా కూతురున్న గదిలోకెళ్ళింది. గత రాత్రంతా ఆవిడ మనస్సు మనస్సులో లేదు. పరిపరి విధాల పరిగెత్తింది. సరిగ్గా నిద్ర కూడా పట్టిందికాదు.

"ఏమే...నిన్న నిజంగా జయప్రదా వాళ్ళింటికెళ్లావా?"

రమణి తలెత్తి తల్లి వంక చూసింది. వెంటనే అర్థమైంది-తను చెప్పిన అబద్ధం ఏ కారణం చేతనో అతకలేదని. ఇంకా బుకాయించి లాభంలేదు.

''లేదు. జయప్రదావాళ్ళింటికి వెళ్ళలేదు"

"మరి రాత్రి అలా చెప్పావే"

రమణి తలొంచుకుని మౌనంగా పన్చేసుకుంటోంది.

"ఇంతకీ రాత్రి ఎక్కడికెళ్ళినట్లు?"

"గుళ్లోకి"

"ఆ కొబ్బరి చిప్పే ఆ సంగతి చెబుతోంది...కాని ఎవరితో అని?"

"సుబ్రమణ్యంగారితో" మెల్లిగా చెప్పేసింది.

హనుమాయమ్మగారికి రెండు క్షణాలు అర్థం కాలేదు. 'సుబ్రమణ్యంతో' అనుంటే అర్థమయ్యేది. కాని 'గారితో' అనేసరికి అర్థం కావటానికి కాసేపు పట్టింది.

అర్థమయ్యాక బుగ్గలు నొక్కుకుంది.

"అప్రదిష్ట. ఇంకేవన్నా వుందా-ఎవరి కంటనయినా పడితే పెళ్లవుతుందా?"

రమణి అప్పటికి ఏం మాట్లాడలేదు.

"చెప్పాపెట్టకుండా ఆ పిల్లాడితో గుళ్ళకి గోపురాలకి తిరిగితే మా పరువేం కాను? ఎందుకలా చేశావ్?"

"అది కాదమ్మా! నిన్న ఆయన పుట్టినరోజట. రమ్మని అడిగారు. అడిగితే కాదంటావని నేనే..."

హనుమాయమ్మగారు శక్తిలేనట్లు కూర్చుండిపోయింది.

"పెళ్ళయ్యాక పుట్టినరోజులు, మెట్టినరోజులు చేసుకోమను. అంతేగాని ఇట్లాంటివి గిట్టవని నేనే చెబుతానుండు."

రమణి మౌనంగా వుండిపోయింది.

"పెళ్ళయ్యేవరకు ఎంతలో వుండాలో అంతలోనే వుండాలి. రేపతను చేసుకోను పొమ్మంటే"

"ఎందుకంటాడు?"

"అంటే''

"అనదమ్మా-ఆ నమ్మకం నాకుంది"

"మొన్న ఆకార్లోవచ్చే పిల్లతో గదిలో తలుపులేసుకున్నాట్ట.ఆ పిల్ల ఏడ్చుకుంటూ వెళ్లిందిట. వాళ్లు డబ్బున్నవాళ్ళు, ఎంతటి విషయాన్నయినా తుడిచేసుకోగలరు.కాని మనం అలాకాదు. ఆ ముసల్ది వూరువెళ్లి వెళ్ళగానే కొడుకుచేత వుత్తరం రాయిస్తానని మరీ మరీ చెప్పింది. వెళ్ళి ఇరవయి రోజులయింది. అజా పజాలేదు. ఏం చెబుతాం? అలా వుంటాయి విషయాలు అయ్యేదాకా ఎవర్నీ నమ్మకూడదు?"

రమణి మాట్లాడటం అనవసరం అనిపించి వూరుకుండిపోయింది.

"ఇంకెప్పుడూ నాకు తెలీకుండా ఇట్లాంటి పన్లు చెయ్యమాక'' అంది

చివరగా ఆవిడ.

బామ్మగారు వూరెళ్ళిన ఇరవయిరెండో నాడు సుబ్రమణ్యానికి ఇంటివద్దనించి వుత్తరం వచ్చింది. సారాంశం:

'అంతా క్షేమం-బామ్మతప్ప. అక్కడి నించి వచ్చినప్పట్నించి జ్వరం. డాక్టరు మందులిస్తున్నాడు. ఇక, రామసూర్యం గారనే ఆయన వుత్తరం రాశాడు. వాళ్ళ అమ్మాయిని నీకివ్వాలని వుందిట. అమ్మని, నన్ను వచ్చి చూసెళ్ళమని రాశాడు. నువ్వుకూడా ఆ పిల్లవేపు మొగ్గుచూపిస్తున్నావని బామ్మ చెప్పి ఆపైన జ్వరపడింది. ఎంత ఇష్టమైనా అంతలా బయటపడ కూడదు. బామ్మ ఆరోగ్యం కుదుటపడ్డాక వీలుచూసుకుని వస్తామని ఆయనకి చెప్పు. ఆరోగ్యం జాగ్రత్త'

ఆరోజు సాయంత్రమే సుబ్రమణ్యం తండ్రి రాసిన సంగతి చెప్పటం మంచిదని లేకపోతే మర్చిపోయే ప్రమాదం వుందని చెప్పి రామసూర్యంగారికోసం కాపేసి కూర్చున్నాడు.

ఏడింటికి ఆయన బయట్నించి వచ్చారు. ఎందువల్లనో చాలా కోపంగా, సీరియస్సుగా వున్నారనిపించింది సుబ్రమణ్యానికి.

"మా నాన్నగారు వుత్తరం రాశారండీ! బామ్మకి ఇక్కణ్నించి వెళ్లినప్పటి నించి ఒంట్లో బాగోక లేవటం లేదట. ఆవిడకి నెమ్మదించాక వీలుచూసుకుని వస్తామని చెప్పమన్నారు''

రామసూర్యంగారంతావిని సింపులుగా ''ఓహో...అలాగా" అని చరచరా లోనికి వెళ్లిపోయారు.

సుబ్రమణ్యం ఆశ్చర్యపోయాడు.

రామసూర్యంగారు ఇంట్లోకెళ్లి వెంటనే భార్యని పిలిచారు. ఆవిడ రాగానే సుబ్రమణ్యం చెప్పిన విషయంచెప్పి, "వాళ్ళకి వీలున్నప్పుడొస్తామంటే ఎన్నాళ్ళని ఎదురుచూస్తాం! పోనీ ఏదయినా హామీ ఇస్తారాంటే అదీలేదు. తీరా వాళ్ళన్నమ్ము కూర్చుంటే- కాకపోతే?'' ఏంచేద్దాం అన్నట్టు భార్యవంక చూసేరు.

హనుమాయమ్మగారికి కూడా ఆ మాట నిజమేననిపించింది. "బయటకూడా చూస్తూవుండేసరి. ఎవళ్లయినా వూరికినే చేసుకోరుగా!" అంది.

రామసూర్యంగారు ఇంకో విషయం చెప్పాలా వద్దాని ఆలోచిస్తుండగా తిరిగి ఆవిడే "ఆ శాస్త్రిలుకి గట్టిగా చెప్పండి" అంది.

దాంతో ఆయన గొంతు తగ్గించి-

"అదేచెప్పబోతున్నా!నిన్న ఆ శాస్త్రిలుకి మన పిల్ల గుళ్లో కనిపించిందిట. పక్కనే ఎవరో కుర్రాడున్నాట్టకూడాను. పెళ్ళి నిశ్చయమైపోయింది అన్చెప్పారట. ఆ కుర్రాడెవడో నాకు అంతుబట్టకుండా వుంది" అన్నారు కాస్త దిగాలుగా.

హనుమాయమ్మగారికిక దాచటంఅనవసరమనిపించి-

"నిన్న స్నేహితురాలితో మన పిల్ల గుళ్లోకెళితే ఆ గదిలో కుర్రాడు అక్కడ కల్సాట్ట. చెబుతున్నట్లుగా చేసుకుంటే దిగులులేదు. ఏ మాటా చెప్పమని నిలదీసి అడిగేస్తేసరి" అంది.

రామసూర్యంగారన్నారు-

"నాకెందుకో అతగాడిపైన అనుమానంగా వుంది. ఆ కార్లోవచ్చే పిల్లతో తలుపు మూసుకుంటున్నాడు. ఇటు దీనికేమో ఇలా చెబుతున్నాడు. ఆ శాస్త్రిలుకేమో పుస్తకంలోంచి పేరు తీసెయ్యమని చెబుతున్నాడు. నాకేమో మావాళ్లు వీలువున్నప్పుడొస్తారంటున్నాడు. ఏది నిజం,

ఏది నమ్మాలి...అర్థంకాకుండా వుంది''

హనుమాయమ్మగారు రెండు క్షణాలాలో చించి...

''సరేలెండి! పిలుచుకుని నేనే అతడి వుద్దేశం ఏమిటో అడిగేస్తా! నిజంగా మన పిల్లంటే ఇష్టంవుంటే తప్పకుండా చేసుకుంటానని చెప్పమంటాను'' అంది.

రామసూర్యంగారు మౌనంగావుండి అంగీకారాన్ని తెలిపారు.

రమణి వాళ్ళ సంభాషణంతా విన్నది. తల్లిదండ్రుల ఆదుర్దాకి అర్థంవుందని గుర్తించింది. వెంటనే ఏం చెయ్యాలో నిర్ణయించేసుకుంది.

ఆరోజు రాత్రి సుబ్రమణ్యం భోంచేసి అప్పుడే వచ్చాడు. బట్టలు మార్చుకుని పక్కమీదకి చేరబోతుండగా చిన్నపాటి కాగితం వుండ తుపాకీ గుండులా దూసుకొచ్చి అతడి వళ్లో పడింది.

అనుమానంగా విప్పి చూసేడు.

'రేపు సాయంత్రం ఆరింటికి మొన్న మనంకాఫీతాగినహోటలువద్దకురండి.ముఖ్యమైన విషయం మాట్లాడాలి' అంతేవుంది. సంతకం లేదు. సుబ్రమణ్యం కాసేపు ఏమై వుంటుందాని ఆలోచించేడు.

ఆలోచిస్తూనే నిద్రపోయాడు.

ఆ సాయంత్రం ఆరింటికి హోటలు దగ్గర రమణి రిక్షాదిగేవరకు సందిగ్ధంగానే వుంది పరిస్థితి.

ఇద్దరూ వెళ్ళిలోన కూర్చున్నాక ఆమె మొట్టమొదటిగా అడిగిన ప్రశ్న-

"నిజంగా మీరు నన్ను చేసుకోవాలనుకుంటున్నారా?" అని.

సుబ్రమణ్యం ఆశ్చర్యపోయాడు.

''అదేమిటి అలా అడుగుతున్నావు?'' అన్నాడు.

"సూటిగా సమాధానం చెప్పండి" నిలదీసింది.

"తప్పకుండా. అందులో అనుమానం లేదు" అన్నాడు.

"అంటే మీవాళ్లు ఏ కారణానైనా అభ్యంతరం పెట్టినా చేసుకుంటారా?"

ఎందుకలా అడుగుతోందో తెలీక తెల్లమొహంవేసి-

"ఎవరి అభ్యంతరాలూ నన్నాపలేవు. నిన్ను చేసుకోవడం ఖాయం" అన్నాడు.

రమణికి శరీరం పులకించింది.

"అయితే ఇదేమాటని రేపు మా నాన్నగారితో చెప్పగలరా?" సందేహంగా చూస్తూ అడిగింది.

"దేనికి?"

"మీమీద నమ్మకంలేక మావాళ్లు వేరే సంబంధాలు చూస్తున్నారు. మీరీమాట చెబితే వాళ్లా ప్రయత్నం మానుకుంటారు''

సుబ్రమణ్యానికి ఆమె పరిస్థితి అర్థమైంది. జాలికూడా అనిపించింది.

"తప్పకుండా. రేపు సాయంత్రమే చెబుతా- నిశ్చింతగా వుండు''అని హామీ ఇచ్చేకగాని ఆమెకి మనసు కుదుటపడింది కాదు.

ఆ తర్వాత ఇద్దరూ కాఫీలు తాగి, కాసేపు బజార్లవెంట తిరిగి ఇంటికి చేరుకున్నారు.

ఆ మర్నాడు సుబ్రమణ్యం ఆఫీసులో ఒక ఘోరం జరిగింది.

ఆఫీసులో పన్చేసే గుమాస్తాకి యాక్సిడెంటయింది. సుబ్రమణ్యం పక్క సీటే. పేరు వెంకటాచలం. ఆఫీసు మొత్తంలో ఆప్యాయంగా పలకరించేది అతనొక్కడే. అతడంటే సుబ్రమణ్యానికి చాలా ఇష్టం. కలివిడిగా మాట్లాడేవాడు. సలహాలిచ్చేవాడు. ధైర్యం చెప్పేవాడు. ఇంకా చిన్నం చిదర సహాయాలు చేస్తుండేవాడు.

ముందురోజు సాయంత్రం ఆఫీసు అయ్యాకసుబ్రమణ్యాన్ని సినిమాకెడదాం రమ్మని పిల్చేడు...కాని రమణిని కలిసే పనుండటంచేత రానన్నాడు.

వెంకటాచలం అక్కణ్ణించి సరాసరి బారుకెళ్లి తాగేట్ట. ఆపైన ఇంటికి స్కూటరుపైన పోతుంటే తూలి లారీ కిందపడ్డాట్ట.

తెల్లారి ఆఫీసుకెళ్లేసరికి వెంకటాచలం చనిపోయాడన్న వార్త విని సుబ్రమణ్యం విస్తుపోయాడు. అవాక్కయిపోయాడు.

నిన్న సాయంత్రం వెడుతున్నానని చెప్పిన వ్యక్తి తెల్లారి ఆఫీసుకు రాక చనిపోయాడంటే ఎలా నమ్మేది? ఈ బతుక్కి ఏమిటి గ్యారంటీ? అతడు పిల్చినపుడు సినిమాగ్గాని వెళ్లుంటేబతికుండే వాడా?

అతడికి మనస్సు పాడైపోయింది. బుర్ర పన్చేయటం మానుకుంది. మొద్దుబారిపోయింది.

ప్రతి క్షణం,ప్రతి నిముషం, ప్రతి గంట వెంకటాచలం గురించే ఆలోచన్లు. మిగతా విషయాలన్నీ బుర్రలో అట్టడుగున పడి పోయినాయి.

అందులో రమణి తండ్రికి చెప్పమన్న విషయంకూడా వుంది.

రామసూర్యంగారికి చెప్పాలనుకున్న విషయం ఆరోజు చెప్పటం మర్చిపోయేడు. ఆపైన చెప్పాననుకుని వూరుకుండి పోయాడు.

* * * *

ఆరోజు ఆదివారం.

అయినా పతంజలిగారింట్లో సందడిలేదు.

పక్కనున్న వ్యాయామశాల్లో ముగ్గురు నలుగురు వుత్సాహవంతులు ప్రాక్టీసు చేసుకుంటున్నారు.

పతంజలిగారు మాత్రంతనకేంపట్టనట్టు తనకేంతెలీనట్లుస్తబ్దుగా, దిగులుగా వరండాలోకూర్చునున్నారు.మట్టలాగు స్పోర్ట్సు బనీను, కాన్వాస్ బూట్లులేవు. లుంగీ పంచె, మాసిపోయిన గ్లాస్కో లాల్చి, హవాయ్ స్లిప్పర్స్-చిందులు తొక్కకుండా గాలి పోయిన బంతిలా కూర్చున్నారు దిగులుగా.

అన్నపూర్ణమ్మగారు లోనుంచి వచ్చింది. ఆయనలా నిశ్శబ్దంగా కూర్చుంటే జాలిపించింది. బాధనిపించింది. అల్లరిచేసే పిల్లవాడు మంచం పట్టినట్లు భరించలేని స్తబ్దత.

"కాస్త కాఫీగానీ, హార్లిక్సుగాని ఇమ్మంటారా?"

"నాకేంవద్దు. అమ్మాయికెలావుంది?" అనడిగారు దీనంగా చూస్తూ.

శ్రీలేఖకి రెండ్రోజులుగా ఆరోగ్యం బాగుండటంలేదు. తల తిరగటం, తిండి సయించకపోవటం, స్వల్ప జ్వరం, వాంతులు...

మొదటి రోజునే డాక్టర్ని పిలుద్దామనుకుంటే తల్లీకూతుళ్లు ఇద్దరూ వద్దన్నారు. పైత్యంవల్లేనని సర్ది చెప్పారు.

కాని పతంజలిగారికి దిగులుగానే వుంది. ఆయనకి మొదట్నించీ అదే అలవాటు-స్వల్పమైన విషయాలక్కూడా ఎక్కువగా బాధపడిపోతారు.

ఆసనాలేసి, వ్యాయామం చేసి శరీరాన్నయితే గట్టి పర్చుకున్నారుగాని, మనస్సుని కంట్రోలు చేసుకోలేకపోతున్నారు.

"పడుకునుంది. మళ్ళీ వాంతి చేసుకుంది. అజీర్తివల్ల కాబోలు" అంది భార్య. పతంజలిగారికి అది నచ్చిందికాదు.

భార్య రోగానికి కారణాలు వూహించి వూరుకుండి పోవటం ఆయనకి నచ్చ

లేదు. గలగలమని సందడి చేస్తూ, అల్లరి చేస్తూ తన వెంటే తిరిగే పిల్ల అలా మంచంపట్టటం, దానికి భార్య అజీర్తి అని, పైత్యంఅని చెప్పి చిన్న విషయంగా కుదించటం కూడా ఆయనకి నచ్చలేదు.

''వెళ్ళి డాక్టర్ని పిల్చుకొస్తా! ఇంజక్షనిస్తే అన్నీ సర్దుకుంటాయ్" అంటూ లేచి నిల్చున్నారు.

అన్నపూర్ణమ్మగారు కాదనలేక పోయింది.

కూతురు నలతకి కారణం అజీర్తి, పైత్యం లాంటి స్వల్పమైన విషయమని తెల్సినా, దానికి డాక్టరు అనవసరమని తెల్సినా ఆయన వాలకాన్ని చూసి కాదన్లేకపోయింది.

కూతురు కోలుకునేసరికి ఆయన మంచం పట్టేలా వున్నాడన్న భయంకొద్దీ సరేనంది.

ఫోన్చేస్తే డాక్టరొస్తాడు. కాని ఎప్పటి కొస్తాడో. అంచేత స్వయంగా తనే కారు తీసుకు బయల్దేరారు.

బోసుబాబు ఎదురొచ్చాడు.

''ఇవ్వాళ నా మనసేం బాగాలేదు. అంచేత కాసేపు ప్రాక్టీసు చేసుకుని వెళ్ళిపొండి'' అన్నారు కారెక్కుతూ.

''అలాగే. శ్రీలేఖకెలావుంది?'' అనడిగాడు.

"పడుకునుంది. డాక్టర్ని పిల్చుకొద్దామని వెడుతున్నా" అని కార్లో కూర్చున్నారు. ఏమనుకున్నాడోగాని, "పదండి-నేనూవస్తా" అంటూ తను ఎక్కి కూర్చున్నాడు బోసుబాబు.

పది నిముషాల్లో పరమేశ్వర్రావుని తీసుకుని కారు తిరిగొచ్చి పోర్టికోలో ఆగింది.



పరమేశ్వర్రావు పెద్ద డాక్టరు. గొప్పవాళ్ళ డాక్టరు. గొప్పగొప్పవాళ్ళకి చిన్న చిన్న కంప్లైంట్సుకి కూడా చెంగు చెంగున వస్తాడుగాని, చిన్నచిన్నవాళ్ళకి గొప్ప గొప్ప రోగాలొచ్చినా పట్టించుకోడు, విని పించుకోడు.

కారు ఇంటిముందు ఆగగానే బోసు బాబు దిగి తలుపు తెరచి పట్టుకోగా పర మేశ్వర్రావు దిగేడు.

టెర్లిన్ చొక్కాని టెరీవూలు ప్యాంటు లోపలకి దోపేడు. చేతిలో స్టెత్. మెల్లిగా లోనికి నడిచాడు. వెనకే మెడికల్ బ్యాగ్ పుచ్చుకుని పతంజలిగారు, ఆవెనక బోసు బాబు.

ముగ్గురూ గదిలోకెళ్ళేసరికి శ్రీలేఖ పడుకునుంది. అన్నపూర్ణమ్మగారు ఆ మంచంపైనే కూర్చునుంది. గదిలోకి వారు రాగానే లేచి నిల్చుంది.

పరమేశ్వర్రావు దగ్గరగా వున్న కుర్చీలో కూర్చుంటూ-

"వాటీజ్ యువర్ ట్రబుల్?" అనడి గారు.

శ్రీలేఖ నవ్వి వూరుకుంది. అన్న పూర్ణమ్మగారు బదులిచ్చింది.

"రెండ్రోజుల్నించి అన్నం తినదు. తల తిరగటం, వాంతులు"

పరమేశ్వర్రావు టెంపరేచర్ చూసేడు- నార్మల్.

బ్లడ్ప్రెషర్ పరీక్ష చేసేడు - నథింగ్ ఎబ్నార్మల్.

నాడి, కళ్ళు, నోరు పరీక్ష చేసేరు...

అర్థమైనట్లుగా తలాడించారు. "ప్లీజ్! అందరూ ఓ క్షణం బయటికెళ్ళండి" అన్నారు.

రోగిని, డాక్టర్ని వదిలి అందరూ బయటికెళ్ళి నిలబడ్డారు.

పరమేశ్వర్రావు శ్రీలేఖని రెండు

మూడు ప్రశ్నలడిగారు. శ్రీలేఖ సిగ్గు పడుతూనే బదులిచ్చింది.

ఆయన సిరెంజిలోకి మందునెక్కించి ఇంజక్షనిచ్చి–'యు విల్ బి ఆల్ రైట్' అని బేగ్ చేత్తో పుచ్చుకుని పెద్దపెద్ద అంగల్తో బయటికొచ్చేరు.

పతంజలిగారు ఆత్రంగా ఎదురొచ్చేరు.

''ఇంజక్షనిచ్చా–వాంతులు కడతాయి. నాతోరండి కాప్సిల్సుకూడాఇస్తా'' అంటూ సీరియస్సుగా కారువైపుగావెళ్ళిపోయారు.

పతంజలిగారు కూడా వెళ్ళి కారెక్కారు.

అన్నపూర్ణమ్మగారు, బోసుబాబు అక్కడే నిల్చుని చూస్తుండిపోయారు.

క్లినిక్‌లో కాప్సిల్సు అందిస్తూ–

''ఇవిపూటకి ఒకటిచొప్పున వెయ్యండి వాంతులాగితే వెయ్యొద్దు. అన్నట్లు– మీ పిల్ల ఏం చదువుతోంది?' అన్నారు.

''డిగ్రీ ఫైనలియరు''

''వీటితో ఆ పిల్ల లేచి తిరుగుతుంది. కాని ఒకసారి లేడీడాక్టరు దగ్గరకి తీసుకెళ్ళండి'' అని సలహా ఇచ్చేరు.

పతంజలిగారికి ఆ సలహా ఎందుకు చెప్పారో, అవశ్యకతేవిటో అర్థమైందికాదు. 'దేనికండి' అనడిగారు అర్థంకానట్లు.

''నాకో చిన్న అనుమానం. అంతే! కొన్ని పరీక్షల్చేస్తేనేగాని చెప్పలేం. అశ్రద్ధ చెయ్యకుండా తీసుకెళ్ళండి. మీ మేలుకోరే చెబుతున్నా''



పతంజలిగారు ఇంటికొచ్చి పరమేశ్వ్రరావిచ్చిన కాప్సిల్సు, సలహా కూడా భార్యకందించారు.

"ఎందుకట?" అనడిగింది అన్నపూర్ణమ్మగారు అయోమయంగా.

"ఏమో! చెప్పారుకాదు. కాని అశ్రద్ధ చెయ్యొద్దని మాత్రం చెప్పారు"

వాళ్ళిద్దరి మొహాల్లో ఏదో దిగులు, భయం కనిపించినాయ్.

పరమేశ్వర్రావు ఇచ్చిన ఇంజక్షన్, కాప్సిల్సుతో ఆయన చెప్పినట్టే వాంతులు కట్టేయి. శ్రీలేఖకి అనారోగ్యభావనపోయి మంచం దిగింది. తల్లిని టిఫిన్‌చేసి పెట్టమంది.

తల్లిదండ్రులకి పోయిన వుత్సాహం, ధైర్యం తిరిగొచ్చినాయి. కాని పరమేశ్వర్రావు చెప్పిన సలహా గుర్తొచ్చినపుడల్లా వాళ్ళకి దిగులుగా, భయంగా అనిపిస్తోంది.




ఆమర్నాడే వుదయాన్నే అన్నపూర్ణమ్మగారు భర్తనడిగింది-

"ఏవంటారు-లేడీడాక్టరు దగ్గరికి తీసుకెళ్ళమంటారా?" అని.

పతంజలిగారు రెండుక్షణాలాలోచించారు- పరమేశ్వర్రావు వుత్తినే చెప్పడు గదా! ఒకసారి చూపించి ఏం లేదనిపించుకుంటే సరిపోతుంది.

"అలాగే తీసుకెళ్ళు" అన్నారు బింకంగా.

అన్నపూర్ణమ్మగారు మరో పదినిమిషాల తర్వాత కూతుర్ని తీసుకుని కార్లో వెళ్ళింది. మొదట శ్రీలేఖ రానంది. కాని తల్లి బలవంతంచేత వెళ్ళక తప్పిందికాదు.

పతంజలిగారు- ఏంవుండదు లెమ్మన్చెప్పి మళ్ళీ తన దినచర్యలో పడ్డారు. మట్టలాగు, స్పోర్ట్సుబనీను వేసుకుని ఇంటి ముందు చిన్నగా రన్నింగు చేస్తున్నారు.

సరిగ్గా ముప్పావుగంట గడిచాక-

వెళ్ళినవాళ్ళు తిరిగొచ్చేరు. శ్రీలేఖ కారు దిగగానే చకచక పైకెళ్ళిపోయింది.

అన్నపూర్ణమ్మగారు నిస్సత్తువుగా కుర్చీలో కూలబడి, బస్కీలు తీస్తున్న భర్తని కంగారుగా పిల్చింది.

పతంజలిగారు కార్యక్రమం ఆపి, వచ్చి నిల్చున్నారు.

పాలిపోయిన భార్యమొహం చూసి కంగారుగా 'ఏవంది డాక్టరు?' అనడిగారు.

అన్నపూర్ణమ్మగారు రెండుచేతులూ తలపై వుంచుకుని, 'కొంప ముంచిందండీ' అంది.

పతంజలిగారి ఆలోచన్లు అప్పటివరకూ చెడువైపు వెళ్ళలేదు! కూతుర్ని ఆరోగ్యమైనబాటలో పెంచానని, కావలసిన ధైర్యాన్ని, ఆరోగ్యాన్ని, వివేకాన్ని పుష్కలంగా ఇచ్చేనని ఆయనకో గొప్ప నమ్మకం. అంచేత భార్యచెప్పిన ఆమాట విన్నాక డాక్టర్లగురించి చెడ్డాలోచన చేసేరు.

"ఇంజక్షన్లు, మందులు వాడాలని పెద్ద లిస్టుగాని రాసిచ్చిందా?" అనడిగారు.

అన్నపూర్ణమ్మగారికి అంతటి బాధలోనూ కోపం వచ్చింది.

"మీకు మాటకూడా అర్థంకాదు.

అన్నీ విప్పిచెప్పాలి. మన పిల్ల తల్లికాబో తోందిట" అంది మొహందించుకుంటూ.

ఒక్క మాట-

ఆ ఒక్కమాట ఆయన గుండెల్లో లక్ష ఫిరంగుల్ని ఒకేసారి పేల్చేసింది. కళ్ళలో వెలుగు మాయమయి చీకట్లు కమ్ముకున్నాయి. వ్యాయామంతో గట్టి పడ్డ రాయిలాంటి ఒళ్లు దూదిపింజలా వణికిపోసాగింది. ఒంట్లో ఓపికంతా నశించి కాళ్ళూచేతులు గుడ్డపీలికల్లా వేలాడిపోతున్నట్లనిపించింది.

"పూర్ణా! నువు... నువు చెప్పింది నిజమా?" కాదని పెద్దగా నవ్వేసి, ఎలా వుంది జోకని అంటుందని, అనాలని ఆయన ఆశ...ఆకాంక్ష.

భర్తలోని బేలతనాన్ని చూసేసరికి ఆవిడ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"నిజమేనండి ... నేమొదట్నుంచి చెపుతూనేవున్నా- ఆడపిల్లకంత చనువు, స్వాతంత్ర్యం పనికిరావండీ అని- విన్నారుకాదు. ఇప్పుడేవిటి చెయ్యటం?"

కంచు విగ్రహంలా నిలబడ్డ ఆయన కళ్ళకి చిల్లుపడ్డట్టుగా జలజలా నీళ్లుకారు తున్నాయ్. వాటిని తుడిచెయ్యాలని, ఆపెయ్యాలని ప్రయత్నంకూడా చెయ్యక అలాగే నిల్చున్నారు.

జీవితంలో కొన్నింటిని తుడిచెయ్యటం, ఆపెయ్యటం సాధ్యంకాదని ఆ క్షణం లోనే తెలిసొచ్చింది.

"శ్రీలేఖని ఆడపిల్లలా కాకుండా ఆదర్శపు పిల్లలా పెంచాలనుకున్నా! కాని అది ఆడపిల్లనేనని ఋజువు చేసుకుంది"

భర్త ఆవేశం చూసేక అన్నపూర్ణమ్మ గారు ధైర్యాన్ని బలవంతాన తెచ్చుకుంది. ఇదేం పాతకాలమా? మనిషి వైజ్ఞానికంగా ఎంతగా ఎదిగాడు?

ఇంకా ఇటువంటి చిన్న విషయాన్ని కొండంతలుగా చేసుకుని కుంగిపోవటం, కుళ్ళిపోవటం కూడదని అనుకుంటూ ధైర్యాన్ని చెప్పుకుంది.

"ఇకనుంచైనా కాస్త కట్టడి చేసి, ఇంట్లోనే కట్టిపడేస్తే సరి. రెండోకంటి వాడికి తెలీకుండా వచ్చిన కష్టాన్ని దించే సుకుని, ఏదో ఒక సంబంధం చూసి..."

భార్య మాటలు పూర్తి కాకమునుపే ఆయన లేచి నిల్చున్నారు. మొదటి షాకు నుంచి తేరుకున్న ఆయన మొహం కోపంతో ఎర్రబడింది.

"అసలు దీనికంతటికీ కారణమైన ఆ రాస్కెలెవడో కనుక్కోవాలి"అంటూ మెట్లవైపుగా వెళ్ళబోయారు.

అన్నపూర్ణమ్మగారు ఒక్క పరుగున వెళ్ళి ఆయనకడ్డుగా నిలబడింది.

"తొందరపడకండి-ఇపుడు సమయం కాదు - నెమ్మదిగా నే తెలుసుకుంటాగా" అంది బతిమాలుతున్నట్లుగా.

కాని ఆయన వినిపించుకున్నారు కాదు. అసలు వినిపించుకునే స్థితిలో లేరు. అదొక ఉన్మత్తస్థితి.

"లేదు. తెల్సుకుంటేనేగాని నాకు మన శ్శాంతుండదు. లేకపోతే ఈ గుండె బద్దలయ్యే ప్రమాదం వుంది"

ఆ మాట విని ఆవిడ మరింత భయ పడింది.

"కేకలేసి రభస చెయ్యకండి...అల్లరి పెట్టడం మంచిదికాదు" అంది సలహా పూర్వకంగా.

పతంజలిగారు కూతురు గదివైపుగా వెళ్ళేరు.

శ్రీలేఖ పడుకునుంది.ఆమె మొహంలో బాధకన్నా నీరసమే కనిపిస్తోంది. చీరేమో కాళ్ళపైదాకా లేచింది. కాలికున్న గజ్జెల

పట్టెల్ని మంచంకేసి తాకించి గల్లుగల్లున శబ్దం చేస్తూ ఆ ధ్వనిని ఆలకిస్తోంది.

పతంజలిగారు గదిలోకొచ్చి అలాగే నిల్చుండిపోయారు.

పరాగ్గా పడుకునున్న కూతుర్ని రెండు క్షణాలు కన్నార్పకుండా చూసుకున్నారు. తన ఆశ, తన లక్ష్యం, తన గమ్యం అన్నీ అయిన ఈ పిల్లని మహారాణిని చెయ్యాలని, పిల్లలు వృద్ధిలోకి రావటం అనేది పెంపకాన్ని బట్టేగాని ఆడామగా వ్యత్యాసం చూపటం సమంజసం కాదని చెప్పాలని, రుజువు చెయ్యాలని అనుకున్నారు.

కాని జరిగింది?

అందరిలాగే వయసొచ్చి, కొందరిలాగ బుద్ధిరాక, తొందరపడి, ఆ తప్పని నిశ్శబ్దంగా చెరిపేసుకుని, నమ్మకాన్ని పోగొట్టుకుని, ఎవడినో పెళ్ళాడి, పిల్లల్ని కనిసంసారం రొచ్చులో పడి...జస్ట్ రొటీన్‌లైఫ్ - అది తప్పనికాదు.

వారాలు, నెలలు కష్టపడి, ఎండని, వానని ఎదిరించి, రాళ్ళని, ముళ్ళని తప్పించుకుని శిఖరం చేరతాడని గట్టి నమ్మకాన్ని కల్గించిన వ్యక్తి ఘోరంగా నమ్మకాన్ని దెబ్బకొట్టి, అంచనాలని తారుమారు చేసి భూమిపైకి దొర్లి పడ్డప్పుడు కలిగే నిరాశ, నిస్పృహ-అంతే!

శ్రీలేఖ అలికిడికి తలెత్తి తండ్రిని చూసింది. లేచి కూర్చుంది.

"వాట్ ... డాడీ ... నాట్ ఫీలింగ్ వెల్?" అని కుశలం అడిగింది.

పతంజలిగారిలోని ఆవేశం చప్పున జారిపోయింది.

కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

''ఇలా చేస్తావని అనుకోలేదమ్మా?'' అన్నారు బొంగురుగా.

''ఏం చేశాను డాడీ'' అంది. అది అమాయకత్వమో, అంతులేని ధైర్యమో అర్థం కాలేదు.

''డాక్టరు చెప్పిన సంగతి...''

"ఓ...అదా! దాన్ని గురించి అంతవర్రీ ఎందుకు డాడీ? అయిదొందలు...జస్ట్‌ఫైవ్ హండ్రడ్స్‌తోపరిష్కారమయ్యేదానికంత డీలా అయిపోతావేం డాడీ'' అంది చాలా తేలిగ్గా.

పతంజలిగారు నించోలేక మంచం చివర్న కూర్చున్నారు. కూతురి చేతిని చేతుల్లోకి తీసుకున్నారు. దుఃఖం ఆగింది కాదు. ఘొల్లుమన్నారు.

తండ్రి దుఃఖంచూసేక శ్రీలేఖకుకూడా గుండెల్లో అలజడిలా అనిపించింది.

"నే బాధ పడుతున్నది, భయపడుతున్నది జరిగిందాన్ని గురించి కాదమ్మా! నీకు ఆరోగ్యాన్ని, శరీరాన్ని ఎలా కాపాడుకోవాలో చెప్పానేగాని, నీచుట్టూ ప్రతిక్షణం కాటేసేందుకు సిద్ధంగా వుండే మృగాల్లాంటి మనుషుల్నించి ఎలా రక్షించుకోవాలో, దానిక్కావలసిన ఆలోచనల్ని, మనసుని, ఆరోగ్యపు చిట్కాలని చెప్పలేదమ్మా...అదే నా బాధ''

శ్రీలేఖ తండ్రి చెప్పిన ప్రతి మాటని తరచి తరచి ఆలోచిస్తూ మౌనంగా వుండిపోయింది.

అన్నపూర్ణమ్మగారుకూడా పైకొచ్చింది. కాని గదిలోపలికి రాకుండా గుమ్మం పక్కనే నిల్చుని వాళ్ళ సంభాషణని శ్రద్ధగా వింటోంది.

కాసేపటికి పతంజలిగారన్నారు-

"అతణ్ని ప్రేమించావా తల్లీ? అతడూ నిన్ను ప్రేమించాడా?"

శ్రీలేఖ తెల్లబోయి చూసింది, "ఎవర్ని డాడీ?''

"అదే-ఎవడయితే నిన్ను తొందర చేసేడో, ఎవడయితే నిన్ను మాటలుచెప్పి గారడిచేసేడో, ఎవడయితే నీ జీవితాన్ని ప్రగతిపథంలోంచి పక్క దారిలోకి తిప్పేడో...వాడిని"

శ్రీలేఖ తలొంచుకుంది.

"లేదు డాడీ...అటువంటిదేం లేదు, అతణ్ని నే ప్రేమించలేదు. కాని అతడికి నేనంటే పిచ్చిట...ప్రాణంట"

"అది అవసరం తీరకముందు మాట. అవసరంతీరేక, పనిపూర్తయ్యాక వాడికి నిన్నుచూస్తేనే పిచ్చిపడుతుంది. ప్రాణం పోతుంది. సరే ఇపుడు నీకొచ్చిన కష్టంలో భాగం పంచుకుంటాడా, పెళ్ళి చేసుకుంటాడా?"

శ్రీలేఖ ధైర్యం చెబుతున్నట్లుగా- "యస్...తప్పకుండా చేసుకుంటాడు. ఆ నమ్మకం నాకుంది" అంది.

కాస్తలో కాస్త ఆ మాట విన్నాక ఆవేశం,ఆదుర్దాలు అదుపులోకొచ్చినాయి.

"సరే-అదే మాక్కావలసింది. ఇంతకీ ఎవరతను ?" అనడిగారు పతంజలిగారు ఆదుర్దాగా.

శ్రీలేఖ బదులివ్వలేదు. తలొంచుకు కూర్చుంది.

"చెప్పమ్మా!ఎవరతను?" గుచ్చిగుచ్చి అడిగారు.

"క్షమించండి. ఇప్పుడే నేనేం చెప్ప లేను. నాక్కాస్త టైంకావాలి"

కూతురి సమాధానంవిని తెల్లబోయారు

"అంటే...?"

"మొదట్లో-అంటే డాక్టరు చెప్పి నపుడు ఇదసలు సమస్యే కాదనిపించింది. దీని ఖరీదు అయిదొందలే అనుకున్నా. కాని మీ బాధని, ఆవేదనలని చూసేక అంత తేలికయిన విషయం కాదేమోనన్న అనుమానం మొదలయింది. సరేనేనుతప్పు చేసానని, తొందరపడ్డానని అంటున్నారు. నా తప్పుని, తొందరపాటుని నన్నే దిద్దు కోనివ్వండి. నన్నేం అడక్కండి"

"కాని వాడెవడో చెప్పక తప్పదమ్మా నాకోసం"

తండ్రీకూతుళ్ళు అంత సామరస్యంగా మాట్లాడుకోవటంవిని గుమ్మంపక్కనున్న అన్నపూర్ణమ్మగారు ఆశ్చర్యపోయింది. అలాగే నిల్చుని వినసాగింది.

"నో డాడీ! ఇప్పుడు నేనేం చెప్పను. నా ప్రాబ్లమ్‌ని నన్నే సాల్వ్ చేసుకో నివ్వండి" అంది నిశ్చయంగా.

పతంజలిగారికి తెల్సు - ఒక్కసారి కూడదంటే ఆమెచేత చెప్పించటం, చేయించటం కష్టమని.

"సరేనమ్మా! నీ ఇష్టం"అని విసురుగా లేచి బయటికెళ్ళిపోయారు.

ఆయనటు వెళ్లగానే అన్నపూర్ణమ్మ గారులోపలికొచ్చింది.

"చిన్నీ! ఏమిటా మొండితనం? ఎవరా కుర్రాడని అడుగుతుంటే మాట్లాడవేం. ఇంకా చేసిన నిర్వాకం చాలక ఏమిటా మొండితనం" అంటూ కూతురు తన వంక కాక వెనక గుమ్మంవైపు భయంగా చూస్తుండటం గమనించి ఆవిడ వెనక్కి తిరిగిచూసింది.

పతంజలిగారు గుమ్మంలో నిల్చు న్నారు. ఆయన చేతిలో తుపాకి వుంది. దాన్ని తన ఎడంపక్కనించి తలకి గురి పెట్టుకున్నారు.

అన్నపూర్ణమ్మగారు భయంతో కద లేకపోయింది. అక్కడేనిల్చుని 'ఏవండీ' అని వెర్రికేక పెట్టింది.

"అక్కడే ఆగండి. ఈ అశాంతిని, ఆవేదనల్ని మోస్తూ నే బతకలేను. రేప

ట్నించి ఏ కుర్రాడిని చూసినా వీడే నా కూతుర్ని నాశనంచేసిన దౌర్భాగ్యుడను కుంటూ దుష్టపాలోచనల్ని చేసుకుంటూ మెల్లిమెల్లిగా చావలేను. అంచేతే..."

ఆయన ఒక చేత్తో తుపాకీని కదల కుండా పట్టుకుని రెండో చేతిని ట్రిగ్గర్‌పై వుంచరు. ఆయన్ని, ఆయన వాలకాన్ని చూస్తుంటే బెదిరించేందుకో, భయపెట్టేం దుకో చేస్తున్నట్లులేదు. మొహంలో ఆవేశం, దృఢ నిశ్చయం తొంగిచూస్తు న్నాయి.

శ్రీలేఖ మంచంపైనించి దిగి నిల్చొంది. కూతురి ఆలోచనని కనిపెట్టినట్లు, పతం జలిగారు "ఎవ్వరూ నాదగ్గరికి రావటానికి ప్రయత్నించకండి. నన్ను త్వరగా చంపేసినట్లవుతుంది" అన్నారు.

ఆ మాటతో శ్రీలేఖ వెనక్కి తగ్గింది.

అన్నపూర్ణమ్మగారు పెద్దగా అరచింది "ఏమిటే...తమాషాగాని చూస్తున్నావా? వాడెవడో త్వరగా చెప్పు. ఆలస్యమైతే ఆయన అన్నంతపనీ చేస్తారు"

అప్పటికీ శ్రీలేఖ మాట్లాడిందికాదు.

పతంజలిగారి వేళ్లు ట్రిగ్గర్‌పైని మెల్లి మెల్లిగా బిగుసుకుంటున్నాయి. క్షణాలు గడుస్తున్నాయి. భయంకరమైననిశ్శబ్దాన్ని ఛేదిస్తూ తిరిగి పతంజలిగారు "అన్నపూర్ణా నే ఓడిపోయా ... నాకు బతికే హక్కు లేదు. అంచేతే" ట్రిగ్గర్‌పైనవేలుని బిగిస్తూ కళ్లు మూసుకున్నారు.

అన్నపూర్ణమ్మగారు అక్కడే నిలబడి కదిలే ధైర్యంలేక వలవలా ఏడుస్తోంది.

ఏ క్షణానైన ధాంమ్మని శబ్దం విని పిస్తుందోనని ఆవిడ కళ్లు మూసుకుంది.

కొద్దిక్షణాలకి తుపాకీ శబ్దంకాక, కూతురి గొంతు వినిపించటంతో కళ్ళు తెరిచింది.

"సరే డాడీ. అతడెవడో చెప్తాను. కాని మీరు నాకో మాటివ్వాలి" అంది.

పతంజలిగారు తుపాకీని దింపేరు కాదు. అలాగే పట్టుకుని 'ఏవని' అనడి గారు.

"నే చెప్పిన ఆ వ్యక్తిని మీరేం అన కూడదు. ఈ విషయం గురించి ప్రస్తావన తేకూడదు. అతనితో నేనే మాట్లాడుకుని పరిష్కరించుకుంటా"

పతంజలిగారు ఒకే ఒక్కక్షణం ఆలో చించేరు. వెంటనే "సరే. అలాగే మాటి స్తున్నా. చెప్పు ఎవడు వాడు?"

శ్రీలేఖ తలొంచుకుంది.

మెల్లిగా, స్పష్టంగా, ధైర్యంగా చెప్పింది-

"సుబ్రమణ్యం"

* * *

సుబ్రమణ్యం ఆరోజు కాస్త ఆల స్యంగా లేచేడు. ఒళ్ళంతా బద్ధకంగా వుంది. ఆఫీసుకెళ్లాలనికూడా అన్పించటం లేదు.

బయట్నించి వూడుస్తున్నట్లుగా చీపురు శబ్దం వినిపిస్తోంది.

రమణే అయ్యుంటుందని బద్ధకాన్ని పక్కనపెట్టి లేచి బయటకొచ్చేడు. హను మాయమ్మగారు కొబ్బరిపుల్లల చీపురుతో దీక్షగా వూడుస్తోంది.

రామసూర్యంగారు శానిటరీ ఇన్ స్పెక్టర్లాగా నడుంపైని చేతులుంచుకుని పరిశీలనగా చూస్తున్నాడు.

సుబ్రమణ్యాన్ని చూసి నవ్వాలా వద్దాన్న మీమాంసలోపడి చివరికి నవ్వ కుండానే తలొంచుకున్నాడు.

కాని సుబ్రమణ్యం మాత్రం అడ్డా న్నగా నవ్వేసి దొడ్లోకెళ్ళబోయి టక్కున ఆగేడు.

కారణం- రామసూర్యంగారు నవ్వ పనికాదు.

గుమ్మం ముందు కారాగటం ాలకంగా.

కారొచ్చినా, విమానం వచ్చినా కూడా గకపోను.

ఆ కార్లోంచి పతంజలిగారు దిగటం త ఆగిపోయాడు.

ఊదుస్తున్న హనుమాయమ్మగారు, ర్యవేక్షిస్తున్న రామసూర్యంగారు కూడా న్లాపి నిలబడిపోయారు.

పతంజలిగారు తెల్లలుంగీ కట్టి, మాసి ోయిన గ్లాస్కో లాల్చీ తొడిగారు. ుహం పీక్కుపోయింది.గడ్డం మాసింది. యన వొంటినిండుగా బట్ట కట్టుకోగా ాడ్డం ఆ దంపతులకదే ప్రథమం. ంచేతే పన్లాపి నిలబడిపోయారు.

ఎప్పుడూ చిరునవ్వుతో చిందులేస్తూ చ్చే ఆయన ఆరోజు నిశ్శబ్దంగా, ిరాసక్తంగా, నిస్పృహగా గేటు తీసుకుని ోనికొచ్చేరు.

సుబ్రమణ్యం ఆయన్ని చూసి డొడ్లో ేయాల్సిన పనికి చుక్కపెట్టి గదిలో ొచ్చేడు.

రామసూర్యం దంపతులు తిరిగి వాళ్ళ ాళ్ళ పన్లోకి జొరబడ్డారు.

పతంజలిగారు నిట్టూర్పులొదుల్తూ చ్చి కుర్చీలో కూచ్చున్నారు.

సుబ్రమణ్యం నిలబడేవున్నాడు.

కొద్దిక్షణాలు ఎవ్వరూ మాట్లాడలేదు.

కాసేపటికి పతంజలిగారే మొదలు పెట్టేరు-

"మీ అమ్మా, నాన్నా బాగున్నారా?"

"బామ్మకి వొంట్లో బాగా లేదట! తగ్గేక వస్తామని రాశారు" అన్నాడు.

పతంజలిగారు అర్థమైనట్లుగా తలాడించి-

"అంటే ఇంతకుమునుపే రాశావన్నమాట" అన్నాడు.

"అబ్బే...బామ్మ చేత కబురెట్టించాను"

తలొంచుకు నిల్చున్న సుబ్రమణ్యాన్ని కోపంగా చూస్తూ-

"అంటే అంతా మొదట్నించి ఒక పథకం ప్రకారమే చేస్తున్నావన్నమాట" అన్నారు.

సుబ్రమణ్యం దాన్ని కాంప్లిమెంటుగా భావించాడు.

"అవునండి... మొదట్నించి కూడా ఏం చేసినా ఒక పథకం ప్రకారం చెయ్యటం నాకలవాటండి" అన్నాడు.

"పథకాల ప్రకారం మంచిపన్లు చెయ్యిగాని, ఇలా కొంపలు తీసే పనులు చెయ్యకు"

సుబ్రమణ్యం వులిక్కిపడ్డాడు. కొంపలు తియ్యటమేవిటి? కొంపతీసి ఏదైనా తప్పుగా అర్థం చేసుకున్నాడా? ''కొంపలు తియ్యటమేవిటండీ..'' అనుమానంగా అడిగాడు.

"కాకపోతే దీన్నేవంటారు- ఏదైనా ఉద్దేశముంటే చెప్పాలిగాని తొందరపడి, మోసంచేసి, నీ దయాదాక్షిణ్యాలపైన ఆధారపడేటట్లు చెయ్యటం తప్పు,అందుకే మీ నాన్నని పిలిపించి కొడుకు పెళ్ళి, మనవడిబారసాల ఒకేసారి చేసుకుంటాడో వేరేవేరే చేసుకుంటాడో అడుగుదామని"

సుబ్రమణ్యానికప్పుడు అర్థమైంది.

ఉదయాన్నే ఈయనొచ్చింది పలకరింపుకి, పరామర్శకి కాదని, ప్రత్యేకంగా పనికట్టుకుని ఏదో అతిముఖ్యమైన విషయాన్ని చెప్పటానికొచ్చాడని, ఆ విషయానికి, తనకి సంబంధం వుందని అనుకుంటున్నాడని కూడా అర్థమైంది.

"మీరంటున్నదేవిటో అర్థం కాకుండా వుంది" అన్నాడు అయోమయంగా.

"అదే నాకూ అర్థం కావటం లేదు, నువ్వు చేసినపని. స్నేహితుడి కొడుకు వయ్యుండి కూడా..." ఆపైన చెప్పటం ఇష్టం లేనట్లుగా అసహ్యంగా మొహం పెట్టారు.

సుబ్రమణ్యానికి కాస్త భయంగా కూడా అన్పించింది. "నేనేం చేశానండీ... ఏం తప్పు చెయ్యలేదే" అన్నాడు కాస్తగట్టిగా.

ఈసారి పతంజలిగారు ఆశ్చర్యంగా చూసేరు అతడి వైపు.

"ఈ కాలం కుర్రాళ్ళకి ఏదీ తప్పు కాదయ్యా! అసలు మిమ్మల్ని కనటం మేం చేసిన పెద్ద తప్పు"

"మీరేదో చెప్పటానికి సంశయిస్తున్నట్టుగా వుంది. ఫర్వాలేదు సూటిగా చెప్పండి"

"ఎలా చెప్పను! తలెత్తుకోకుండా చేసేరు మీరిద్దరూ....శ్రీలేఖ గర్భవతి" అన్నారు తలొంచుకుని.

సుబ్రమణ్యం గుండెల్లో ఏదో ఫెటేల్మని పేలింది.

ఇంతసేపూ పరోక్షంగా, ఎత్తిపొడుపుగా చెబుతున్నది ఈ విషయం గురించా?

తప్పువొప్పు అంటున్నారు. అమ్మ నాన్నలని పిలిపిస్తానంటున్నారు. మనవడి బారసాలంటున్నారు...అంటే?

"అంటే .... మీ వుద్దేశం?" అతి భయంగా అడిగాడు.

"నా వుద్దేశం కాదు... వూహాకాదు. మా పిల్ల స్పష్టంగా నువ్వేకారణమని చెప్పింది"

సుబ్రమణ్యానికి భయంపోయిధైర్యం, గౌరవంపోయి కోపం వచ్చేయ్.



"మీ పిల్ల అలా అని చెప్పేస్తే సరి పోతుందా?"

"కాకుండా పోతుందా?"

సుబ్రమణ్యం స్పష్టంగా చెప్పేడు-

"మీ పిల్ల చెప్పటంలోనో, మీర వినటంలోనో ఎక్కడో పొరపాట జరిగింది...నాకేం సంబంధంలేదు"

పతంజలిగారికి అప్పటివరకు అణ కష్టంపైన అపుకుంటున్న కోపం బుస్సున పడగవిప్పింది.

"ఏవిటి ... నీకు సంబంధం లేదా చేసిందిచాలక ఇంకా నమ్మించాలని,మభ్య పెట్టాలని ప్రయత్నమా?" అన్నార ఆవేశంగా.

వాళ్ళ మాటలు తుపాకి గుళ్ళలాగ దూసుకొచ్చి రామసూర్యంగారి చెవిని తాకేయి. పనాపి చాలా ఆసక్తిగా వింట న్నారు. భార్య, కూతురుకూడా వెనకాల అడేపన్లో వున్నారని ఆయన గమనించార కాదు.

"మీరు పెద్దవారని గౌరవం ఇస్తున్నా నాకేం తెలీదు-ఆ పాపం నాదికాదు"

ఆ మాట వినంగానే ఆయన లేచి నిల్చున్నారు. కోపంచేతవూగిపోతున్నారు. "సరే కానీ! మీ నాన్నని రానియ్యి. అంతా తేలుస్తా. ఆడదెప్పుడూ తొందరపాటుకు కారణమైనవాడిని కట్టుకోవాలని చూస్తుందిగాని, ఆ పరిస్థితిలో అబద్ధం ఆడదు"

అప్పటికే రామసూర్యంగారు భార్య ప్రోద్బలంతో వచ్చి గది గుమ్మంలో నిల్చున్నారు. కాస్త దూరంలో భార్య, కూతురు-

ఆయన్ని చూడగానే పతంజలిగారు మరింత రెచ్చిపోయారు.

"నా పిల్ల బతుకు బండల్చేసింది చాలక, ఇంకా నాకేం తెలీదని, సంబంధం



లేదని ఎలా బుకాయిస్తున్నాడో చూడండి! తుపాకీ తెచ్చుంటే కాల్చుండేవాడిని... కాదని ఎలా తప్పుకుంటావో నేనూ చూస్తా'' అనుకుంటూ పెద్దపెద్ద అంగలేసుకుంటూ వెళ్ళిపోయారు.

సుబ్రమణ్యం జీవితంలో అవి విషపు ఘడియలు. ఎదట నిల్చున్న ముగ్గురూ అతడివంక నేరస్థుడిని చూసినట్లుగా చూస్తున్నారు.

హనుమాయమ్మగారు కాస్సేపు నమ్మలేనట్లుగా చూసి, అదే పరిస్థితిలో వున్న కూతుర్ని 'ఏమిటి చోద్యం చూస్తున్నావా, పదమ'ని తీసుకెళ్ళింది.

రామసూర్యంగారు పెద్దగా నిట్టూర్చి వెళ్ళిపోబోతున్నారు.

సుబ్రమణ్యానికి జరుగుతున్నదేవిటో అర్థమైంది. తాను ముంగిలా, మూతి బిగించుకూర్చుంటే తప్పుని సగం ఒప్పేసుకున్నట్టే అవుతుందని విశదమైంది.

వెళ్ళిపోబోతున్న రామసూర్యంగారికి ఎదురెళ్ళి నిల్చున్నాడు-"నాకేం తెలీదండి! అనవసరంగా నానామాటలు అని వెళ్ళిపోయారు"

రామసూర్యంగారు అతడి కళ్ళలోకి చూస్తూ, "ఆ పిల్ల నీ గదికి రావటం నేచూశా. తలుపులు బిగించుకోవటంచూశా. ఒకరోజు ఆ పిల్ల ఏడ్చుకుంటూ వెళ్ళటం కూడా చూశా. మరి నువ్వేమో నాకేం తెలీదంటున్నావ్?'' అంటూ రెండోమాట కోసం ఎదురుచూడకుండా వెళ్ళిపోయారు.

ఆయన సుబ్రమణ్యాన్ని నమ్మటం లేదు. ఆ విషయం ఆయన చూపులే చెబుతున్నాయ్.

రామసూర్యంగారింట్లోకి వెళ్ళేసరికి పరిస్థితి ఏడుపులుగాను, సముదాయింపుగాను వుంది.

రమణి నేలపైన కూర్చుని మోకాళ్ళలో మొహాన్ని దాచుకుని ఏడుస్తోంది. హనుమాయమ్మగారు కూతురి పక్కనే కూర్చుని సముదాయించాలని ప్రయత్నిస్తోంది.

"ఇంకానయం దేవుడు మనం దున్నాడు. తొందర్లోనే తెల్సింది.

అమ్మో అమ్మో ఎంత అమాయకంగా ఏమీ ఎరగనట్లు వుంటాడో చూసేరా? మంచివాడు, బుద్ధిమంతుడు అనుకున్నాం. మనకేం తెల్సును!''

రామసూర్యంగారు భార్య నోటికి అడ్డు తగిలారు.

"పోన్లే - మనకెందుకొచ్చింది? వాళ్ళు వాళ్ళు తేల్చుకుంటారు" అన్నారు కాస్త దూరంలో కూర్చుంటూ.

"తేల్చుకోటానికేవుంది. ఆ పిల్లనిచ్చి అంటగడతారు. ఇంతకీ అతనేనంటారా? నేను కాదు మొర్రో అంటున్నాడు'' ఆసక్తిగా అడిగింది.

"అలా అనక నేనే మొర్రో అంటాడా వెర్రిపీనుగ! వాళ్ళు తలుపులేసుకున్నప్పుడు, ఆపిల్ల ఏడ్చుకుంటూ వెళ్ళినపుడే నాకనుమానం వచ్చింది! అతడు చెప్పేవన్నీ అబద్దాలే!"

"అంటే?"

రమణి వాళ్ళిద్దరి సంభాషణని ఆసక్తిగా వింటోంది.

"ఒకసారి వాళ్ళాఫీసులో పన్చేసే చూడామణి అనే కుర్రాడి గురించి కాస్త వాకబు చేసి చెప్పవయ్యా అంటే..."

"చెప్పాడుగా ఆ కుర్రాడు- పెద్ద గ్రంథసాంగుడని!"

"అదే చెప్పేది! అవన్నీ అబద్ధాలే! ఆ చూడామణికి ఒక్క వ్యసనం కూడా లేదు. నిప్పు, బంగారంలాటి సంబంధం.

"మరి ఎందుకలా చెప్పాడు?"

"అదేమోగాని, ఒక్కటి మాత్రం నిజం. అతడి మాటని నమ్మకూడదు! చాలా డేంజరు కుర్రాడు! పోన్లే మనకెందుగ్గాని, ఆ చూడామణి తల్లిదండ్రులకి చెప్పొచ్చా! మంచిరోజు చూసుకుని పిల్లని చూసుకోటానికి రమ్మనమని"

రమణి ఏడుపు ఆపింది. ఉరితాళ్ళు మెడ చుట్టూ బిగుసుకుంటున్నాయ్. ఏడిస్తే లాభం వుండదు. ఆలోచించాలి.

అంచేత ఆలోచించటం మొదలు పెట్టింది.



9

శ్రీలేఖ బజారుకెళ్ళటానికి తయారౌతోంది.

చాలారోజుల తర్వాత వీధి మొహం చూడబోతోంది. తల్లిదండ్రులు ఇల్లు కదలొద్దని అనేకవిధాల చెప్పి చూసేరు.

కాని స్నేహితురాలిని అర్జెంటుగా కలవాలని, చప్పున వచ్చేస్తానని చెప్పి ముస్తాబవుతోంది.

పతంజలిగారు సుబ్రమణ్యం గదికెళ్ళినట్లుగాని, అతడితో ఘర్షణపడినట్లుగాని

ఇంట్లో ఎవ్వరికీ చెప్పలేదు. అనవసరం అనిపించింది.

అన్నపూర్ణమ్మగారైతే కూతురి పరిస్థితి తెల్సినప్పట్నించి దిగులుపడిపోయింది. జబ్బు మనిషిలా ఒక పక్కన స్తబ్దుగా కూర్చుండిపోతోంది.

కాస్సేపటికి శ్రీలేఖ మామూలుగా, ఏ దిగులూ లేనట్లు గెంతుకుంటూ బయటి కెళ్ళింది.

అప్పుడు భార్యవద్ద విషయాన్ని కదిపి చూసేరు.

"దాన్ని డాక్టరు దగ్గరకి తీసుకెళ్ళి త్వరగా ఆ పని పూర్తిచేస్తే బావుంటుం దేమో."

"కాస్త దాన్ని తేరుకోనీండి"

"ఇలాంటివి వాయిదాలెయ్యకుండా ఎంత త్వరగా చేయిస్తే అంతమంచిది- దానికి, మనకి కూడాను"

అన్నపూర్ణమ్మగారు భర్తవంక దీనంగా చూస్తూ -

"అద్సరే-ఆపైన ఏంచేద్దావని! చదువు మాన్పించి పెళ్ళి చేసెయ్యటం మంచిదని పిస్తోంది" అంది.

"అలాగే... రేపు శేషగిరికి వుత్తరం రాస్తా"

"అంటే? ఇంకా ఆ కుర్రాడికే ఇచ్చి చేద్దావనా? నేథస్సే ఒప్పుకోను. అసలా పిల్లాడి మొహమే నేచూడదల్చుకోలేదు. ఇంకేదైనా మంచి సంబంధం చూడండి"

"కాని ఈ విషయం తెలిస్తే..."

"ఎలా తెలుస్తుంది. రెండో కంటి వాడికి తెలీకుండా చేయిస్తేసరి"

"సరే...అలాగేలే" అన్నారు పతంజలి గారు. తొందరపడి సుబ్రమణ్యం గది కెళ్ళి రభస చెయ్యకుండా వుంటే బాగుండేదనిపించింది.

ఆ రాత్రి శ్రీలేఖ భోంచేస్తుండగా అన్నపూర్ణమ్మగారు పక్క కుర్చీలో కూర్చుంది.

"రేపుదయం డాక్టరు దగ్గరకెడదాం" అంది సాధారణమైన ధోరణిలో. శ్రీలేఖ వుదయం బయటికెళ్ళినప్పుడు ఎంత సంతోషంగా వెళ్ళిందో వచ్చినదగ్గిర్నించి అంత దిగులుగా, స్తబ్దుగా కూర్చోటం తల్లిదండ్రులిద్దరూ గమనించేరు. కాని ఎవ్వరూ ప్రశ్నించలేదు.

"దేనికి?" తల్లివైపు ఆశ్చర్యంగా చూస్తూ అడిగింది.

"అదే... ఆ కాస్తా..."

మాట పూర్తికాకమునుపే శ్రీలేఖ ఖచ్చితంగా చెప్పింది- "నాకిష్టంలేదమ్మా" అని. అన్నపూర్ణమ్మగారికా మాట ఇంకోలా అర్థమైంది.

"అంటే వేరే డాక్టరు దగ్గరకి వెడదామనా?"

"అదీ కాదు. అసలాపనే నాకిష్టం లేదు"

ఆమాట విని ఆవిడ కంగారుపడింది.

"అదికాదే..మాట అర్థం చేసుకోవేం?"

"అర్థమైందమ్మా! కానీ నేచేసింది చిన్న తప్పు. మీరు చెయ్యమంటున్నది, చేయిస్తామంటున్నది పెద్ద తప్పు. అది నాకిష్టంలేదు"

అన్నపూర్ణమ్మగారికి కాళ్ళూ చేతులూ చల్లబడ్డాయ్. మెదడు మొద్దుబారింది. ఏం చెయ్యాలో తెలీక భర్తని పిలిచింది.

పతంజలిగారు పిలుపునందుకుని టక్కున 'ఏమిటి పిల్చావా' అనుకుంటూ వచ్చేరు.

"ఇది చూసేవా! డాక్టరు దగ్గరకి రానంటోంది"

"అలా అని అన్నావా లేఖా?"

"అవును డాడీ! అన్నాను. అయ్ వాంట్ టుహేవ్ ది బేబీ" అంది తల పైకెత్తి చూస్తూ.

పతంజలిగారికి ఏంచెప్పాలో అర్థం కాక అలానే కాస్సేపు నిల్చుండిపోయేరు. ఏవిటీపిల్ల? ప్రపంచాన్ని, తను ప్రతిరోజు చూసే సమాజాన్ని అర్థంచేసుకోదే? పెళ్ళి కావలసిన కుర్రాళ్ళు, వాళ్లాలోచన్లు, సాంప్రదాయాలు అర్థంచేసుకోకుండా మాట్లాడుతుందేవిటి? ఎలాచెప్పాలి? ఏవని చెప్పాలి?"

"అలాఅని ఎందుకు నిర్ణయించేవ్?" అడిగారు కూతురి పక్కనే కూర్చుంటూ.

"నాకు మోసంఅంటే పరమ అసహ్యం...అయ్ హేటిట్. మోసంచేసే వాళ్లని క్షమించను. నేను తొందరపడ్డాను నిజమే. కాని ఎవర్నీ మోసంచెయ్యలేదు. కాని మీరు చెప్పినట్లు చేస్తే అది మోసం అవుతుంది. అది నాకిష్టంలేదు. అందుకే నేపిల్లనికంటాను..తల్లినవుతాను"

"అంటే పెళ్లిచేసుకోవా?"

"దీనిక్కారణమైనవాడినే కట్టుకుంటా. అతణ్నొదల్ను"

పతంజలిగారికి అవకాశం చిక్కింది.

"కాని అతడు నాకేం సంబంధం లేదంటున్నాడు"

శ్రీలేఖ ఆశ్చర్యంగా తలెత్తి తండ్రి వంక చూసింది.

"ఎవరి సంగతి మీరనేది?"

"ఇంకెవరూ-ఆ సుబ్రమణ్యం"

"అంటే మీరెళ్లి అడిగారా?" కంగారుగా అడిగింది.

"అవును అడిగాను. నాకేం తెలీదని బుకాయిస్తున్నాడు"

"కాని నేవద్దన్నాగా! ఎంతపన్చేశారు డాడీ" అంది నొచ్చుకుంటున్నట్లుగా.

అన్నపూర్ణమ్మగారు ఏమీ మాట్లాడకుండా వాళ్లిద్దరి సంభాషణని ఆసక్తిగా వింటోంది.

"సరే...అతడేమో నాకేం సంబంధం లేదంటున్నాడు. రేపు పెళ్లికూడా చేసుకోనంటాడు. అయినా వెళ్లవా డాక్టరు దగ్గరకి?"

"వెళ్లను. అతడు పెళ్లిచేసుకుంటాడా సరేసరి. లేదూ- పెళ్లికాని తల్లిగానే బతుకుతా. అంతేగాని గుట్టుచప్పుడు కాకుండా తీయించేసుకుని, ఏమీ ఎరగనట్లు ఇంకోణ్ని చేసుకోవటం నా వల్లకాదు డాడీ! మీ పిల్లని ఎవడో మోసంచేశాడని తల్లడిల్లిపోతున్నారే కాని మీరు ఇంకో కుర్రాణ్ని మోసంచెయ్యాలని ఆలోచించటంలేదూ..."

"చూడమ్మా...నువ్వేదో వూహల్లో వున్నావ్. ఈ లోకం నువ్వు పుస్తకాల్లో చదివి, సినిమాల్లో చూస్తున్నట్టుగా లేదమ్మా! అడుగడుగునా కుళ్లు, కల్మషం, కపటం. పెళ్లిగాని తల్లిగా ఈ మనుషల మధ్యన బతకటం అంత తేలికైన సంగతి కాదమ్మా"

శ్రీలేఖ ముందున్న కంచాన్ని పక్కకి నెట్టింది. లేచినిలబడి-

"సరే డాడీ! అదే చూద్దాం. అందరిలాగా తలొంచుకునిపోవటంకన్నా, తలెత్తి నిలబడి ఏంజరుగుతుందో చూస్తా. పెళ్లి కాకుండా గర్భవతికావటం మీ సాంప్రదాయాల్లో, శాస్త్రాల్లో తప్పుకాని దాన్ని కప్పిపుచ్చుకుని ఇంకొకడిని మోసం చెయ్యటం తప్పుకాదు. కాని నా వుద్దేశం జస్ట్ ఆపోజిట్" అని వెళ్లిపోయింది.

అన్నపూర్ణమ్మగారు అయోమయంగా చూసి 'ఇప్పుడెలాగండీ' అంది.

"చిన్ని ఆవేశంలోవుంది. కొన్నాళ్ల

తర్వాత మళ్ళీ ప్రయత్నిద్దాం" అన్నారు.

ఆ రాత్రి శ్రీలేఖ ఆలోచనల్లనిండా సుబ్రమణ్యం రమణీ నిండారు.

* * *

పతంజలిగారొచ్చి గొడవచేసి వెళ్లినప్పట్నించి సుబ్రమణ్యానికి చాలా ఇబ్బందిగా వున్నట్టనిపిస్తోంది. ఎవరి మొహంలోకి చూడాలన్నా-కళ్ల కళ్ల కలపాలన్నా బెదురుగా వుంటోంది. ఈ అపవాదునించి ఎలా తప్పించుకోవాలో, తన అమాయకత్వాన్ని ఎలా ఋజువు చేసుకోవాలో అర్థంకాకుండా వుంది.

ఆరోజునించి అతడు దొడ్లోకెడితే హనుమాయమ్మగారు విసుగ్గా మొహం పెట్టి తలుపులు మూసుకుంటోంది. రామ సూర్యంగారు మొక్కల చాటునించి అతణ్ని గమనిస్తూనే తీరా అతడు చూసే సరికి అదోలా మొహంపెట్టి తల దించేసుకుంటున్నారు.

ఇహ రమణి సరేసరి! అసలు కంటికే కన్పించటంలేదు.

పోనీ పతంజలిగారింటికెళ్ళి శ్రీలేఖని నిలేసి ఎందుకిలా అబద్ధమాడేవని అడిగేయొచ్చు. కాని ఆమె అప్పుడుకూడా "అవును నువ్వేగా" అంటే తన మాట నమ్మకపోగా అక్కడున్న అందరూ తలోమాట అంటారు. కావాలని తిట్లు, శాపనార్థాలు వెళ్లి తెచ్చుకున్నట్లవుతుంది.

ఇంతకీ రమణికూడా తనలాంటివాడని నమ్మేసిందా? అందుకేనా కనీసం కనిపించనుకూడా కనిపించటంలేదు. ఎలా నమ్మించాలి? ఏం చెప్పి నమ్మించాలి?

సుబ్రమణ్యానికి ఆలోచించినకొద్దీ అయోమయం ఎక్కువవుతున్నట్లుగా అనిపిస్తోంది.

ఆఫీసుకెడుతున్నాడు - వస్తున్నాడు. తిండి సహించటంలేదు. దేనిపైనా ఆసక్తి వుండటంలేదు. ఉత్సాహం అడుగంటింది. గదిలోవుంటే ఆ మంచంలోను, ఆఫీసులో వుంటే ఆకుర్చీలోను వుంటాడు-ఎడతెగని ఆలోచనలతో.

ఆరోజుకూడా అప్పుడే తిరిగి తిరిగొచ్చి నీరసంగా పడుకున్నాడు. అంతలో రామ సూర్యంగారొచ్చారు. గడపలో నిల్చుని పేరుపెట్టి పిల్చారు.

సుబ్రమణ్యం ఉలిక్కిపడిలేచి లోపలికి రమ్మనమని ఆహ్వానించాడు. కాని ఆయన రాలేదు. చావుకబురు తెచ్చినట్లు అక్కడే నిల్చుని అతణ్ని బయటకి రమ్మన్నారు.

సుబ్రమణ్యం వెళ్ళాడు. వెళ్లి ఆయన ముందు తలొంచుకు నిల్చున్నాడు.

ఆయనకూడా రెండుక్షణాలు సందేహించి మెల్లిగా, చల్లగా చెప్పారు.

"అహ ఏంలేదు-మా రెండో అబ్బాయికి ఇక్కడికి బదిలీ అయిందిట. రేపు ఫస్టుకి ఫ్యామిలీని తీసుకొస్తున్నానని రాశాడు. వాడికి వేరేగది కావాలి. అంచేత నువ్వెక్కడన్నా గది చూసుకో. చూస్తే దొరక్కపోవు. కావాలంటే నేనూ చూస్తా"

సుబ్రమణ్యం తలెత్తిదీనంగా చూసేడు. ఆయన తలొంచుకున్నారు. ఆయన చెప్పే ప్రతిమాటా అబద్ధమని తెలుస్తూనే వుంది.

"అలాగేనండి" అంటూ నసిగాడు.

"అశ్రద్ధ చెయ్యకుండా చూసుకో. లేదంటే నే ఇబ్బందిపడాల్సి వుంటుంది" అనేసి నేలచూపులు చూసుకుంటూ వెళ్లిపోయారు.

సుబ్రమణ్యానికి పరిస్థితి విశదం అయింది.

దీన్నిబట్టి ఒక విషయం స్పష్టమైంది. రామసూర్యంగారు కూతుర్ని తనకిచ్చే విషయంలో మనసు మార్చుకున్నారు.

ఆడపిల్లల బతుకుల్తో ఆడుకునేవాళ్ళ జాబితాలో తన పేరుకూడా చేర్చారు. అందువల్లనే ఉద్దేశాన్ని మార్చుకుని తనకి ఉద్వాసన చెబుతున్నారు.

కాని రమణి సంగతేవిటి? తానుకూడా తల్లిదండ్రుల్లాగే ఆలోచించి మనసులో పువ్వుగడ్డని పడేసుకుని విరిచేసుకుందా?

గది ఖాళీచెయ్యాల్సి వచ్చినందుకు ఒకవిధంగా సంతోషంగా కూడా వుంది. పతంజలిగారు పంచాయితీ పెట్టినప్పట్నించి తనక్కూడా ఏవిటోగానే వుంటోంది. గది మారిస్తేనన్నా మనశ్శాంతి దొరుకుతుందేమోనన్న ఆశ. కాని రమణికి, తనకి మధ్యన పెద్ద అగాథం ఏర్పడుతుంది- అదొక్కటే బాధ.

సుబ్రహ్మణ్యం పంతంకొద్దీ రెండు రోజులు గదికోసం గాలించాడు

అదృష్టంకొద్దీ పక్కసందులోనే చిన్న రేకులషెడ్డు దొరికింది. ఇంకేం ఆలోచించకుండా బజానాఇచ్చి గదిని పుచ్చేసుకున్నాడు.

ఫస్టు తారీఖునాడు ఆఫీసునించి వచ్చేటప్పుడే రిషా పిల్చుకొచ్చేడు. సామానంతా మూటగా కట్టేడు. మంచం, పెట్టె, పుస్తకాలు, మూట — అన్నిటినీ రిషాలో పేర్చాడు.

గదిలో చివరిసారి చుట్టూ తలతిప్పి చూసేడు-ఏవన్నా మర్చిపోయానాన్చెప్పి. గోడపైన అతికించిన కాగితం కనిపించింది. "ఏదన్నా మరచిపోయావా"-కాలి వేళ్ళపై నిలబడి దాన్నికూడా చేతుల్లోకి తీసుకున్నాడు.

కదలబోతూ కిటికీవేపుగా చూసేడు.

రమణి నిల్చునుంది బయట కళ్ళనిండా నీళ్ళతో, మొహంనిండా దైన్యంతో, గుండెలనిండా దిగులుతో.

సుబ్రహ్మణ్యం గది బయటికొచ్చేడు.

"గది ఖాళీచేస్తున్నా" అన్నాడు మెల్లిగా.

రమణి కళ్ళలోంచి నీళ్లుజారి చెంపలపైన చారికలుగా మిగిలాయి.

"పక్క సందులోనే- గుడిపక్కన మేడలో" అన్నాడు.

ఆమె అలాగే నిల్చుని దీనంగా గదిముందు తనుపెట్టిన ముగ్గు వంక చూస్తోంది.

"నాకే పాపం తెలీదు. నేనెవర్నీ అన్యాయం, మోసం చెయ్యలేదు. దేవుడిపైన ఒట్టు. ఈమాట కనీసం నువ్వొకదానివైనా నమ్మితేచాలు. మిగతా ప్రపంచం దుమ్మెత్తిపోసినా చలించను. రమణీ! నేనీ గదిలోకొచ్చినపుడు నాకే ఆశలు లేవు. ఆలోచనలు లేవు. కాని ఇపుడు బరువెక్కిన గుండెతో వెడుతున్నాను. 'సత్యమేవ జయతే' అంటారు. అదే నిజమైతే నా నిర్దోషిత్వం తప్పక రుజువయ్యి తీరుతుంది. మనుషులు దూరమైనా ఆలోచన్లు దూరం కావు. ఇదిగో - ఇది నీవద్ద వుంచు. దీన్ని చూసినప్పుడల్లా నా మతిమరుపు, దానివల్ల నీకు కల్గిన శ్రమ...అన్నీ జ్ఞప్తికొచ్చి నన్ను గుర్తుండేలా చేస్తాయ్"

అని చేతిలోవున్న కాగితం మడతని ఆమెకందించి, ఆమెని దాటి హనుమాయమ్మగారికి చెప్పటానికని దొడ్లోకెళ్లాడు.

అతడు వెళ్ళగానే కాగితం విప్పి చూసింది - "ఏదన్నా మరిచిపోయావా" అనున్న ఆ కాగితాన్ని అలానే పట్టుకుని ఆ గది వాకిట్లోనే కూలబడింది.

హనుమాయమ్మగారు గుమ్మంలోనే నిలబడుంది.

"నేగది ఖాళీ చేస్తున్నా. మీ అబ్బాయి వస్తున్నారని చెప్పారు. నిజమో అబద్ధమో

తెలీదు ... కొందరు నిజం చెప్పినా నమ్మరు. ఇంకొందరు అబద్దం చెప్పినా నమ్మాలి. మీరందరూ నన్ను క్రూరుణ్ని, దుర్మార్గుణ్ని చూసినట్లు చూస్తున్నారు. సమయం రాకమానదు .... నిజాయితీ రుజువు కాకమానదు...వెళ్లొస్తా" అంటూ చరచరా వెళ్ళి రిక్షా ఎక్కి కూర్చున్నాడు.

కాసేపటికి రిక్షా కనుమరుగైంది.

కాస్సేపటికి రామసూర్యంగారు వచ్చారు. సుబ్రమణ్యం గది ఖాళీ చేసే సాడని తెల్సి విస్తుపోయారు. అతడంత త్వరగా, నిజాయితీగా చేస్తాడనుకోలేదు. ఆలోచిస్తూ కుర్చీలో కూర్చున్నారు.

హనుమాయమ్మగారంది–

"ఆ పిల్లాడి మాటలు, వాలకం చూస్తుంటే పాపం నిజంగా ఏం తెలీదేమో అన్పిస్తోంది"

అటూఇటూగా వూగుతున్న ఆయనాలోచన్ను తిరిగి గడకట్టేయ్.

"అలాగే అనిపిస్తుంది. కొంపలు తీసే వాళ్ళకి కబుర్లు చెప్పటం, జాలిగా మొహం పెట్టటం బాగా చేతనవుతుంది. సరే మన కెందుకు....గది కూడా ఖాళీ చేసి వెళ్లాడు గదా! ఇహ అతనెవరో మనమెవరో! అన్నట్లు రేపు పిల్లని చూసుకోటానికి వస్తున్నామని వాళ్లు కబురు పెట్టారు.

ఇంతకీ అమ్మాయేది?''

భర్త అడిగేదాకా ఆవిడకా ఆలోచనే వచ్చింది కాదు. ఇల్లంతా చూసి బయట కొచ్చి చూసింది.

గది గడపలో దీనంగా చేతిలో పొడు గాటి కాగితంతో కూర్చునున్న కూతుర్ని చూసింది. "అదేవిటి–చీకట్లో ఒకదానివి కూర్చున్నావ్?"

రమణి బదులివ్వలేదు.

"భోంచేద్దువుకాని పద"

"నాకొద్దు...ఆకల్లేదు"

"సరే...పోనీ ఇంట్లోకిపద"

"వస్తాలే... నువ్వెళ్లు"

ఆవిడ సన్నగా గొణుక్కుంటూ వెళ్ళి పోయింది.

ఆ రాత్రి రమణి భోం చెయ్యలేదు. తన గదిలో సుబ్రమణ్యం ఇచ్చిన కాగితాన్ని మంచంపై ఎదురుగా పర్చుకూర్చుంది.

కాస్సేపటికి ఏదో తళుక్కున ఆలోచన మెరిసింది.

పెన్నుని చేతిలోకి తీసుకుని కాస్సేపు ఆ కాగితంలో ఏవో మార్పులు చేసింది. తిరిగి పెన్నుని టేబిలుపై వుంచింది.

ఆ కాగితాన్ని తలగడ కిందుగా భద్రంగా వుంచుకుంది.

లైటార్పి నిశ్చింతగా పడుకుంది.

* * *

ఆ మర్నాటి సాయంత్రం–

హనుమాయమ్మగారు కాఫీఫలహారాలు తయారు చెయ్యటంలో హడావుడిగా వుంది.

రామసూర్యంగారు సుబ్రమణ్యం ఖాళీ చేసిన గదిలో కుర్చీలు సర్దుతున్నారు. ఉదయంనించి ఆయన హడావుడిగానే వున్నారు. గదిని పనిమనిషి చేత దులిపించి శుభ్రం చేయించారు. బిందెడు నీళ్ళు పెట్టి కడిగించారు. గుమ్మానికి రెండు మామిడి రెమ్మలు తెచ్చి కట్టారు. గుమ్మానికి ఇస్త్రీ కర్టెన్ తగిలించారు. రెండు మూడుసార్లు బజారెళ్లి కావలసిన వన్నీ తెచ్చి పడేశారు.

రమణి మాత్రం తనకేం పట్టనట్లు, పరాయింట్లో కూర్చున్నట్లు ఒక పక్కన కూర్చుంది.

"వెళ్లి మొహంకడుక్కుని బట్టలు

మార్చుకో-వాళ్ళొచ్చే వేళయింది" అంటూ వెంట తరిమింది హనుమాయమ్మగారు కూతుర్ని.

"నాకిష్టంలేదమ్మా" అంది ఇంకో వైపు చూస్తూ.

"ఏమిటీ! బట్టలు మార్చుకోవటమా? ఏమిటి ఇష్టంలేదు?" అడిగింది అర్థంకాక.

"ఈ తతంగం మొత్తం నాకిష్టం లేదమ్మా"

"అనుకున్నవన్నీ జరగవు. ఎక్కడ రాసిపెట్టుందో ఎవరికి తెల్సు. నా మాట విను, నా తల్లిగా" బతిమాలుతున్నట్లుగా అనేసరికి తప్పక లేచి దొడ్లోకెళ్ళింది.

మొహం కడిగి బొట్టు పెట్టుకుంది. ఉతికారేసిన చుక్కల వాయిలు చీర కట్టుకుంది. జుట్టుని పైపైనే సరిచేసుకుంది.

పెళ్ళివారొచ్చేరు.

చూడామణి, అతడి తల్లి, తండ్రి- ముగ్గురొచ్చేరు.

రామసూర్యంగారు వాళ్ళని గదిలో కూర్చోపెట్టి భోపాల్ గ్యాస్ ప్రమాదం పగ్గిర్నించి తన రిటైర్మెంటువరకు ఎన్నో విషయాలు చెబుతున్నారు.

హనుమాయమ్మగారు మొహం కడిగి చీర మార్చుకుని కాఫీ టిఫిన్లని సరఫరా చేసింది.

రామసూర్యంగారు పిల్లని తీసుకు రమ్మని భార్యకి చెప్పారు.

కొద్దిసేపటికి రమణి ధైర్యంగావచ్చి చూడామణి ఎదురుగా వున్న కుర్చీలో కూర్చుంది.

అక్కడికి రాబోయేముందు దిండు కింద కాగితాన్ని తీసుకుని చదివింది. "ఏదన్నా మరచిపోయావా సుబ్రమణ్యం? లేదు... మరచిపోలేదు" అనుకుని ఆ కాగితాన్ని తిరిగి దిండుకింద భద్రం చేసుకుని మరీ వచ్చింది.

చూడామణి ఆమెవంక కన్నార్పకుండా చూసేడు.

సింపులుగా బావుందనుకున్నాడు.

చూడామణికి దేవుడంటే నమ్మకం లేదు. ఆచారాలు, సాంప్రదాయాలన్నా గిట్టవు. అసలు పెళ్ళిచూపుల పేరున ఆడపిల్లని అంగట్లో పెట్టినట్లు చూట్టంగూడా గిట్టదు. కాని తల్లిదండ్రుల ప్రోద్బలం చేత రాక తప్పిందికాదు.

"పిల్లని ఏదైనా అడగాలనుకుంటే అడుగు" అని తల్లి అనటంతో-

"సరే. .కాసేపు మీరందరూ బయటకి వెళ్ళండి. పర్సనల్‌గా మాట్లాడాలి" అన్నాడు.

రమణికి ముందు భయంవేసింది.

"రండి. మా ఇల్లుచూద్దురుగాని" అని హనుమాయమ్మగారు చూడామణి తల్లిని లోనికి తీసుకెళ్ళింది.

రామసూర్యంగారు అతడి తండ్రిని బయటికి తీసుకెళ్ళి మొక్కల గురించి వివరించి చెబుతున్నారు.

గదిలో వాళ్ళిద్దరే మిగిలారు.

చూడామణి సంభాషణ మొదలు పెట్టేడు.

"నా పేరు చూడామణి. మీ పేరు?'

"రమణి"

"ఏం చదివారు?"

"బియ్యే-ఇంకో పార్టు పాసవ్వాలి"

"సరే.వీళ్ళు మనిద్దరికీ మ్యారేజి చెయ్యాలనుకుంటున్నారు. నాకు మీరు నచ్చేరు. నా గురించి మీ అభిప్రాయం ధైర్యంగా చెప్పండి. వైవాహిక జీవితానిక్కావలసింది ఆపేక్ష, ప్రేమగాని పిరికితనంకాదు"

రమణి మొదటిసారి తలెత్తి అతణ్ని చూసింది. ఎర్రగా వున్నాడు. లావుగా

వున్నాడు. జుట్టు బిరుసుగా వున్నట్లు పీచు లాగా లేచిపోతోంది. చిన్న నుదురు, పొడుగు మొహం. అనాకారికాదు. అలవాట్లు మంచివి, ఆస్తి వుంది.

"ఫర్వాలేదు ... వున్నదున్నట్లుగా ధైర్యంగా చెప్పండి" అన్నాడు మళ్ళీ.

రమణి తలొంచుకుని ఆపైన మెల్లిగా చెప్పింది-

"మిమ్మల్ని నేచేసుకోలేను"

ఆ సమాధానం ఆశించని అతడు ఆశ్చర్యపడ్డాడు.

"ఎందువల్ల..నాలో ఏమైనా లోపమా?"

"కాదు. నేనిదివరకే ఒకరికి మనసిచ్చాను"

చూడామణి ప్రతిమాటకి వేరువేరుగా ఆశ్చర్యపడుతున్నాడు.

"అభ్యంతరం లేకపోతేనే చెప్పండి. ఎవరతను?"

"సుబ్రమణ్యం అని మీ ఆఫీసులోనే పన్చేస్తారు"

"గుడ్‌లక్! మరి ఈ పెళ్ళిచూపుల తతంగమంతా దేనికి? ఈ సంగతి మీ వాళ్ళకి తెలీదా?"

"తెల్సు. కాని వాళ్ళకాయనపై మంచి అభిప్రాయంలేక"

చూడామణి రెండుక్షణాలు మౌనంగా కూర్చుని "ఉన్నదున్నట్లుగా చెప్పారు. థాంక్సు. మనసొకచోట, శరీరం ఇంకోచోట నిజంగా నరకం. ఆ నరకం నించి తప్పించారు"



"కాని ఇదంతా వాళ్ళకి తెలిస్తే...?"

"మిమ్మల్ని కేకలేస్తారు. నాకు తెల్సు. అంచేత పిల్ల నచ్చలేదని చిన్న అబద్ధం ఆడేస్తా... ఓకే?''

"థాంక్స్''

అంతలో వాళ్ళంతా లోపలికొచ్చేసారు.

రమణి అతడి వంక స్నేహపూర్వకంగా చూసి లేచి లోనికెళ్ళిపోయింది.

* * *

సుబ్రహ్మణ్యం గది మారాక పద్ధతి కూడా మార్చేశాడు. వేళకి స్నానం చెయ్యడు. భోంచెయ్యడు. బట్టలు నలిగినా, మాసినా పట్టించుకోడు. గడ్డం ఏపుగా పెరిగినా షేవు చేసుకోడు. ఆఫీసుకి ప్రతిరోజూ వెళ్ళటం లేదు. వెళ్ళిననాడు కూడా సమయానికి వెళ్ళడు. కాసేపు కూర్చుని చెప్పాపెట్టకుండా లేచి వచ్చేస్తాడు.

రోడ్ల వెంట లక్ష్యంలేకుండా తిరగటం, కానిపక్షంలో గదిలోనే పడుకుని దీర్ఘంగా అర్థంలేని ఆలోచనలు చెయ్యటం.

గది మార్చి పది రోజులవుతున్నా ఇంకా అక్కడి వాతావరణానికి అలవాటు పడక అంతా కొత్త కొత్తగానే అనిపిస్తోంది.

తలుపు తట్టిన చప్పుడవటంతో వులిక్కిపడి లేచాడు.

బాగా తెల్లవారింది. వెలుగు పూర్తిగా వచ్చేసింది. రాత్రి నిద్ర పట్టేసరికి బాగా పొద్దుపోయింది. అంచేత నిద్ర చాలక కళ్ళు మండుతున్నాయ్.

తలుపు మళ్ళీ చప్పుడైంది.

ఆశ్చర్యపోతూనే వెళ్ళి తలుపుతీశాడు. తీసి మరింత ఆశ్చర్యపోయాడు.



గడపలో బామ్మగారు నిల్చునుం[illegible] చేతిలో చిన్న సంచి, మొహాన చిరునవ్[illegible]

ఇంతటి విపత్కర పరిస్థితిలో ఆవి[illegible] రావటం, నిజంగా దైవప్రేరణే అని[illegible]చింది.

ఒక్కసారి ఆవిణ్ని చుట్టుకుని బావు[illegible]మన్నాడు. మనస్సులో పేరుకున్[illegible] కల్మషమంతా కొట్టుకుపోయేటట్టు[illegible] ఏడ్చేడు.

"సుబ్బులూ.. తప్పు! మొగవాడివ[illegible] ఏడవకూడదు. వూరుకో''అని చాలా సే[illegible] సముదాయిస్తేనేగాని వూరుకున్నా[illegible] కాదు.

ఆవిడ గదిలోకొచ్చి కూర్చుంది.

"అదేవిటే! వుత్తరం రాయకుం[illegible] వచ్చేవ్? ఒంట్లో ఎలా వుంటోంది ప్రశ్న వెంట ప్రశ్న కురిపించేడు.

"జ్వరం తగ్గింది కాని నీరస[illegible] ప్రాణం తీసేస్తోందనుకో. ఏవో గోళీ[illegible] బిళ్ళలు వాడుతున్నా. ఉత్తరం. అంది[illegible] ఉండబట్టలేక వచ్చేశా" అంది.

సుబ్రహ్మణ్యం ఆశ్చర్యపోయేడు.

"ఉత్తరమా? నేగాని రాసేనా?" అ[illegible]గాడు సందేహంగా.

"నువ్వు కాదు ఆ రామసూర్యంగ[illegible] పిల్ల రాసింది. జరిగినవన్నీ రాసిం[illegible] అయినా ఆ పతంజలి కూతురుక[illegible]పోయేకాలంరా- అలా అబద్ధాలాట్టం"

"అసలు నాకేం పాపం తెలీదే"

"నాకు తెలిదూ... నువు చెప్పా[illegible] ఆ పిల్ల అలా నోటికొచ్చినట్లు వా[illegible]తుందా, వీళ్ళేమో గది ఖాళీ చేయిస్తార[illegible] అందరూ కల్సి చిన్న వెధవని చే[illegible] ఏడ్పిస్తారా? మొన్న వచ్చినపుడూ వెం[illegible]పడి సేవల్చేసినవాళ్ళు ఇందాక బస[illegible] దిగి నీ గది తెలీక వాళ్ళింటికెడితే మొహ[illegible] తిప్పేసుకున్నారు. పాపం వాళ్ళమ్మా[illegible]

గుర్తుచెప్పి పంపించింది"

సుబ్రమణ్యానికి ఆవిడ రాకతో. ధైర్యం వచ్చింది. శుభ సూచకంగా అన్పించింది. లేచి మొహం కడిగి, షేవు చేసుకుని, స్నానంచేసి, బజారెళ్ళి కాఫీ పోయించుకొచ్చేడు. కాఫీ తాగేక బామ్మగారు 'వెళ్ళి ఆ పతంజలి కూతురితో మాట్లాడొస్తా'నంది

సుబ్రమణ్యం వద్దన్నాడు, ఇంకా గొడవ జరగటం తప్పించి వుపయోగ ముండదని అతడి వుద్దేశం.

అప్పటికి సరేనంది. సుబ్రమణ్యం అలా బజార్లోకెళ్ళి స్నేహితుడికి సెలవు చీటీ ఇచ్చొస్తానని వెళ్ళాడు. అతడు అలా వెళ్ళగానే బామ్మగారు గదికి తాళం పెట్టి, రిషా పిల్చి పతంజలి గారి అడ్రస్సు చెప్పి ఎక్కి కూర్చుంది.

ఆవిడెళ్ళేసరికి పతంజలిగారు పక్ష వాతపు రోగిలా కుర్చీలో ముడిచి పెట్టుక్కూర్చున్నారు. బామ్మగార్ని చూసేక మరిచిపోతున్న కోపం, బాధ గుర్తుకొచ్చేయ్.

బామ్మగారు మెట్లెక్కి పైకెళ్ళి "ఏం నాయనా ... బావున్నావా" అనడిగింది చనువుగా.

''ఎలా బావుంటాం చెప్పండి? మీవాడి పుణ్యమాని నా పిల్లబతుకు బండలైంది" అన్నారు బాధగా.

"అలా తొందరపడి మాటలనకండి! మా సుబ్బులు అలాంటి వాడుకాదు"

"అంటే ... నా కూతురలాంటిదా?'' అన్నారు మాటకి మాటగా.

సందడికి అన్నపూర్ణమ్మగారు, శ్రీలేఖ పైనుంచి దిగొచ్చారు:

"ఓహో...ఏం ఇలా దయచేసారు?" అంది అన్నపూర్ణమ్మగారు వ్యంగ్యంగా.

వాళ్ళ ధోరణి చూస్తుంటే బామ్మగారికి ఆశ్చర్యం వేసింది. కొద్దిరోజుల్లో ఎంతటి మార్పు?

''నా మనవడికి ఏం తెలీదని చెప్పా లనివచ్చా"

''మీకెలాతెల్సు.అలాఅని చెప్పాడా?" అంది అన్నపూర్ణమ్మగారు.

"మీరు పిల్లల్ని కంటారు. పాతికేళ్ళు పెంచుతారు. కాని వాళ్ళెలాంటివాళ్ళు, వాళ్ళ తత్త్వాలేవిటో అర్థం చేసుకోరు. నా మనవడి సంగతి నాకు తెల్సు. వాణ్ని ఇవిగో ఈ చేతుల్తో పెంచాను. అంచేత వాడి గుణగణాలు నాకు బాగా తెల్సు"

"అంటే మీరనేది మీ మనవడికేం తెలీదు. నాపిల్ల అబద్ధం ఆడుతోందనా" అడిగారు పతంజలి కోపంగా.

"అందులో ఎటువంటి సందేహం నాకులేదు" అంది తెగేసి చెప్పినట్లు. పతంజలిగారు కూతురివంక చూసి

"చెప్పవే! అలాచూస్తూ నిలబడిపోతావేం?" గద్దించారు.

కాని శ్రీలేఖ జవాబు చెప్పలేదు. తలొంచుకు నిల్చుంది.

"నువు చెప్పిన చిన్న అబద్ధంచేత రెండు నిండు జీవితాలు నిలువునా పాడైపోతున్నాయ్ ఆ రామసూర్యంగారి పిల్లని చేసుకుంటానని మోజుపడ్డాడు మా సుబ్బులు. ఆ పిల్ల వాడిమీద ఆశలు పెంచుకుంది. కాని వాళ్ళు ఈమాటవిని ఆ పిల్లకి వేరే సంబంధాలు చూస్తున్నారు. అక్కడా పిల్ల ఏడుపు. ఇక్కడ మా సుబ్బులు ఆఫీసుకి నాగాపెట్టి బాధపడు తున్నాడు'' ఆవేశంగా చెప్తోంది బామ్మగారు.

"అందుకు మమ్మల్నేం చెయ్యమంటారు?" అంది అన్నపూర్ణ ఈసడిం

పుగా.

"ఏం చెయ్యాలో ఆలోచిద్దామనే ఇలా వచ్చేను"

అంతలో పతంజలిగారందుకున్నారు-

''ఎంతసేపూ మీవాడిని గురించి, ఆ పిల్ల గురించేగాని నా కూతురి బతుగ్గురించి ఆలోచించరేమి?"

''అబ్బే..మనవి బతుకులుకావు-బంతరాళ్ళు" అంది అన్నపూర్ణమ్మగారు కోపంగా.

ఆ మాటలతో బామ్మగారికి అనుసయం వచ్చిపడింది.

"అదికాదమ్మా నేననేది! ఎవరిదైనా జీవితమే...కాదనం. కాని కాస్త మీపిల్లతో నేస్వయంగా మాట్లాడి విషయాలు తెల్సుకుందామని, తద్వారా అన్ని జీవితాలు సరిదిద్దుదామని ఇలావచ్చా"

శ్రీలేఖ అప్పుడు కలగజేసుకుంది.

''సరే బామ్మగారు! పైకిరండి. మనం మాట్లాడుకుందాం"

పతంజలిగారు, భార్య ఆశ్చర్యంగా చూసేరు.

"వెళ్ళండి. మీకే చెబుతుందిగా" అన్నారాయన.

బామ్మగారు శ్రీలేఖ వెనకే మేడపైకెళ్ళింది.

* * *

బామ్మగారు తిరిగొచ్చేసరికి సుబ్రమణ్యం కంగారుపడిపోతున్నాడు.

"ఎక్కడికెళ్ళినట్లు చెప్పాపెట్టకుండా?" గుళ్ళు గోపురాలు, వీధులు, చుట్టుపక్కల వాళ్ళ ఇళ్లు అన్నీ గాలించేడు. బామ్మజాడ తెలిసిందికాదు.

చివరికి ఒక అనుమానం కూడా వచ్చింది. 'అసలు బామ్మ నిజంగా వచ్చిందాలేక అలాగని కలకన్నానా'అని. గది కిటికీలోంచి తొంగిచూసేడు. కని పిస్తున్న పూలపూల సంచి కలగాదు సుమాని చెబుతోంది.

మరి ఏమైనట్లు?

రామసూర్యంగారింటికికూడా వెళ్ళేడు. గడపలోనే నిల్చుని గొంతు చించుకు అరిచాడు "బామ్మా" అంటూ.

బామ్మ రాలేదుగాని, రమణి బయటి కొచ్చింది. అతణ్ని చూసి నవ్వింది.

''మా బామ్మగాని వచ్చిందా?" అనడిగాడు.

''ఉదయంవస్తే మీగది గుర్తులు చెప్పి పంపాను"

"అవును...చెప్పింది. మళ్ళీ ఎక్కడికో చెప్పాపెట్టకుండా వెళ్ళింది"

రమణి ఏంబదులివ్వక చూస్తూ నిలబడి పోయింది.

సుబ్రమణ్యం వెనక్కి తిరిగాడు. ఆమె గేటుదాకా వెంటే వచ్చింది - ఏదో చెప్పాలని తాపత్రయం. చెప్పలేని పరిస్థితి. ఇంకా సేపుంటే బావుండుననే భావన.

ఇద్దరి ఊహల్లోను ఇవే ఉమ్మడి ఆలోచను.

"సరే వెడతా"అన్నాడు.

"వెళ్ళొస్తాననాలి"సరిదిద్దింది రమణి.

సుబ్రమణ్యం ఆమె కళ్ళలోకి చూసేడు, ఆ అధికారం వుందాన్నట్లుగా.

ఆమె ధైర్యం చెబుతున్నట్లుగా నవ్వింది.

సుబ్రమణ్యానికి ధైర్యం వచ్చింది ఆ నవ్వుని తల్చుకుని నాలుగేళ్ళు బతగ్గలడు. బలంగా అడుగులేసుకుంటూ తన గది వేపుగా వెళ్లాడు.

సుబ్రమణ్యం గదికి కాస్త దూరంగా కారాపింది శ్రీలేఖ. అందులోంచి బామ్మగారు దిగింది "సరే వెళ్ళొస్తా"అంది.

"అలాగే.నేచెప్పినవిషయాలు ఇంకెవరికీ తెలికూడదు. రేపు నేచెప్పినవేళకి మీ మనవడిని మా ఇంటికితెచ్చే పూచీమీది. నిజాన్ని రుజువుచేసే పూచీ నాది"

"సరే అలాగే" అని రెండడుగులువేసి మళ్ళీ ఏదో గుర్తుకొచ్చినట్లుగా వెనక్కి వచ్చి "మళ్ళీ అందరిముందర నా మనవడే కారణమని అనవుగా?" అనడిగింది.

శ్రీలేఖ చిత్రంగా నవ్వి..."అనను, ప్రామిస్" అంది.

బామ్మగారికి ఆ పిల్లమాటపైన నమ్మకం కుదిరింది.

అంచేత నిస్సందేహంగా వెళ్లిపోయింది.

శ్రీలేఖ కారుని రామసూర్యంగారింటి వేపుగా తిప్పింది.

సుబ్రమణ్యం బామ్మకోసం అన్ని చోట్లవెతికి నీరసంవచ్చి, ఏం చెయ్యాలో తెలీక, గది తాళం చెవికూడా లేకపోవటం చేత గడపలోనే నిల్చున్నాడు.

నవ్వుకుంటూ వస్తున్న ఆవిణ్ని చూసి ప్రాణం లేచొచ్చింది. ఆపైన కోపం కూడా వచ్చింది.

"ఎక్కడికెళ్లావే చెప్పాపెట్టకుండా?" అన్నాడు.

"ఎరుగున్నవాళ్లుంటేను. చూసొద్దామని వెళ్లా"

"నీకోసం వూరంతా తిరగలేక చచ్చా! చెప్పి వెళ్లొచ్చుగా. ఇంతకీ ఎవరే ఆ ఎరుగున్నవాళ్లు"

"నీకు తెలీదులే" అంటూ గది తలుపులు తెరచి లోనికెళ్లింది.

* * *

శ్రీలేఖ కారుని ఇంటిముందే ఆపి హారన్ మోగించింది.

రమణి బయటికొచ్చింది. కార్లోవున్న ఆమెని చూసి ఆశ్చర్యపడింది.

"గుర్తున్నానా?" అనడిగింది శ్రీలేఖ.

రమణి చురుగ్గా చూసి కరుగ్గా బదులిచ్చింది.

"కొంతమందిని అంతతేలిగ్గా మర్చిపోలేం..జీవితాంతం గుర్తుంటారు" అంది.

శ్రీలేఖ ముచ్చటగా నవ్వింది, "గుడ్! ఫర్వాలా మాటలు నేర్చావ్" అంది.

ఆసలామె ఎందుకొచ్చిందో అర్థం కాలేదు. ఒకవేళ...?

"అతను గదిఖాళీచేసి వెళ్లిపోయాడు" అంది.

"అతనెవరు?" అర్థంకానట్లు అడిగింది.

"సుబ్రమణ్యం"

"ఓహో! కాని నేవచ్చింది నీకోసం"

"నాకోసమా" అంటూ ఆశ్చర్యం ప్రకటించింది రమణి.

"అవును...నీకోసమే. నీతో కాస్త మాట్లాడాలి. చీర మార్చుకురా-పది నిముషాల్లో వద్దాంగాని"

శ్రీలేఖ కార్లోంచే మాట్లాడుతోంది. రమణి పక్కగా నిలబడుంది. అంతలో హనుమాయమ్మగారు బయటికొచ్చింది. ఆమెని చూసి మొహం మాడ్చుకుంది.

"రమణీ! త్వరగా వచ్చెయ్. ఇంకా చెయ్యాల్సిన పన్లు చాలా వున్నాయి. క్విక్" అంది.

రమణి చీర మార్చుకోటానికి లోనికెళ్లింది.

"పెళ్ళా?" అనడిగింది హనుమాయమ్మగారు.

"అవును..అలాంటిదే" శ్రీలేఖ జవాబు.

"ఎవరిది?"

"కావలసినవాళ్లది"

"మరి నీ పెళ్ళెప్పుడు ఆ సుబ్రమణ్యంతో"

"సుబ్రమణ్యం పెళ్లి త్వరలోనే అవు తుంది" అంది.

హనుమాయమ్మగారు అర్థంకానట్లు అయోమయంగా చూసింది. అంతలో రమణి చీర మార్చుకొచ్చింది. శ్రీలేఖ డోరు తెరిచింది. ఆమె ఎక్కబోతుండగా-

"ఎక్కడికి?" అనడిగింది హనుమా యమ్మగారు.

"ఇప్పుడే వస్తానమ్మా"

ఆవిడ కూతురి చెయ్యి పుచ్చుకుని వారిస్తూ, "ఏం అక్కరలేదు. సంసార పక్షంవాళ్ళతో స్నేహం చెయ్యాలిగాని.." మాటని పూర్తిచెయ్యలేదు.

కాని శ్రీలేఖ మనస్సులోనే ఆ మాటని పూర్తిచేసుకుంది. కోపంతో మొహం జేవు రించింది. కారుదిగి ఆవేశంగా హనుమా యమ్మగారి దగ్గరకొచ్చింది. సూటిగా చూస్తూ అడిగింది-

"నాతో వస్తే ఏవిటి అభ్యంతరం?" అని.

"మేం మీలాగా డబ్బున్నవాళ్ళం కాదు. మీరేంచేసినా చెల్లుతుంది. కాని మాకలా కాదు. అది పెళ్లికావలసిన పిల్ల. వున్నవి లేనివి దానికి నేర్పి..."

"పాడుచేస్తాననికదూ మీ వుద్దేశం! పాతికేళ్లుగా మంచిబుద్ధులే నేర్పారుగా! ఎందుకంత భయం"

"కడివెడు పాలల్లో ఒక్క ఉప్పుగడ్డ చాలన్నట్లు పాతికేళ్ళ మంచి పది నిమి షాల్లో సరి..."

"మా నాన్న నాకువెక్కువస్వాతంత్ర్యం ఇచ్చి పాడుచేసేడు. మీరేమో దాన్నివ్వక మీ పిల్లని పాడుచేసుకునేలా వున్నారు. ఒక మనిషిని ఇంకోడు పాడు చెయ్యటమన్నది ఎప్పుడూ జరగదు. అదంతా వొట్టిది. పదినిమిషాలు పరాయి వాళ్ళతో మాట్లాడితేనే పాడైపోయే మంచి తనం నాకొద్దు" అని ఆవిడ చేతిలో వున్న రమణి చేతిని బలంగాగుంజి, కారు తలుపుతీసి ఆమెనందులోకి నెట్టి, తలుపు ఫెళ్ళున మూసి, చుట్టూ తిరిగెళ్ళి తనూ కూర్చుని డ్రైవ్‌చేసుకుంటూ వెళ్ళి పోయింది.

హనుమాయమ్మగారికినోట్లోంచిరెండో మాట వచ్చిందికాదు.

రమణికంతా ఆశ్చర్యంగావుంది. ఆమె తనని ఎక్కడికి తీసుకెడుతోందో, ఎందుకు తీసుకెడుతోందో అర్థంకాకుండా వుంది. కాని భయంగా మాత్రం లేదు. శ్రీలేఖ వ్యక్తిత్వంపైన ఎందుకో నమ్మకం ఏర్పడుతోంది.

తలతిప్పి రెండుసార్లు ఆమెవంక చూసింది.

కాని శ్రీలేఖ దేన్నిగురించోఆలోచిస్తూ డ్రైవ్‌చేస్తోంది. పదినిమిషాల తర్వాత కారుని పెద్ద బట్టలషాపు ముందుఆపింది.

ఇద్దరూ దిగేరు.

ఆమె రమణి చేతిని పుచ్చుకుని లోనికి దారితీసింది.

రకరకాల చీరలు ఖరీదైనవి తీయిం చింది.

"ఇందులో ఏ శారీ బావుందో సెలక్టు చెయ్యి చూద్దాం" అదేదో పెద్ద పరీక్ష లాగా అంది.

"ఎవరికి?"

"బాగా కావలసినవాళ్ళకి"

రమణి అక్కడున్న చీరలన్నీ కాస్సేపు పరీక్షచేసింది. కనకాంబరం రంగు చీరెని పైకిలాగింది. "ఇది చాలా బావుంది- రంగు, డిజైను, బోర్డరుకూడా" అంది.

కళ్ళప్పగించి వాళ్ళిద్దర్నీ

తరచిచూస్తున్న షాపువాడితో, "చూట్టం అయిందా! అయ్యేక ఇదిగో ఈ శారీ, మ్యాచింగ్‌బ్లౌజు పేక్ చేయించు" అంది.

ఆ షాపువాడు కంగారుపడి, సిగ్గుపడి ఆ చీరెని తీసుకుని లోపలికెళ్ళాడు. పదినిమిషాల్లో పేకెట్టు చేత్తోపుచ్చుకుని ఇద్దరూ షాపులోంచి బయటికొచ్చేరు. తిరిగి కారెక్కారు.

వీధుల్లో రద్దీ తక్కువగావుంది. శ్రీలేఖ కారుని మెల్లిగా పోనిస్తోంది.

"ఏవిటలా చిక్కిపోయావ్" అనడిగింది రమణిని, దృష్టిమరల్చకుండానే.

"అబ్బే-ఏంలేదు"

"దిగులా?"

రమణి బదులివ్వలేదు - రోడ్డ వైపు చూస్తోంది.

"ఆ సుబ్రమణ్యాన్ని నిజంగా ప్రేమించావా?"

"దాన్నేవంటారో నాకు తెలీదు-కాని అతడంటే నాకిష్టం"

"ఎందుకు... ఏంచూసి? అందమా, చదువా, ఆస్థా, అంతస్తా?"

"అవన్నీ కాకపోవచ్చు-అసలు ఏదో చూసి ఇష్టపట్టంకూడా నాకు తెలీదు"

శ్రీలేఖ కొద్దిసేపు మౌనంగావుండి,

"అతడు ఏంచేసేడో విన్నావా?" అనడిగింది.

"విన్నాను"

"ఇంకా అతడంటే ఇష్టపడుతున్నావా?"

రమణి తనలో తాను మాట్లాడుకుంటున్నట్లుగా అంది-

"అతనలాంటివాడంటే ఎందువల్లనో నమ్మకం కుదరటంలేదు"

"అంటే-నేచెప్పేది అబద్ధమనా?"

"అబ్బే...అదికాదు నా వుద్దేశం" కంగారుగా అంది.

శ్రీలేఖ మెల్లిగా అంది.

"నువ్వాసుబ్రమణ్యాన్ని మర్చిపోవటం మంచిది. నేనతన్ని చేసుకోబోతున్నా"

రమణి ఆ మాటవిని వులిక్కిపడింది.

"ఆ మాట చెప్పటానికా ఇంతదూరం వచ్చింది. అయినా ఏంచూసి అతణ్ని కట్టుకుంటావ్-అందమా, చదువా, ఆస్థా, అంతస్తా?"

శ్రీలేఖ చిత్రంగా నవ్వింది.

"అవేవీ కావు-బుద్ధిగా, నమ్మకంగా పడుంటాడు"

రమణికి వుక్రోషంగా వుంది.

"కాని అతడు నిన్ను చేసుకోవటానిక ఇష్టపడాలిగా?"

శ్రీలేఖ తేలిగ్గా కొట్టిపారేసింద విషయాన్ని.

"ఆ విషయం దాడీ చూసుకుంటారు డబ్బుంది, దాడీ వున్నారు, తుపాకీవుంది. వొప్పుకోక ఏంచేస్తాడు?"

రమణి తలతిప్పేసుకుని వీధులవం చూస్తోంది. శ్రీలేఖ చెప్పిన విషయ గుండెల్లో తిరిగి కల్లోలంరేపింది. బాధ దుఃఖాన్ని అదుపుచెయ్యటం శక్తికిమించి పనిలా వుంది.

శ్రీలేఖ కారుని రోడ్డుపక్క ఆపింది జనసమ్మర్దంలేని రోడ్డు-

రమణి బయటివైపు చూస్తు కూర్చుంది.

శ్రీలేఖ చనువుగా ఆమె భుజంపై చెయ్యివేసింది. ఆమె తలతిప్పి చూసింద కళ్ళు ఎర్రటి మందారాల్లాగా వున్నాయ్ కళ్ళవెంట నీళ్లు జలజల రాలుతూ వున్నాయ్.

శ్రీలేఖకి ఆమె పరిస్థితి చూసే అనవసరంగా బాధపెట్టేనేమో అనిపి

చింది. తన బేగ్‌లోంచి కర్చీఫ్‌తీసి ఆమె కళ్లు తుడిచింది.

"నీ ప్రేమకి చిన్నపరీక్ష పెట్టేను... అంతే! అతడిపై నాకెటువంటి ఆశాలేదు"

రమణి ఆశ్చర్యంగా చూసి కళ్లు తుడుచుకుంది.

"దుర్మార్గుడు, కసాయివాడైన మొగాడి కంటే మేధకుడు, అమాయకుడే నయం. ఆ విషయంలో నువ్వు చాలా లక్కీ" అంది.

రమణికి జారిపోయిన ఆశ, ధైర్యం తిరిగి తలెత్తాయి.

"కాని" .

"పెళ్ళవ్వాలిగా అంటావ్ అంతేగా! అవుతుంది. నాకు తెల్సు. అందుకే అడ్వాన్సు గిఫ్టు" అని షాపులో కొన్న చీర పేకెట్టుని అందించింది.

రమణి మొహమాటపడింది.

"వద్దండీ! మీకెవరో కావాల్సినవాళ్ళ కోసం కొన్నది నాకెందుకు?"

"ఏం...నువ్వు నాకు కావాల్సినదానివి కావా? నీ కోసమే నేకొన్నది. నాకు అక్కలు, చెల్లెళ్ళు ఎవరూలేరు. ఆ లోటు ఎన్నడూ లేంది ఇప్పుడు తెలిసొస్తోంది. అన్నివిషయాలు అందరికీ చెప్పుకోలేం. చివరికి అమ్మానాన్నలకికూడా! అటువంటప్పుడు సమవయస్సువాళ్ళయినా అక్కగాని, చెల్లెలుగాని వుంటే ఎంత బాగుంటుంది? నీతో మాట్లాడుతుంటే కాస్త రిలీఫ్‌గా వుంది"

రమణి ఆమెని ఆశ్చర్యంగా చూసింది. పైకి కనిపించే కరుకుదనం, చిలిపితనం వెనకాల గుండె లోతుల్లో ఏదో చెప్పుకోలేని ఆవేదన, బాధ వున్నాయని గుర్తించింది.

శ్రీలేఖ తల విదిలించి తిరిగి కారు స్టార్టు చేసింది.

వీధి మొదట్లోనే కారునాపింది. రమణి దిగబోయింది.

"ఇంతకీ మీవాళ్ళు నిన్ను ఆ సుబ్రమణ్యానికిచ్చే విషయంలో అభిప్రాయం మార్చుకున్నారు కదూ"?

అవునన్నట్లుగా తలూపింది రమణి.

"దానికి నేనే కారణంకదూ! నేచెప్పిన మాటవల్లనేగా వాళ్ళావిధంగా కాదంటున్నారు?"

"అవును. అతడు మంచివాడుకాదని, ఇంకెంతమంది ఆడవాళ్ళతో సంబంధాలు వున్నాయోనని వద్దంటున్నారు"

శ్రీలేఖ తలాడించింది.

"సరే....ఓ పన్చెయ్యి. రేపు వుదయం పదిగంటలకి మీ అమ్మని, నాన్నని తీసుకుని మా ఇంటికి రావాలి"

"దేనికి?"

"సుబ్రమణ్యం నిర్దోషిత్వం వాళ్ళకే తెలిసొస్తుంది"

రమణి మొహంలో సంతోషపు వెలుగు.

"అంటే ఆయనకేంతెలీదా.మరెవరు?"

"అన్నీ రేపే తెలుస్తాయి. అంచేత తప్పకుండా మీ అమ్మానాన్నలని వెంట పెట్టుకువచ్చేయ్"

"కాని వాళ్లు రానంటే....?"

శ్రీలేఖ కారుని స్టార్టు చేసింది.

"కోరుకున్న మొగాణ్ని కట్టుకోవాలంటే ఆమాత్రం అవస్థపడాలి ... తప్పదు" అని ఏమంటావ్ అన్నట్లుగా చూసింది.

రమణి ఏదో నిశ్చయానికొచ్చినట్లుగా! "సరే...అలాగేవస్తాం...ప్రామిస్" అంది.

శ్రీలేఖ వస్తానన్నట్లుగా చెయ్యివూపింది. కారు కదిలింది.



బామ్మగారు ఆరింటికే లేచింది. సుబ్రమణ్యాన్ని లేపింది...త్వరగా మొహం కడగమని, స్నానం చెయ్యమని తొందర చేసింది.

సుబ్రమణ్యం పనులన్నీ పూర్తిచేసుకుని బట్టలేసుకున్నాక అడిగాడు-

"ఏమిటే హడావుడి?" అని.

"అర్జెంటుగా ఇప్పుడు మనం ఒకళ్ళింటి కెళ్ళాలి"

సుబ్రమణ్యానికర్థమైందికాదు - "ఎవరింటికి? ఎక్కడ...ఎందుకు?" వివరాలడిగాడు.

"ఎక్కడికని అడక్కూడదు. పనులు కావు. చాలా ముఖ్యమైనపని. అక్కడిగ్గాని వెళ్ళకపోతే జీవితాంతం బాధపడాల్సి వుంటుంది. ఆపైన నీ ఇష్టం"

సుబ్రమణ్యం మరేం మాట్లాడలేదు.

గదికి తాళంపెట్టి రోడ్డుపైకొచ్చి రిక్షా పిల్చాడు. ''ఎక్కడికని చెప్పాలే?''

"పతంజలిగారింటికి మాట్లాడు"

ఆమాట వినగానే సుబ్రమణ్యం మొహంలో బాధ, అసహ్యం...

"అక్కడికయితే నేరానే. ఆ పిల్ల మొహం చూడదల్చుకోలేదు. అందరూ తలోమాట అంటుంటే తప్పుచేసినట్లుగా నిలబడ్డం నాకిష్టంలేదు''

బామ్మగారు బతిమాలుతున్నట్లుగా అంది-

"అలా అనకు. నా మాటవిను. నీ మంచికోరే నేచెబుతున్నా-రిక్షా బేరం ఆడు"

సుబ్రమణ్యం మరేం అనకుండా రిషా ఎక్కి కూర్చున్నాడు.

వాళ్ళిద్దర్నీ తీసుకుని రిషా కదిలింది.

సరిగ్గా అదే సమయానికి రామసూర్యం గారింట్లో కూడా అదే విషయంపై తర్జన భర్జనలు జరుగుతున్నాయ్.

"ఇపుడు వాళ్ళింటికెందుకమ్మా? వాళ్ళేం మనకి చుట్టాలా, స్నేహితులా?" అన్నారు రామసూర్యంగారు కూతురు చెప్పిన మాటవిని.

"కాని తప్పకుండా వెళ్ళాలినాన్నా" ఆదుర్దాగా అంది.

హనుమాయమ్మగారు కన్నునుంది-

"ఏవిటే...పిచ్చిమాటలు నువ్వూను! పిలవకుండా ఎవరింటికైనా వెళ్ళటం ఎప్పుడన్నా ఎరుగుదుమా"

"తప్పు.అలా ఎవరింటికపడితే వాళ్ళింటికి వెళ్ళకూడదు. అందులో వాళ్ళమ్మాయి కష్టంలో వున్నప్పుడు మనం నవ్వుకుంటూ వెడితే వాళ్లు అపార్థం చేసుకుంటారు"

రమణికి వాళ్ళిద్దర్నీ వప్పించటం కష్టతరమైన పనిగా అర్థమైంది.

"సరే...నాకోమాట చెప్పండి" అంది ఇద్దర్నీ వుద్దేశించి.

"ఏవిటది?" అంది తల్లి.

"నిజంగా నేను జీవితమంతాసుఖంగా, సంతోషంగా వుండటమేనా మీక్కావలసింది?"

"అదేవిటమ్మా అలా అంటావ్. మాకేవిటి...ఏ తల్లిదండ్రులకైనా కావలసింది అదేగా?" అన్నారు రామసూర్యం గారు ఆప్యాయంగా.

"నిజంగా మీరు కోరేది అదే అయితే ఈ ఒక్కసారికి నేచెబుతున్నట్లుగా నాతో రండి" అంటున్నప్పుడు ఆ మాటల్లో ఆదుర్దా, మొహంలో భయం, కళ్లలో నీళ్లు....

భార్యాభర్తలిద్దరూ మొహం మొహం చూసుకున్నారు. ఎందుకీ పిల్ల ఇంతగా బాధపడుతోంది? ప్రాధేయపడుతోంది? అర్థం కాని విషయం ఏదన్నా గానివుందా?

"సరే ... అలాగే వెడదాం.కాని అక్కడేదైనా అవమానం జరిగితే వెంటనే వచ్చేస్తాం" అన్నారు రామసూర్యంగారు.

ముగ్గురూ బయటికొచ్చిఆటోఎక్కారు.

ఆటో కదిలింది.



## 10

ఉదయం పదిగంటలు...

పతంజలిగారు ఇంటి ముందరి ఆవరణలో పచార్లు చేస్తున్నారు. ఆయన వెనకే బోసుబాబు. అతడు అప్పుడే వచ్చాడు. ఇల్లంతా నిశ్శబ్దంగా వుండటం చేత ఆశ్చర్యపడ్డాడు.

"ఏవిటి సార్ ఇంట్లో ఎవ్వరూ లేరా?" అనడిగాడు వస్తూనే.

పతంజలిగారు దీర్ఘాలోచనల్లోవుండటం చేత అతడి ప్రశ్నకి బదులివ్వారు కాదు.

ఆయన పరధ్యానాన్ని పసిగట్టి బోసు మరేం మాట్లాడకుండా, ఎందువల్లనో వెళ్ళిపోకుండా అక్కడున్న కుర్చీలో కూర్చున్నాడు.

శ్రీలేఖ తల్లి కాబోతోందని తెల్సినప్పటినించీ పతంజలిగారు బాధపడని క్షణంగాని, భయపడని క్షణంగాని లేదు.

కూతురు చేసిన తప్పుని, తొందర పాటుని తొలగించుకునేందుకు సమ్మతిస్తే గుడ్డిలో మెల్లగా సరిపెట్టుకుని సమాధానపడేవారు. కాని ఆమె సమ్మతించక చేసిన తప్పుని, కడుపులో పెంచుకుంటోందని రోజురోజుకి ఆ పాపం పెరిగి ఆకారం దాలుస్తోందన్న ఆలోచన ఆయన్ని అన్ని విషయాలనుంచి విముఖుణ్ణి చేసి మనసులో మంటల్ని రేపుతోంది.

ఆయన వింతగా దిక్కుతోచనట్లుగా తిరుగుతుండగా లోపల్నించి శ్రీలేఖ వచ్చింది.

ఆమె తలార స్నానం చేసింది. జుట్టుని పాయలుగా ముడేసుకుంది. ఎర్రటి పట్టుచీరె కట్టుకుంది. మొహాన పొడుగాటి కుంకుమ బొట్టు పెట్టుకుంది.

మెట్లు దిగి తండ్రివద్దకొచ్చింది.

కూతుర్ని చూసి పతంజలిగారు పచారు ఆపి ఆమె వంక ఆపేక్షగా చూసేరు.

"ఏవిటి డాడీ... అలా చూస్తున్నారు?" అంది ఆశ్చర్యపోతూ.

"ఏంలేదమ్మా... ఇవ్వాళ మహలక్ష్మిలా వుంటేను" మాటని పూర్తి చెయ్యలేకపోయారు. గుండెల్లోని బాధ గొంతుకు అడ్డం పడింది.

శ్రీలేఖ తేలిగ్గా నవ్వి-

"డాడీ...ఇవ్వాళ మనింటికి గెస్టులొస్తారు'' అంది.

"ఎవరమ్మా...నీ ఫ్రెండ్సా?"

"ఎవరో చెప్పను- చూసేక మీకే తెలుస్తుంది. కాని ఒక మాటివ్వాలి"

బోసుబాబు వింతగా చూస్తున్నాడు వాళ్ళిద్దరి వంక.

"ఏం మాటివ్వాలి?"

''ఇవ్వాళ ఎవళ్లు మన గుమ్మంలో కొచ్చినా, వాళ్ళనేం అనకుండా మామూలుగా ట్రీట్ చెయ్యాలి. ఓకే"

"నువు చెప్పింది ఏది ఎప్పుడు కాదన్నానో చెప్పు. కాని..."కనుకొలకుల్లో నిండిన నీటిని తుడుచుకుంటూ ఏదో అడగబోయారు.

కాని అందుకామె అవకాశం ఇవ్వకుండా-"ఇంకేం అడక్కండి! ఇవ్వాళ నా జీవితంలో ఓ మంచి పని చెయ్యబోతున్నా. వివరాలడక్కండి''అని తండ్రిని చెయ్యిపట్టి తీసుకొచ్చి కుర్చీలో కూర్చోబెట్టింది.

బోసుబాబు చిన్నగా నవ్వుతూ, "ఇవ్వాళ అమ్మాయిగారు మాంచి మూడ్‌లో వున్నట్లుంది" అన్నాడు.

"కరక్టు. ఇవ్వాళ్టే సరైన మూడ్లో కొచ్చింది" అనేసి 'ఇప్పుడేవస్తా'నంటూ పైకెళ్ళింది.

పతంజలిగారు, బోసుబాబు అర్థం కానట్లు మొహాలు చూసుకున్నారు.

కొద్దిక్షణాలకి ఆమె తిరిగి కింది కొచ్చింది. చేతిలో గాజుగ్లాసు- దాన్నిండా సేమ్య పాయసం. గ్లాసుని తండ్రి కందిస్తూ "తీసుకోండి డాడీ" అంది.

"ఏవిటమ్మా ఇదంతా?ఏవిటి విశేషం" అనడిగారు పాయసం గ్లాసువంక చూస్తూ.

"మీకిష్టమైన పాయసం డాడీ!ఒకసారి నేచేస్తే మమ్మీకన్నా బాగా చేసేనని మెచ్చుకున్నారు గుర్తుందా? ఆతర్వాత చాలాసార్లు చేసిపెట్టమని అడిగారు కూడాను. కాని బద్ధకించేను"

"అద్సరే...ఇవాళ చెయ్యటానికి కారణం?"

"అదిమాత్రం అడక్కండి. కాస్సేపట్లో మీకే తెలుస్తుందిగదా"

పతంజలిగారు కూతురి అల్లరితనానికి చిన్నగా నవ్వి-

"మరి బోసుకివ్వలేదేం?" అనడిగారు.

"అతడి వాటా అతడికుంది. తర్వాత పుచ్చుకుంటాడు. మీరుకానివ్వండి" అంది బోసువంక అదోలా చూస్తూ.

"అవునవును...మీరు కానివ్వండి" అన్నాడతను.

పతంజలిగారు పాయసం గ్లాసుని పైకెత్తారు.

సరిగ్గా అదే సమయానికి గేటు ముందు రిక్షా ఆగింది.

అందులోంచి సుబ్రమణ్యం, బామ్మగారు దిగేరు.

వాళ్ళని చూడగానే పతంజలిగారికి నోట్లోవున్న పాయసం అరుచిగా అన్పించినట్లు అసహ్యంగా మొహంపెట్టేరు. కాని కూతురు ముందుగానే అతిథులొస్తారని చెప్పటంచేత అసహ్యాన్ని బలవంతాన ఆపుకుని, మొహంలో ఏ భావం లేకుండా జాగ్రత్తపడ్డారు.

రిక్షాదిగిన వాళ్లిద్దరూ గేటుదాటి మెల్లిగా ఇంటివైపుగా వస్తున్నారు. శ్రీలేఖ ఆప్యాయంగా, ఆదరంగా ఎదురెళ్ళి ఆహ్వానించింది.

సుబ్రమణ్యం ఆమెవంక చూడటం ఇష్టంలేనట్లు తలొంచుకున్నాడు.

శ్రీలేఖ వాళ్లిద్దర్నీ తీసుకొచ్చి తండ్రికి ఎదురుగావున్న కుర్చీల్లో కూర్చోపెట్టింది.

సుబ్రమణ్యాన్ని బోసుకి పరిచయం చేసింది, "ఈయనే సుబ్రమణ్యం. డాడీ ఫ్రెండ్ కొడుకు" అని.

బోసుబాబు అతడివంక వింతగా చూసేడు.

"సల్లెమ్మా! ఇప్పుడవన్నీ ఎందుకు?" అన్నారు పతంజలిగారు అయిష్టంగా మొహంపెట్టి.

శ్రీలేఖ ఎందుకో పైకి వెళ్ళింది.

సరిగ్గా అదే సమయానికి వీధిలో ఆటో ఆగింది.

రామసూర్యంగారు భార్యా కూతురితో అందులోంచి దిగేరు.

పతంజలిగారికిదంతా అయోమయంగా అనిపిస్తోంది. ఎందుకు వీళ్ళందర్నీ పిల్చినట్లు? అకారణంగా శ్రీలేఖ ఏ పనీ చెయ్యదని ఆయనకో గొప్ప నమ్మకం. ఒకవేళ ఈ సుబ్రమణ్యంగాడు చేసిన పనిని అందరిముందు బట్టబయలు చెయ్యాలనా? అలా అయితే తనకీ సంతోషమే. ఇల్లాంటి వెధవలకి పబ్లిగ్గా సన్మానం జరగాల్సిందే!

ఆ ఆలోచన రావటంతో ఆయన్లో క్షణంక్రితంలేని వుత్సాహం వచ్చివాలింది.

అప్పటికే రామసూర్యంగారు ఫ్యామిలీ సమేతంగా వచ్చి గడపలో నిల్చున్నారు.

శ్రీలేఖ అక్కడ లేకపోవటంచేత పతంజలిగారే స్వయంగా ఆహ్వానించారు. "రండి. అలా కూర్చోండి" అంటూ ముగ్గురికీ కుర్చీలు చూపించారు.

అందరూ నిశ్శబ్దంగా పరిచయం లేని వ్యక్తుల్లాగా మొహాలు చూసుకుంటూ కూర్చున్నారు. కాని అందరికీ ఒకటే అనుమానం, అర్థంకాని విషయం! "ఎందుకిలా ఆహ్వానించినట్లు" అని.

సుబ్రమణ్యంకి, రమణికి మరీ పజిల్‌గా అర్థం కాకుండా వుంది పరిస్థితి. అయోమయంగా మొహాలు పెట్టి నిశ్శబ్దంగా ఎవరి ఆలోచనల్లో వాళ్ళున్నారు.

అన్నపూర్ణమ్మగారు పైనుంచి దిగి, ఆసీనులైవున్నవాళ్ళందర్నీ చూసి ఆశ్చర్యపోయింది. ఏం జరుగుతోందో

అర్థంకాక వెర్రిగా భర్తవంక చూసింది. భార్య చూపుల్ని, దాంట్లో భావాల్ని అర్థం చేసుకున్నట్లుగా—

"చిన్ని వీళ్ళందర్నీ తను చేసిన పాయసం తాగటానికని ఆహ్వానించింది" అన్నారు మర్యాదకి నవ్వుతూ.

అన్నపూర్ణమ్మగారు భర్తకి చేరువగా వున్న కుర్చీలో కూర్చుంది

పతంజలిగారికి అలా కూర్చోటం ఇబ్బందనిపించి "బోసూ! పైకెళ్ళి అమ్మాయితో గెస్టులంతా వచ్చేరని చెప్పు" అన్నాడు.

బోసు అలాగేనని తలూపి లేచి పైకెళ్ళాడు.

అతడు పైకెళ్ళటంచేత, అక్కడున్న మిగతావాళ్ళందరికీ జరిగిన సంగతి తెలియటంచేత, నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ పతంజలిగారన్నారు.

"మా పిల్లతత్వం ఏమిటో అర్థం కావటంలేదు. దాని సంతోషంకోసం అదేం చెప్పినా కాదనం. కాని జీవితంలో ఆ సంతోషం మిగుల్తుందాని భయంగావుంది"

పతంజలిగారి కళ్ళల్లో నీళ్ళు.

"అదే మనంచేసిన తప్పు. అందర్లాగా మనం దాన్ని మొదట్నించి కట్టు బాటలో పెంచుంటే ఈ రోజున మనకి ఆవేదన భయం వుండేవి కావు. మొదట్నించీ నేచెబుతుంటే మీ తలకెక్కింది కాదు. అది జీవితంలో ఎవ్వరూ సాధించనిది గెల్చి మీకేదో గొప్ప పేరు తెస్తుందని అనేవారు! చివరికి సాధించింది. చాలా గొప్ప పేరే తెచ్చింది"

అన్నపూర్ణమ్మగారు అక్కసుగా అంది భర్తవంక చూస్తూ.

పతంజలిగారు తలొంచుకున్నారు.

అంతలో బామ్మగారు కల్పించుకుంది.

"అలా అనుకోవటమే పెద్ద పొరపాటు. పిల్లల్ని కంటారుగాని వాళ్ళ వాళ్ళ అదృష్టాలని కంటారా? అసలు పిల్లలపైన ఆశలు పెంచుకోవటం అన్నిటి కంటే పెద్ద తప్పు. అదే బాధలకి, అశాంతికి మూలం. పిల్లల్ని కర్తవ్య పరంగా పెంచాలేగాని, వాళ్ళేదో పెరిగి పెద్దవాళ్ళయి మనకి తవ్వి తలకెత్తుతారన్న ఆశతో పెంచకూడదు. గీతలో క్రిష్ణభగవానులవారు చెప్పినట్లు — మన ధర్మం మనం నిర్వర్తించాలి, ఫలితం ఆయన కొదిలెయ్యాలి... అంతే!"

అక్కడ కూర్చున్నవాళ్ళంతా బామ్మగారి ప్రవచనాలని వింటూ—అసలిందుకేనా ఇక్కడి కొచ్చిందన్నట్లుగా మొహాలు పెట్టేరు.

శ్రీలేఖ పైనించి దిగొచ్చింది. చేతిలో పెద్ద ట్రేవుంది. దాన్నిండా పాయసం గ్లాసులు. అందరికి తలొకటి ఇచ్చింది. ఇస్తూనే అందర్నీ ఆప్యాయంగా పలకరించింది. సుబ్రమణ్యాన్ని, అతనికి ఎదురుగా తలొంచుక్కూర్చున్న రమణిని మార్చి మార్చి చూసి చిలిపిగా నవ్వింది.

"బోసు ఏంచేస్తున్నాడమ్మా?" అనడిగారు కూతుర్ని.

"మీరు అతడిచేత వ్యాయామం చేయించటం లేదని నేకాస్త పనిచ్చా. పైన మసి గిన్నెలు తోముతున్నాడు" అంది గలగలా నవ్వుతూ.

చాలారోజుల తర్వాత ఆమె ఆ ఆ విధంగా హాయిగా, స్వచ్ఛంగా నవ్వటం చూసి పతంజలిగారు సంతోష పడ్డారు.

"చిన్నీ! వీళ్ళందర్నీ పిల్చి ఇక్కడ వదిలేసి మళ్ళీ పైకెడతావేం" అంది అన్నపూర్ణమ్మగారు మందలిస్తున్న ధోరణి

ణిలో.

"వుండమ్మా! పైన బోసుబాబున్నాడు. పాపం అతడి వాటాగూడా అతడికిచ్చేస్తే మొదలు పెట్టిన పని పూర్తవుతుంది. అప్పుడు నే ఫ్రీ" అంటూ పైకి పరిగెత్తింది.

అక్కడున్న వాళ్ళంతా అర్థం కానట్టు మొహాలు పెట్టి వెళ్తున్న ఆమె వైపే చూస్తూ పాయసం సేవిస్తున్నారు.

"మీ పిల్ల అందర్లాంటి పిల్లకాదు-చిలిపితనం, చిన్నతనమే కాదు, ధైర్యం పట్టుదలకూడా వున్నాయ్. తప్పకుండా ఆమెకి జయం కలుగుతుంది" అంది బామ్మగారు. ఆ మాటలు ఎందుకందో, ఏంగమనించి అన్నదో ఎవ్వరికీ అర్థం కాలేదు. ఆవిడ మాటలింకా పూర్తికాక మునుపే మేడపైనించి...

పిడుగుల వర్షం కురిసినట్లు, మేఘం గర్జించినట్లు, భూగోళం ఫెళ్ళున బద్దలైనట్లు... పెద్ద శబ్దం...

ఒకసారి కాదు రెండుసార్లు వెంట వెంటనే-

ఢాం ఢాంమని తుపాకీ పేలిన శబ్దం-

ఆ శబ్దానికి, ఆ భావనకి, ఆ భయానికి అక్కడ కూర్చున్న వ్యక్తులందరూ కుర్చీలకి అతుక్కుపోయేరు. కదలిక లేక బిగుసుకుపోయారు.

మొదటగా తేరుకుంది పతంజలిగారే.

ఆయన చువ్వలాగా లేచి నిల్చున్నారు.

అన్నపూర్ణమ్మగారు భయంతో పెద్ద కేక-పొలికేక పెట్టింది.

"చిన్ని కొంపముంచిందండీ! అలా చూస్తారేం... వెళ్ళి చూడండి"

ఆ కేక విన్నాకగాని అప్రయత్నంగా లేచినిల్చున్న పతంజలిగారిలో చలనం వచ్చింది కాదు.

కాని పైకి వెళ్లాలంటే ధైర్యం చాలటం లేదు. జరిగిందేవిటో ఆయనకర్థమైంది.

"చిన్నీ! ఎంత పన్చేసేవమ్మా? నీకు నువ్వే శిక్షించుకున్నావా?" నిలబడే, అప్పుడే భూమ్మీదపడ్డ పిల్లవాడిలా ఏడుస్తున్నారు.

బామ్మగారు లేచి నిల్చుంది.

ఆవిడతోపాటు రామసూర్యంగారు, సుబ్రమణ్యంకూడా లేచి నిల్చున్నారు.

కాని ఎవరికి వారికే పైకెళ్లాలంటే, వెళ్లి క్షణం క్రితం పలకరించి పాయసం ఇచ్చిన ఆ పిల్లని నెత్తుటివాగులో చూడాలంటే ధైర్యం చాలటంలేదు.

అందరూ అలా స్థాణువులయి నిల్చుండగా, పతంజలిగారు ఏడుస్తూనే మెట్లెక్కి పైకెళ్లారు.

ఆయన వెనకాలే సుబ్రమణ్యం, రామసూర్యంగారు, బామ్మగారుకూడా వెళ్లారు.

హనుమాయమ్మగారు, రమణి మాత్రం అక్కడే నిల్చుండిపోయారు.

పైకెళ్ళి కన్పించిన దృశ్యాన్ని చూసి పతంజలిగారు ఏడుపుని మర్చిపోయారు.

వెన్నుపూసలోంచి సన్నపాటి వణుకు, చలి.

సుబ్రమణ్యం, రామసూర్యంగారు కూడా స్థాణువులయి నిల్చుండిపోయారు.

శ్రీలేఖ గది మధ్యగా నిల్చునుంది. చేతిలో తుపాకీ వుంది. అదింకా పొగలు కక్కుతోంది.

ఆమె కాళ్ళవద్ద బోసుబాబు పడి వున్నాడు.

కళ్లు తెరుచుకునే వున్నాయి. కాని ప్రాణాలులేవు.

అతడి శరీరంలోంచి కారిన నెత్తురు ఆ గది నేలపై పెద్ద మడుగుగా తయారైంది.

పతంజలిగారు తేరుకున్నారు. పిచ్చిగా

అరిచారు.

"చిన్నీ! ఏమిటే నువు చేసింది?" తూలి వెనక్కి పడిపోబోయారు.

వెనగ్గావున్న సుబ్రమణ్యం, రామసూర్యంగారు ఆయన్ని గట్టిగా పట్టుకున్నారు.

శ్రీలేఖ మొహంలో భయంలేదు. ఆమెలో కంగారులేదు. రక్తాన్ని చూసిన భీతాహంలేదు. పాయసం గ్లాసుని పుచ్చుకున్నంత తేలిగ్గా తుపాకీని పట్టుకు నిలబడింది.

మహిషాసురుణ్ని చంపిన కనకదుర్గలా వుంది.

పైగా చిన్నగా నవ్వుతోంది.

"ఎందుకు డాడీ...అంతలా కంగారు పడతావ్! నేనేం చేసానని?"

పతంజలిగారు పెద్దగా అరిచారు.

"వాణ్ని నిలువునా చంపి... ముందా తుపాకి కింద పడెయ్యి"

శ్రీలేఖ పడేసింది కాదు. "ఏం భయం లేదు. ఇంకెవర్నీ చంపను. నేచావను..అనుకున్నదేదో పూర్తిచేసాను"

సుబ్రమణ్యం కదిలి గదిలోకెళ్ళబోయాడు-

"ఆ తుపాకీ ఇటివ్వండి" అంటూ.

శ్రీలేఖ హెచ్చరికగా అంది- "ఎవరూ లోపలికి రావటానికి ప్రయత్నించకండి. నేనాట్టే మంచిదాన్ని కాదు"

ఆ మాటతో ఎక్కడివాళ్ళక్కడే ఆగిపోయారు.

అంతలో హనుమాయమ్మగారు, రమణి సాయంపట్టి అన్నపూర్ణమ్మగారిని పైకితీసుకొచ్చారు.

ఆమె బతికున్న కూతుర్ని చూసి నవ్వాలో, చచ్చిపడున్న బోసునిచూసి ఏడ్వాలో తెలీక కళ్ళుతేలేసి, స్పృహతప్పి పడిపోయింది.

పతంజలిగారు ఏడుస్తూనే వున్నారు- "నీకేదో పిచ్చిపట్టిందే..ఎంత పన్చేసావే" అంటూ.

శ్రీలేఖ గట్టిగా, కోపంగా, వుక్రోషంగా అరిచింది.

"నాకేం పిచ్చిపట్లేదు. అయామ్ ఆల్ రైట్. నన్ను మభ్యపెట్టి అబద్ధాలు చెప్పి, మోసంచేసిన రాస్కెల్ వీడే డాడీ!"

పతంజలిగారు కూతురుచెప్పిన సంగతి విని ఆశ్చర్యపోయేరు.

రామసూర్యంగారు-'ఏవిటమ్మా!నిన్ను మోసంచేసింది ఇతడా? సుబ్రమణ్యం కాదా?" అనడిగారు నమ్మలేనట్లు.

"సుబ్రమణ్యం అమాయకుడు-అయ్ లైక్‌హిమ్. నన్ను మోసంచేసింది వీడే- మోసాన్ని నేభరించలేను"

పతంజలిగారు కల్పించుకుంటూ-

"అయితే మాత్రం అలా కాల్చిచంపుతావా? ఆ మాటేదో మొదటే చెప్పుంటే అతడితోనే మాట్లాడి...."

ఆయన మాటని పూర్తిచేయనీకుండా శ్రీలేఖ-

"పెళ్ళిచేసుండేవారు కదూ-అంతే మీ పెద్దాళ్ళు. మోసంచేసిన మగాడి కాళ్ళు పట్టుకుని అతడికిచ్చి పెళ్ళిచెయ్యటం, కాదంటే డాక్టరు దగ్గరికి తీసుకెళ్ళటం ఈ రెండే తెల్సు'' అంది.

సుబ్రమణ్యం అన్నాడు-

"జరిగిన మోసంలో తప్పులో నీకూ భాగం వుందిగా. కేవలం అతడొక్కడే కారకుడన్నట్టుగా మాట్లాడతావేం"

శ్రీలేఖ అతణ్ని చూసి చిన్నగా నవ్వింది.

"నిజమే. మోసపోయింది నేనొక్కదాన్నే అయితే నాది కూడా తప్పుందని

అందరిలాగా తప్పుకుపోయేదాన్ని. కాని ఈ బోసుబాబుకి పెళ్ళికాని ఆడపిల్లల బతుకుల్తో ఆడుకోవటం హాబీ అని అర్థమయింది"

"మరయితే నా మనవడి పేరెందుకు చెప్పావ్? వాడు తలెత్తుకు తిరగలేకపోతున్నాడు" అంది బామ్మగారు.

శ్రీలేఖ నిల్చున్న చోటునించి కదిలింది.

"అది నాతొందరపాటు! అసలు సంగతి చెప్పలేక అప్పట్లో నోటికొచ్చిన పేరు అనేశాను" అంటూ గదిబయటకొచ్చింది. బాల్కనీలోవున్న ఫోన్‌వైపుగా వెళ్ళింది.

అందరూ ఆమెవంక ఆశ్చర్యంగా చూస్తున్నారు.

నెంబరు డయిల్చేసింది మెల్లిగా. తాపీగా చెప్పసాగింది.

"హలో... పోలీస్‌స్టేషనా? నా పేరు శ్రీలేఖ. నేనో రాక్షసుణ్ని కాల్చిచంపేను. శవంకూడా ఇక్కడేవుంది. త్వరగారండి- అడ్రస్సు రాసుకోండి"

రమణి భయంతో తల్లిని పట్టుకుంది.

శ్రీలేఖ ఫోన్చేసి తిరిగి గదిలోకెళ్ళింది. చటుక్కున తలుపులు మూసి గడియ పెట్టుకుంది.

పతంజలిగారితోపాటుగా అక్కడున్న వాళ్ళంతా కంగారుగా ఒక్కసారిగా అరిచేరు.

"నేనేం చావను...అంత పిరికిదాన్ని కాదు. మరెవరూ లోనికి రాకుండా మాత్రమే తలుపు మూసేను... అంతే!" అంది కిటికీలోంచి.

అన్నపూర్ణమ్మగారికి స్పృహ తెల్సి వెర్రిగా మతి చలించినట్లు భర్తవంక చూస్తోంది. పతంజలిగారు కూతురి గురించి బాధపడాలో, భార్య గురించి బాధపడాలో తెలీక అదోరకమైన విచిత్ర స్థితిలో వున్నారు.

అక్కడున్న మిగతావాళ్ళంతా గది కిటికీవద్ద నిల్చున్న శ్రీలేఖనేచూస్తున్నారు. ఆమె చెబుతున్న సంగతిని అత్యంతాసక్తిగా వింటున్నారు.

"ఈ బోసుబాబు మా ఇంటికొచ్చేది ఆసనాల కోసం, ఆరోగ్య సూత్రాల కోసంకాదు-నా కోసం. ఒకరోజు కాలేజీకెడుతుంటే నన్ను చూసేడు. అప్పట్నించీ ప్రతిరోజూ విష్ చేసి పలకరించేవాడు. పరిచయాన్ని పనిగట్టుకుని పెంచేడు. ప్రేమిస్తున్నానన్నాడు. నేకాదంటే చచ్చిపోతానన్నాడు. నమ్మేను. అన్నీనమ్మేను...కాదు నమ్మించాడు"

"ఆ తర్వాత" అడిగింది బామ్మగారు.

"ఒకరోజు ఎవరూ లేనపుడు ఇంటికొచ్చేడు. రెచ్చగొట్టేడు. నాక్కూడా మనసు చలించింది. పెళ్ళి చేసుకుంటావాని స్పష్టంగా అడిగేను. చేతిలో చెయ్యేసి ప్రమాణం చేసేడు"

"ఆ తర్వాత చేసుకోనన్నాడా?" రామసూర్యంగారడిగారు.

"అనటమేకాదు... మొహం తప్పించి తిరగసాగేడు. నాకనుమానం వచ్చి అతడికి తెలీకుండా అతడి గురించి ఎంక్వయిరీ చేసేను. చాలా దారుణమైన విషయాలు బయటపడ్డాయ్. అతడిచేత మోసగింపబడ్డదాన్ని నేనొక్కదాన్నే కాదు. అలా అయితే ఈపాటికి బతికుండేవాడు. ఎంతోమంది ఆడపిల్లల్ని సరిగ్గా ఇలాగే నటించి ప్రేమిస్తున్నానని చెప్పి, అనుభవించి, తప్పుకున్నాడు.

ఇతనిమాటలువిని ఇళ్ళని, తల్లిదండ్రులని వదిలి వచ్చేసిన అమాయక ఆడపిల్లలు, ఇతడి మోసానికిగురై ఇంటికి

వెళ్లలేక, బతకటానికి వేరే దారిలేక, కొంతమంది లాడ్జింగులకి అంకితమైతే, ఇంకొంతమంది ఆత్మహత్యలు చేసుకున్నారు.

"నేనూ అలాగే సమాధానపడి తప్పుకు పోతానని అనుకున్నాడు. ఎప్పుడైనా రోగాన్ని చంపాలేగాని రోగినికాదు. ఒక రోజు మా డాడీ నిలేసి అడిగేసరికి ఏం చెప్పాలో తెలీక సుబ్రమణ్యం పేరు అడ్డం వేసుకున్నాను. అతడు డాడీ ఫ్రెండ్ కొడుగ్గాబట్టి,తొందరపడి గొడవచెయ్యడని. ఈలోపు బోసుతో మాట్లాడొచ్చని అనుకున్నాను. కాని నా అంచనా తారుమారైంది. దానివల్ల పాపం వాళ్లిద్దరికీ కష్టాలొచ్చిపడ్డాయ్...అయామ్ సారీ"

రమణికి ఆమెని చూస్తుంటే జాలి, ధైర్యం, గర్వం కల్గేయ్.

శ్రీలేఖ మళ్ళీ చెప్పసాగింది.

"నే తల్లిని కావటానిక్కారణం సుబ్రమణ్యం అని అనాలోచితంగా చెప్పటంతో బోసుబాబుకి ధైర్యంవచ్చింది. ధైర్యంగా ఇలా రాగలిగేడు. ఇతడివల్ల నాలాంటి ఇంకొంతమంది ఆడపిల్లలు మోసపోవటం నాకిష్టంలేదు. అంచేతే ఇలా చేసేను"

పతంజలిగారు ఏడుస్తూనే అన్నారు.

"ఇపుడు నీ బతుకేవిటమ్మా...ఆలోచించేవా?"

"మొగాడి తప్పుని, ప్రోత్సాహాన్ని ఆడది దాచేసుకోవటంచేతే వాళ్ళు మహరాజుల్లాగా దులుపుకు తిరిగేస్తున్నారు. ఇపుడు నే చేసినపనికి చట్టం శిక్షిస్తుంది. నాకు తెలుసు. సరిహద్దుల్లో శత్రువులని చంపితే బిరుదులిచ్చే ఈ ప్రభుత్వం నేచేసినపని తప్పంటుంది.జైలుశిక్షవేస్తారు. ఏం ఫర్వాలేదు డాడీ! అక్కడే ప్రసవిస్తాను. శిక్షని నవ్వుతూనే అనుభవిస్తాను. విడుదలయ్యాక నే, నా బిడ్డా బతకటానికి ఈ సమాజం ఒక ఏర్పాటు చెయ్యాలి. అది దాని నైతిక బాధ్యత"

బామ్మగారు రెండడుగులుముందుకేసి-

"అమ్మాయ్ శ్రీలే..చెప్పొద్దూ...

మొదటిసారి నిన్ను చూసినపుడు అసహ్యించుకున్నా. నా మనవ నెత్తిన అపవాదు వేసినపుడు కోపగించుకున్నా. కాని ఈ క్షణంలో నిన్ను చూస్తుంటే గర్వంగా వుంది. కారణం తెలీదు. బహుశా నేనూ ఆడదాన్ని కావటం వల్లనేమో! ఈ రోజుల్లో ప్రతి ఆడది నీలాగే వుండాలని నేననుకుంటున్నా. కొత్త మార్గాన వెళ్లేవాళ్ళకి కష్టాలు తప్పవు. ధైర్యంగా వెళ్లిరా! నువు తిరిగొచ్చేవరకూ నేబతికుంటే - వుంచమని ఆ దేవుణ్ని ప్రార్థిస్తాను-నీకు, నీ బిడ్డ సేవచేస్తాను"

రమణికి చిత్రంగా దుఃఖం పొర్లుకొచ్చింది. వెక్కి వెక్కి ఏడసాగింది.

దూరాన్నించి పోలీసు సైరను వినిపిస్తోంది.

అన్నపూర్ణమ్మగారు గుండెలు బాదుకుని ఏడుస్తోంది. పతంజలిగారూ అదే పరిస్థితిలో వున్నారు.

రామసూర్యంగారు, హనూయమ్మగారు పక్కగా వొదిగి నిల్చున్నారు.

సుబ్రమణ్యం ఏడుస్తున్న రమణిని చూసేడు. అతడికి జాలనిపించింది. మెల్లిగా కదిలి ఆమెని సమీపించి, ఆ భుజాల చుట్టూ తన బలమైన [illegible] చేడు. రమణి ఏడుస్తూనే అతడి భుజంపైన తలవాల్చింది.

# చిక్కని చాతుర్య

'విశ్వనాథాన్ని వదిలించుకోవడం ఎలా?' అన్నది ప్రస్తుతం కేశవరావు, పార్వతిలను వేధిస్తున్న సమస్య. ఏదో వైద్యం కోసమని హైదరాబాద్ వచ్చి చికిత్స పూర్తయినా అక్కణ్నించి కదలకుండా, ఇంకాకాలం ఆస్పత్రికి అందుబాటులోనే ఉండడం మంచిదంటూ కేశవరావు, పార్వతి కాపురముంటున్న ఆ రెండు గదుల ఇంట్లోనే తిష్టవేశాడు విశ్వనాథం.

విశ్వనాథం.

అప్పుడు వెలిగింది కేశవరావుకి. వచ్చినప్పటినుంచీ గమనిస్తున్నాడు ఆయన మాటల్లో పెళ్లాం పిల్లల ప్రస్తావన తేనిరోజు లేదు. ఏదో సందర్భంలో వాళ్ళ గురించి చెప్పడం మొదలెట్టి, అవతలివాళ్లు వింటున్నదీ, విసుక్కుం



ఆయవల్ల పాపమా కొత్త దంపతులకి ఏకాంతం కరువవడమేగాక, ఇతర ఇబ్బందులు కూడా బోలెడన్ని! ఆయన భార్యాభర్తలిద్దరి తరఫునా కూడా బంధువే అవడమనేది సమస్యను మరింత క్లిష్టం చేసింది. అందువల్ల ఒకరుగాకపోతే ఒకరైనా ఆయనతో నిర్మొహమాటంగా మాట్లాడి వదుల్చుకునేందుకు వీలుపడటం లేదు.

రోజూ పొద్దున్నే కాఫీ తాగుతూ కేశవరావు దగ్గిర, "మా ఆవిడుంది చూశావూ..." అంటూ మొదలెట్టాడు



టున్నదీ గమనించకుండా కనీసం అరగంట వరకైనా చెప్పుకుపోవడం ఆయనకో అలవాటు. వాళ్ళగురించి చెప్పి పరవశించిపోయే గుణం ఆయనలో అధికమని కనిపెట్టాడు కేశవరావు.

"...మా అమ్మాయి ముందుముందో గొప్ప రచయిత్రి అయిపోతుంది సుమీ! ఇప్పటికే అది రాసిన ఉత్తరాలు అన్ని పత్రికల్లోనూ పడుతున్నాయి. ఇక కథలు, నవలలు రాయడం మొదలెట్టిందా దానికి అట్టే టైమ్ పట్టదులే! ఈ మధ్యనో పత్రిక పెట్టిన వంటల పోటీలో దానికి బహుమతొచ్చింది తెల్సా? అది ఇంత వరకూ వంటింటి ఛాయలకు పోని పిల్లే

## కథాలు

అయినా మా ఆవిడ చేసిన ఓ కొత్త వంటకం గురించి రాసి ఆ బహుమతి గెలుచుకుంది. ఇంతకీ ఆ వంటకం మేం రుచి చూడనేలేదు. మా అబ్బాయి పెంచుతున్న కుక్కపిల్ల 'టామీ' మూతి పెట్టడంతో వండినదంతా పారేయాల్సి వచ్చింది. టామీ కూడా ముందు తిన బోయిందేగాని దానికి ఏమైందో మరి. ఆ తర్వాత మరి ముట్టనేలేదు. దాంతో అంతా చెత్తకుండీ పాలయింది. అది అలా వృధా అయితేనేం మా అమ్మాయికి పేరూ, కాస్త డబ్బూ వచ్చింది..."

అలా ఆయన వాక్ప్రవాహం ఎంతసేపు సాగిపోయేదోగాని, అంతసేపు ఆయనకు చెవులు అప్పగించే ఓపికలేని కేశవరావు, "విశ్వనాథంగారూ..." అంటూ అడ్డుకున్నాడు.

"ఏమిటోయ్?" అతనలా డిస్టర్బ్ చేసినందుకు విసుక్కున్నట్టు మొహం చిట్లించాడాయన.

కేశవరావు తన పథకాన్ని అమల్లో పెట్టడానికి సమాయత్తమయాడు. "మీకు భార్యాపిల్లలపట్ల ఇంత మమకారం వుంది కదా..."

కేశవరావు మాట పూర్తిగాకుండానే విశ్వనాథం అందుకుని, "ఒక్క నాకేనేమిటోయ్! వాళ్ళకి మాత్రం నేనంటే వల్లమాలిన ప్రేమకాదూ! నన్ను విడిచి ఒక్కరోజైనా వుండలేరంటే నమ్ము..." అంటుంటే,

తన పాయింటుకే ఆయన రావడం చూసి కేశవరావు ఉత్సాహాన్ని ఆపుకోలేక, "అదే...అదే నేను చెబుతూంట! మీరు ఇన్నాళ్ళూ ఇక్కడున్నందుకు వాళ్ళు బెంగపెట్టుకోరూ?" అన్నాడు - ఈ మాటతో, "నిజమే సుమీ" అంటూ ఆయన వెంటనే వూరికి ప్రయాణమవుతాడని అతని ఆశ.

దానికి ఆయనకు ఏదో స్ఫురించినట్టు మొహం వెలిగింది.

"అవును సుమా! నేనామాటే మర్చిపోయాను. ఇప్పటికే వాళ్లు ఏదోలా అయిపోయుంటారు. నేను మరి నాలుగురోజులు సిటీలో వున్నవన్నీచూసి వెళ్ళేటప్పటికి ఏమవుతారో ఏమో! అందుకని వాళ్ళను కూడా ఇక్కడికి పిలిపిస్తేపోలా! ఈ నాల్రోజులూ సరదాగా అందరమూకలిసే తిరుగుతాము. వాళ్ళకి తంతి ఇవ్వడానికి ఆఫీసు ఈ దగ్గర్లోనే వుందా? వెంటనే బయలుదేరి రమ్మని వాళ్ళకి టెలిగ్రామ్ నేనే ఇవ్వనా? ఆఫీసుకెళ్ళేప్పుడు కాస్త అదేదో నువ్వే ఇచ్చి పుణ్యం కట్టుకుంటావా?"

ఖాళీఅయిన కప్పులు పట్టుకెళదామని అక్కడికి వచ్చిన పార్వతి భర్త మొహం చూసి కంగారుపడింది. కేశవరావు కళ్లు తేలేసి, స్పృహతప్పి పడిపోవడానికి రెడీగా వున్నాడు.

—జాకీ

## లౌక్యం

సనత్‌నగర్ వచ్చేసరికి, వున్నట్టుండి కుమార్ స్కూటరు 'క్రుయ్రుయ్' మని శబ్దం చేస్తూ సడన్‌గా నడిరోడ్డుమీద ఆగిపోయింది.ఆర్టీసీబస్సు డ్రైవరు సరైన సమయంలో బ్రేకువేసి రికార్డు సృష్టించ బట్టి సరిపోయిందిగానీ, లేకపోతే కుమార్




కొత్త కాపురం కూలిపోయేదే!

ఫస్టు తారీఖున జీతం తీసుకోగానే సరాసరి ఇంటికే రమ్మని మరీమరీ చెప్పింది ఇల్లాలు రాజ్యలక్ష్మి. ఓ గంట పర్మిషను పెట్టి అయిదింటికల్లా ఇంట్లో వుంటానని ప్రామిస్ చేసేడు. ఇప్పుడేమిటి చేయడం? ఈ తతంగాన్నంతా చూస్తున్న రిక్షావాలా ఒకడు కుమార్ వాలకాన్ని కనిపెట్టేసినట్టు ... "దాలో సాబ్! చలేంగే" అంటూ స్కూటర్ని ఎత్తి పట్టుకున్నాడు ఓ వైపు.

"ఆగాగు! ఏం మాట్లాడుకోకుండానే రిక్షా మీద పెట్టేస్తున్నావ్? దగ్గర్లో ఏదేనా రిపైర్ షెడ్డుకి తీసుకెళ్లు... ఎంతివ్వమంటావు?" అన్నాడు.

"పాంచ్ దో" అన్నాడతను.

నిజానికి అక్కడికి దగ్గర్లో ఓ స్కూటర్ సర్వీసు షెడ్డుండాలి. అయినా ఇవతల ఫస్టు తారీఖు, జేబునిండా జీతం! అవతల బెస్టుహాఫ్, కొత్త భార్యామణి కోరిక ... సినిమా! అయ్యో! టైమై పోతోంది! అప్రయత్నంగా రిక్షాలో కూర్చుని, "ఓ రూపాయి ఎక్కువిస్తాగానీ త్వరగాపోనీ" తొందర చేసేడు కుమార్.

* * *

షెడ్డువాడు కథంతావిని, నాల్రోజుల తరవాత రమ్మన్నాడు...బతిమిలాడేక, రెండ్రోజులకి గడువు తగ్గించేడు. స్కూటరక్కడ వదిలి, రెణ్ణిమిషాలు బస్టాప్‌లో నిల్చున్నాడు. అట్టే నిలబడలేక, అసహనంగా ఆటోపిలిచి, "చిక్కడపల్లి..." అన్నాడు.

* * *

భార్యామణి కోపతాపాలు తీర్చి సినిమాహాలు చేరేసరికి అయిదున్నరయింది. ఎదురుగా చాంతాడంత 'క్యూ' వుంది. ఆలోచిస్తూండగానే ఏదో స్కూటరు కుమార్ని రాసుకుంటూ వచ్చి నిలబడింది. కోపంగా స్కూటరువాలా మొహంలోకి చూసేడు కుమార్ ... అంతే! నోట మాట రాలేదు, డామిట్!.... అది రిపైరింగుకోసం ఇచ్చిన తన స్కూటరే! వాడు ... జిడ్డోడుతూ రెండ్రోజుల టైమిచ్చిన స్కూటరు మెకానిక్కు భార్యతోసహా వేంచేసేడు!

—కస్తూరి వేణుగోపాల్

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 482.

CHATURA Telugu Monthly, Hyderabad-500482. Regd.No. H/HD

# ప్రకృతి చెప్పే పాఠాలు...

